# ఇసుక భూమిలో సస్యక్షేత్రము

ఇసుక భూములలో నీరు నిలువదు. అంతేకాక, నీటితోపాటు వేసిన ఎరువు కూడ పైరు కందకుండపోవును. కావున, ఇవి ఇంతవరకు సేద్యయోగ్యములు కావు.

కాని, ఇప్పుడు సిమెంట్ సహాయముతో అట్టి భూములను సస్య శ్యామలము చేయవచ్చును. ఇసుక భూమిపై 5 శాతము సిమెంట్ కలిపిన మట్టిని ఒక పొర వేసిన, పెట్టిన నీరు, చల్లిన ఎరువు లోపలికి పోవు పొరపై పరచిన మట్టిలో ఎట్టి పైరైన పండించవచ్చును.




K C P

**సిమెంటు** — వ్యవసాయములో ఒక కొత్త అధ్యాయము ప్రారంభించినది.

**ది కె.సి.పి.లిమిటెడ్.**

వారిచే ప్రకటించబడినది.

ఇతర వివరములకు:

ది సిమెంట్ సర్వీస్ బ్యూరో

1, ఎల్డామ్స్ రోడ్, మద్రాసు-18. ఫోన్: 445799

వారిని సంప్రదించండి.

SISTAS.KCP.231TE

అమ్మా,
వాళ్ళ
బాత్‌రూమునుండి
అంత చెడ్డ
వాసన వస్తుందేం,
మనదాంట్లో మంచి
వాసనేస్తుండగా?

మనం
ఒడోనిల్
వాడతాముగా మరి!



ఓడోనిల్ భరించలేని దుర్వాసనలను క్షణంలో దూరం చేసి మీ మరుగు దొడ్డిని పరిశుభ్రంగా తాజా సువాసనలతో నింపుతుంది. ఓడోనిల్ అనేక సువాసనలలో లభిస్తుంది. రకరకాల [illegible]నూ, నమూనాలలోనూ, ప్యాక్‌లలోనూ లభిస్తుంది.

**బల్సారా**

—సౌఖ్యమైన జీవనానికి
అధునాతన సాధనాలు

BALSARA బల్సారా అండ్ కంపెనీ (ప్రై.) లి.
43, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001.

CHAITRA-BLS-6 Tel

# ఉత్తరాలు

విశాఖపట్నం పాఠకుని ఉత్తరానికి సంబంధించిన భోజుని శ్లోకం "సమయోచిత పద్యమాలిక" అన్న సంస్కృత గ్రంథంలో లభ్యమయింది. ఆ శ్లోకం పూర్తి పాఠం ఇది

1 "భిక్షో! మాంస నిషేవణం,
2 కిముచితం కింతేన మద్యంవినా
3 మద్యంచాపి తవప్రియం
4 ప్రియ మహో వారాంగనాభిః సహ
5 వారస్త్రీ రతయే కుతస్తవ ధనం
6. ద్యూతేన చౌర్యేణవా
7 చౌర్యద్యూత పరిశ్రమోపి భవతో
8. భ్రష్టస్య కావాగతిః"

1. భోజుని ప్రశ్న 2 కాళిదాసు సమాధానం
3. ,, 4. ,,
5. ,, 6. ,,
7. ,, 8. ,,

ఈ ప్రశ్న — సమాధానము మొత్తం కలిసి పూర్తి శ్లోకం నాలుగుచరణాలా అవుతాయి.

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్, (వరంగల్)

## కథలు

15—6—73 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురింపబడిన మధురాంతకం రాజారాంగారి కథ బంగారు పొయ్యి చాలా బావుంది. ఒక ఆడది, మగవాడు ఉత్తమ స్నేహితులుగా జీవితాంతం సహజీవనం చేయటం అన్యోన్య దాంపత్యానికి పునాది అని అని రచయిత అందజేసిన సందేశం అందరూ గమనించదగ్గది. రచయితకు నా అభినందనలు.

ఉమ, 30 స్క్వాడ్రన్ ఐ. ఏ. ఎఫ్ 99ఏ పి.ఒ.

## ముఖచిత్రం

నర్తకి కిళ్ మిస్ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక (22—6—73) అత్యాకర్షణీయకరముగా యున్నది మా అభిమాన నాట్యతార (నర్తకి) జ్యోతిలక్ష్మి ముఖ చిత్రముతో పత్రిక ఎప్పుడు వెలువడునా అని ఆశతో ఎదురు చూస్తున్నాము.

కె గోలింగేశ్వరస్వామి, ఆర్. రాజా లలితకుమార్, (అమలాపురము)

## ప్రత్యేక రాష్ట్ర సమస్య

కలసియుంటిమి నేటి దాకను
కలసియుండుట నష్టమంచును
తెలిసినప్పుడు వదలకుండన్
కలసియుండుట యెట్టులు?
కలసియుందము కలసియుందము
కలసియుండుట లాభమంచును
తెలుపుచుండెడి వారి మాటలు
తలచుకొను వారెవ్వరు?
కలసియుండదము కలసియుండదము
కలసియుండదము కలసియుండదము
కలసియుండెడి సఖులు మెపుడో
తొలగిపోయిన ధర్మ్యోగః

కలిసమతులై పోదరాంధ్రుల
కాల్చి చంపుట జరిగినప్పుడు
కన్నులారగ జూచియుండియు
కలసియుండుట యెట్టులు?

కోగంటి దుర్గా మల్లికార్జునకవి (పొన్నూరు)

* * *

29—6—73 పత్రికలోని శ్రీసర్వోత్తమరెడ్డి గారి ఉత్తరం చదవగా, వారు నాటి, నేటి, తెలంగాణా, ఆంధ్రోద్యమాల్లో గల వాస్తవాన్ని నిష్పక్షపాత దృష్టితో చూడలేక పోయారనిపిస్తుంది ఏ హక్కులకొరకు ఆంధ్రులు ఉద్యమం సాగించారో 6 నెలలలోని దినపత్రికలు మరల ఒకసారి చదివితే తెలుస్తుంది.

ఇక 69లో జరిగిన తెలంగాణా ఉద్యమానికి ఆంధ్రులు సానుభూతి చూపనికారణమంటారా — "ఆనాడు తెలంగాణా ఉద్యమం ఆంధ్రులకు వ్యతిరేకంగా ప్రారంభింప బడింది. జంటనగరాలలోని ఆంధ్రులు నానాబాధలకు గురిచేయ బడ్డారు. దినదిన గండంగా గడిపిన రోజులు ఎన్నో! దానికి సాక్ష్యాల్లో రాజధానిలోని ప్రహారిగోడలు, నాడు బాధింపబడిన ఆంధ్రులలో సహ నేనూ ఒకడిని. ఇలాంటి పరిస్థితిలో, ఆంధ్రులు ప్రేమతో తెలంగాణా ఉద్యమానికి సానుభూతి చూపలేదనా శ్రీరెడ్డి గారి ఆవేదన!

అసలు ఎలా చూపించగలరని నా ప్రశ్న!

జై ఆంధ్ర! జై తెలంగాణా వివాదంగా సమ్యక్ దృష్టితో ఉద్యమం జరుపగలవిశిష్టత నేటి ఆంధ్రోద్యమానికే దక్కింది. అనేక ఇతర రాష్ట్రాలవారిని కూడ ఆలోచింప చేసింది. తత్ఫలితంగా వారి మద్దతు కూడా లభించింది.

ఇంతకూ ఇది నేను వ్రాయడానికికారణం శ్రీ రెడ్డి గారివలె ఎందరో అపోహలతోఉండి యుండవచ్చు. వారందరికి ఇదే సమాధానం.

అసలు ఈ విభేదాలు తొలగి భారతపౌరులమనే భావంతో మనగలరోజుకోసం ఎదురుచూద్దాం.

మల్లాది హనుమయ్య. (పర్చూరు)

* * *

22—6—73 పత్రికలో బరంపురం గావె సుబ్బారావు వ్రాసిన ఉత్తరం చదివిన ప్రతి ఆంధ్రుడు కూడా ఇంతకాలం నిద్రపోతూ నేడు మేలు కొన్నట్లుగా కనపడు తున్నది. నేటికి అయినా ఆయన గారు తన సంసిద్ధతను వెల్లడించినందులకు కృతజ్ఞతలు. ఈయన హైదరాబాద్‌లో 20 రోజులు ఉన్నంత మాత్రానే, ఆంధ్రా తెలంగాణా సమైక్యతను గురించి తెలిసిందా! అక్కడ కొన్ని సంవత్సరాలుగా నివసించిన ఆంధ్రులను అడిగితే తెలిసి ఉండేది 69 సం. లో జరిగిన తెలంగాణా ఉద్యమం ఆంధ్రులను హింసించిన హింసాకాండ మరచిపోయి యుండవచ్చు. మొన్న జరిగిన



# రాలిపోతున్న జుట్టును గురించి నేడే ఆలోచించండి.



# రేపటి వరకు ఆగితే తరువాత చింతిస్తారు!

ప్యూర్ సిల్విక్రిన్ నేడే వాడటం ప్రారంభించండి. ఇది శాస్త్రియమైన పరిశోధనలు జరిపి, పరీక్షింపబడిన ఫార్ముయిలా. ఇది 1) జుట్టు రాలిపోవటాన్ని ఆపి వేస్తుంది. 2.) దీనిలో జుట్టు యొక్క కుదుళ్ళలోనికి చొచ్చుకొని పోయి లోపములను పూరించటానికి అత్యావశ్యకమైన 17 ప్రొటీన్లు ఉన్నాయి—జుట్టు తిరిగి ఒత్తుగా మరియు ఆరోగ్యవంతంగా పెరగటానికి సహకరిస్తాయి.



**ప్యూర్ సిల్విక్రిన్ జుట్టు రాలిపోవటాన్ని అరికడుతుందనటానికి ఋజువు.**

వెంట్రుకల కుదుళ్ళలో అతి ముఖ్యమైన అమినోఏసిడ్స్ లేక పోవటం వల్ల జుట్టు పెరుగుదల పలుచగా అనారోగ్యంగా ఉంటుంది. ఈ పరిస్థితిని సరిదిద్దకపోతే అది జుట్టును బలహీన పరచి రాలి పోవటానికి దారి తీస్తుంది.



ప్యూర్ సిల్విక్రిన్ బొట్టు (బాగా పెద్దదిగా చేసినప్పుడు) ఆరోగ్యవంతమైన జుట్టు పెరుగుదలకు అవసరమైన 17 అమినోఏసిడ్స్, సహజమైన ప్రొటీన్లు కలిగి ఉంటుంది. ప్యూర్ సిల్విక్రిన్ వెంట్రుకల కుదుళ్ళ లోతులకు శీఘ్రంగా చొచ్చుకుపోయి మీ జుట్టు తిరిగి ఒత్తుగా, ఆరోగ్యవంతంగా పెరగటానికి ముఖ్యంగా కావలసిన ప్రొటీన్లను అందిస్తుంది

**ప్యూర్ సిల్విక్రిన్ చికిత్స నేడే ప్రారంభించండి!**

మంచి ఫలితాలకు ప్యూర్ సిల్విక్రిన్ క్రమబద్ధంగా వాడాలి ప్యూర్ సిల్విక్రిన్ కొలత ప్రకారం తీసికొని రోజూ రెండు సార్లు, ప్రతి రోజూ పుర్రె అంతా మర్దన చెయ్యండి మీ జుట్టు చక్కగా పెరగటం ఆరోగ్యంగా కనిపించటం మీరు గమనిస్తారు కొద్ది కాలంలోనే విశిష్టమైన ప్యూర్ సిల్విక్రిన్ చికిత్స మీ జుట్టుకు దాని సహజ పెరుగుదలను చేకూర్చుతుంది

# ప్యూర్ సిల్విక్రిన్

(జుట్టు యొక్క సహజ ప్రొటీన్ ఆహారం)

(mcm/S/13 tel




(mcm/S/13 tel)

# ఉత్తరాలు

ఆంధ్రా ఉద్యమములో కూడ పార్లమెంటులో ఆంధ్ర ఇంజనీర్లులకు అల్టిమేటమ్ యిచ్చి వెళ్ళగొట్టిన సంగతి కూడ తెలియదనుకుంటాను.

ఆంధ్రులకు జరుగుతున్న అన్యాయాలు (బడ్జెటులో పడుతున్న గారడి అంకెలు) బైట పడినవి. మొదట ఏ. జి. ఆఫీసులోనే అనే విషయం కూడ తెలియదనుకుంటాను. ఏ. జి. ఆఫీసులో వ్రాత పరీక్షకు అనేక ఆంధ్రులు వెళ్ళినా యెవరూ గ్రహించని విషయం ఈయన గ్రహించినందులకు ఆంధ్రులు గర్వించాలి అనుకుంటాను! పాలుపొంగే ఈ తెలుగు గడ్డను రెండుగా చీల్చటానికి, అటువంటి ఆలోచన ఆంధ్రుల మనసులోనికి రావటానికి కూడ సమైక్యతావాదులమ. అని ప్రచారం చేసుకునే వారే కారకులు. ఈ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి ముఖ్యకారణం ప్రభుత్వం రెండు ప్రాంతాలుగా పరిపాలించుటయే కారణం!

ప్రతి విషయంలో కూడ ఆంధ్రా, తెలంగాణా అనే భేదం సుబ్బారావుగారూ మీ దృష్టిలో లేకపోవచ్చు. ప్రభుత్వ దృష్టిలో మాత్రం ఉన్నది ఎమ్మెకృత అంటే ఒక రాష్ట్రాన్ని రెండు ప్రాంతాలుగా పరిపాలించుట అని మన ప్రజా ప్రభుత్వం చెప్పుచున్నది.

జైహింద్. జై ఆంధ్రా!

వడాల సత్యనారాయణ, (నూజివీడు)

## సంశయం

పాకిస్థాన్ అధ్యక్షుడు శ్రీ భుట్టో తమ రాజ్యాంగ చట్టంలో, స్వాతంత్ర్య రాజ్యమైన బంగ్లాదేశ్‌ను పాకిస్థాన్‌లోని భాగమే అని చిత్రించారుకదా! మరి పాకిస్థాన్‌ను కూడా భారతదేశంలో భాగంగా మన రాజ్యాంగ చట్టంలో సృష్టిస్తే అప్పుడు శ్రీ భుట్టో ఏమంటారు?

ప్రభాకరం, (సెక్కూరి) శివ్వాం.

## మనవి

'డాక్టరు సలహాలు'కి రాస్తున్న వారిలో చాలామంది చర్మవ్యాధులు, జుట్టుకి సంబంధించిన సమస్యలని గురించి అడుగుతున్నారు. వాటికి జవాబులు చాలా పెద్దవిగా ఉంటాయి కాబట్టి ఆంధ్ర పత్రిక (దినపత్రిక) ఆదివారం సారస్వతానుబంధంలో 'డాక్టరు కబుర్లు' శీర్షిక కింద పడుతున్న వ్యాసాలని చదివివారు తమ సందేహాలని తీర్చుకోవలసిందిగా కోరుతున్నాము. —సం.

ఆంధ్రసచిత్ర వారపత్రిక
వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938—1972)
శుక్రవారం : 13-7-73
శ్రీ ప్రమాదీచ సం॥ఆషాఢమాసం.శుద్ధ త్రయో.
సంపుటము : 66 సంచిక : 43
స్థాపితం 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు

## విషయానుక్రమణిక


నేనే పొరపాటు పడ్డానా?


కొండని తవ్వి ఎలుకని పట్టిన చందం
గోధుమ టోకువ్యాపారం ప్రభుత్వ నిర్వహణ
ఫలితం


మీ పి.వి. వేర్పాటు వాదుల మిత్రుడని నేను చెప్పానా లేదా?
సమైకవాదులలో చీలికని తెచ్చిన పి.వి. నరసింహారావు


కలపడానికి ప్రయత్నం
కేంద్రం
షరతులుకావాలనే సమైక్యవాదులు
షరతులు వద్దనే సమైక్యవాదులు

# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

### వాన రాకడ, నాయకుల పోకడ

'వానరాకడ, ప్రాణం పోకడ తెలియవాలిం' అనేది పాతకాలం సామెత. వాతావరణ శాస్త్రజ్ఞులు ఎంత లెక్కలు కట్టి చెప్పినా, వాన ఎప్పుడు వస్తుందో తెలియదు, అలాగే ప్రాణం పోకడకూడ. జ్యోతిష్యులు, వైద్యులు 'ఇక భయం లేదు. నెత్తిమీద రాయివేసినా చావరండీ. మాంచి గట్టి ఆయుస్సు మీది' అని వాక్రుచ్చి వక్కాణించిన మరుక్షణంలోనే ప్రాణాలు ఎగిరిపోతాయి! ఎవరికి తెలుస్తుందా. కాని, ఈ సామెతను—నాయకుల — ప్రస్తుత రాష్ట్ర రాజకీయాలకు అన్వయించక తప్పడం లేదు, ఆంధ్రనాయకుల హస్తినా ఇంద్రప్రస్థ గమనాగమనాలను బట్టి శ్రీ పంత్ వచ్చారు, వెళ్ళారు అటు తర్వాత ఇక్కడినుంచి పలువురు ఇంద్రప్రస్థం వెళ్ళారు జూన్ 21 ప్రాంతీయసంఘం అధ్యక్షుడు శ్రీ రాజమల్లు ఢిల్లీకి పయనం కావడం ఒక విశిష్ట ఘట్టానికి నాంది అవుతోంది ఆయన ఢిల్లీ వెళ్ళడానికి ముందు పలువురు నాయకులతో మాజీ మంత్రి శ్రీ ప్రభాకరరెడ్డి బసలో సంప్రదింపులు జరిపినట్లు తెలుస్తున్నది ఈ సమావేశంలో సమైక్యవాదులలోని వివిధ వర్గాలవారి భావవినిమయం, సందేహ పరిహారణం జరిగాయని అంటున్నారు ఏమైనా, ఆంధ్రప్రజలపై ప్రేలాడే పరస్పరాను మానమా విచ్చుకత్తి ఘటోత్కచశక్తి ఎంతత్వరగా ఉపసంహృతమైతే అంత మేలు.

### అంజలీదేవి చలన చిత్రోత్సవం

జూన్ 2వ వారం చివర శాంతిథియేటర్‌లో శ్రీమతి అంజలీదేవి చలనచిత్రోత్సవాన్ని ఊర్వశి శారద ప్రారంభించడం ఎంతైనా బాగుంది. ఈ ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన శ్రీ జి ఎస్. వరదాచారి అన్నట్లు ప్రేక్షకులు అసంఖ్యాకంగా పాల్గొన్ని ఉత్సవాన్ని విజయవంతం చేయడం అంజలీదేవి చిత్రాల ఎడల విశేష శక్తికి తార్కాణం. ఊర్వశి శారద అన్నట్లు అంజలీదేవి దాదాపు ఒక తరంగా దక్షిణాపథ చలనచిత్రరంగంలో ప్రముఖురాలు. లవకుశలో ఆమె సీత పాత్ర ప్రబంధ నాయికలకు ఏమీ తీసిపోదు. స్వర్ణమంజరిగా దక్షిణాపథాన్ని ఊపివేసిన అంజలీదేవి ఎంతటి బరువైన పాత్రలనైనా అపూర్వంగా నిర్వహించి ప్రేక్షకుల మనస్సులలో, హృదయాలలో కలకాలం పీట వేసుకొన్నది, ఊర్వశి శారదే అన్నట్లు నటులు తరంపైగా కీర్తి ప్రతిష్ఠలతో ఉండడం సులభంగాని నటీమణులు ఉండడం కష్టం. కాని, శ్రీమతి అంజలీదేవి దీని అపవాదం. ఉత్తమ చిత్రోత్సవాల ఏర్పాటు చేసి, ద్వేషదగ్ధమైన ప్రజల మనస్సుల ప్రేమ రమణీయం చేస్తున్న ఆంధ్రప్రదేశ్ సినీ గోయర్స్ అసోసియేషన్ నిర్వాహకులు అభినందనీయులు

మదనపల్లి ఎస్ టి ఆర్ సాంస్కృతిక సంఘం నిర్వహణలో జరిగిన నృత్య పోటీలో ప్రథమ బహుమతిని పొందిన కుమారి కె. సుమతి

### గిరిజన పురోగతి

తెలుగువారికి నేడు కావలసింది కలిసి కట్టుగా పనిచేసే మనస్తత్వం రాజకీయ రంగం మొదలు వాణిజ్యాల సంఘంవరకు ఇది అవసరం ఇలాటి మనస్తత్వం అలవరచుకోడానికి బాల భటోద్యమం వంటివి ఎంతో తోడ్పడుతాయి, సంఘానికి దూరంగా ఇంకావున్న గిరిజనుల అభివృద్ధికి ఇలాటివి మరీ అవసరం అందువల్ల గిరిజన ప్రాంతాలలో బాలభటోద్యమం వ్యాపించింది అని శ్రీ శరీన్ అన్నప్పుడు గిరిజన శ్రేయోభిలాషులందరూ అభినందించారు నేడు రాష్ట్రంలో 4500 మంది గిరిజన బాలబాలికలు బాలభట శిక్షణ పొందుతున్నారని శ్రీ శరీన్ తెలిపారు

### శ్రీరామ రక్ష

నాకు అరవై దాటినా, ఎప్పుడు బైటికి వెళ్ళినా 'నాయనా, నీకు రామలక్ష్మణులు తోడుగా వుందురు గాక' అని మా అమ్మ దీవిస్తూ వుంటుంది ఆ దీవెనల బలమే కాబోలు రోడ్డు ప్రమాదాలలో నేను మరణించడం లేదు ఇటీవల జంటనగరాలలోని రోడ్డు ప్రమాదాలు చూస్తుంటే, మా అమ్మ దీవెనలపై నాకు మరీ నమ్మకం కలుగుతూంది లారీచోదకుల దయ్యమూ ఆని, మోటారుసైకిలుచోదకుల అనుగ్రహ బలమూ అని రోడ్డున పోయేవారు బతికిపోతున్నారుగాని, వారు కొంచెం స్టీరింగు చక్రాన్ని ఇటు తిప్పారా, ఆ చక్రపాణి చక్రానికన్నా గతి తప్పుతుందిగాని, వీరి స్టీరింగు చక్రానికి తప్పదు పోనీ ప్లాటుఫారంమీద నడుద్దామా, అంటే, గండకత్తెరలలాగ బండలు లేచి వుంటాయి. ఆ బండలు విడువుకొని పండ్లు రాలగొట్టుకొని తీసుకొని తీసుకొని చావడంకన్నా శకట ప్రమాదం - పద్యోమరణమే మేలని

పిస్తుంది. మానవజాతి ఆయుఃప్రమాణం పెరగాలి, గొప్పపనులు చేయాలి అని ఒక వైపు ప్రయత్నిస్తున్నారు, శాస్త్రజ్ఞులు. తద్విరుద్ధంగా ఈ ప్రమాదాలు మానవుణ్ని నిట్టనిలువుగా పడగొట్టి వేస్తున్నవి. ఎంత వైపరీత్యం! ఇలాటివి తగ్గాలంటే, చట్టాలకు తోడు పౌరచైతన్యం, సంఘచైతన్యం పెరగాలి.

**శ్రీ ముత్యాలరావు**

జూన్ 19వతేదీ సాయంకాలం ద్వారకా హోటల్ జంటనగరాల ప్రముఖులతో కిటకిటలాడి పోయింది. కారణం సోమాలియాలో రాయబారిగా నియమితులైన శ్రీ జె. జి. ముత్యాల్‌రావుకు వీడ్కోలు సంరంభం. సాము గరిడీలలో ఆరితేరిన శ్రీ ముత్యాల్‌రావు సోమాలియాలో తమ పదవిని నిర్వహించడంలో ఇబ్బంది వుండదని అనిపించింది. ఆయన శాసన సభ్యుడుగా, పార్లమెంటు సభ్యుడుగా, కేంద్ర ఉపమంత్రిగా, అంతకుముందు సంస్థాన ప్రజా మండలి ఉద్యమంలోను, విదేశాలకు వెళ్లిన వివిధ ప్రతినిధి వర్గాలలోను, ఐక్యరాజ్యసమితి కార్యకలాపాలలోను చేసిన కృషిని తలచుకొన్నప్పుడు, ఆయన నీతి కుశలతను నెమరువేసుకొన్నప్పుడు, సోమాలియాలోనే కాక, దక్షిణ ఆఫ్రికా దేశాలను ఆయన భారత ప్రతిష్ఠను సుప్రతిష్ఠితం చేయగలరనే నాకు నమ్మకం కలిగింది. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ ఎం. ఆర్. శ్యాంరావు, శ్రీయుతులు నల్లూరి బసవరాజు, పి. నరసారెడ్డి, హయగ్రీవాచారి, ఎం. చెన్నారెడ్డి, శ్రీమతి సుమిత్రాదేవి మొదలయినవారు ప్రసంగించినట్లు శ్రీ ముత్యాల్‌రావు సమర్థత, రాజనీతిజ్ఞత, అనుభవం భారతదేశాన్ని, ఆంధ్రప్రదేశ్‌ను కీర్తిమంతం చేయగలవనడం నిస్సందేహం.

**ఉపశ్రుతి**

రోడ్డు వేస్తున్నారు. చెట్టుకు కట్టిన ఉయ్యాలను ఊపుతూంది ఒక కార్మిక సుందరి 'ఊర్కో ఉండమ్మయ్యా, ఊరేలదాము. కాకుంటె కడవోలు కట్టుకుందాము.' అని లాలిపాట పాడుతూ. ఈ సమైక్య వాతావరణంలో ఇదేమిటీ ఉపశ్రుతి — అనిపించిందేమో, తెల్లబోయి చూచారు, సమావేశం నుండి వస్తున్న సమైక్యవాదులు

ముగ్గురు మూర్ఖులు ✱

# మేకపిల్ల ఆశ

— మహేష్



✱ 'మనదేశం నుండి దారిద్ర్యాన్ని తరిమివేస్తామనీ, సామాన్య ప్రజల జీవితాలను బాగు చేస్తామనీ, కాంగ్రెసు పార్టీ యెన్నికల సమయంలో వాగ్దానాలు చేసి, అధికారం లోనికి వచ్చింది. కాని ఆ కాంగ్రెసు పార్టీ పరిపాలనలోనే సామాన్య ప్రజల జీవితం నానాటికి దుర్భరమై పోతున్నది. యెక్కడ చూసినా, నిరుద్యోగం, దారిద్ర్యం తాండవం చేస్తున్నాయి.' అన్నాడు చిదంబరం.

'సామాన్య ప్రజల శ్రేయస్సు కోసం ప్రభుత్వం శక్తివంచన లేకుండా యెన్నో శాసనాలు చేస్తున్నది అయినా, సామాన్య ప్రజల జీవితం బాగుపడడం లేదంటే దానికి ప్రభుత్వం మాత్రం యేం చెయ్యగలదు?' అని ప్రశ్నించాడు చంచల్రావు.

'నీ మాటలు వింటూంటే వెనుకటికి ఒక వెంకాయమ్మగారు పొరుగింటావిడకు చెప్పిన సమాధానం గుర్తుకు వస్తున్నది' అన్నాడు చూడామణి.

'ఏమిటా వెంకాయమ్మ గారి సమాధానం?' అని చంచల్రావు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక వెంకాయమ్మ గారి కొడుక్కు పెళ్ళి అయింది. కోడలు కాపురానికి వచ్చింది. అత్తవారింటికి వచ్చినప్పటినుంచీ ఆ కోడలు చిక్కిపోవడం ప్రారంభించింది.

అది చూసిన పొరుగింటావిడ 'ఏం వదినా? మీ కోడలు రోజు రోజుకూ చిక్కిపోతున్నది. నువ్వు భోజనం సరిగ్గా పెట్టటం లేదా?' అని వెంకాయమ్మ గారిని అడిగింది.

'అదేమిటి, వదినా? అలాగ అంటున్నావు? అది తెచ్చుకొన్న పది శేర్ల కంచంలోనే కదా దానికి భోజనం పెడుతున్నాను' అని వెంకాయమ్మగారు సమాధానం చెప్పింది' అంటూ చూడామణి చెప్పాడు.

'ఇంతకూ వెంకాయమ్మగారి సమాధానానికీ, ప్రభుత్వం శాసనాలు చెయ్యడానికీ సంబంధం యేమిటి?' అని అడిగాడు చిదంబరం.

'వెంకాయమ్మగారు తన కోడలుకు పది శేర్ల కంచంలోనే భోజనం పెడుతున్నాను— అని చెప్పిందే కాని యెంత భోజనం పెడుతున్నదో చెప్పలేదు. వెంకాయమ్మ గారు కోడలుకు పట్టెడు మెతుకులే పెడుతున్నట్లయితే, ఆ కంచం పది శేర్లదయినా ఒకటే, పాతిక శేర్లదయినా ఒకటే కదా! అలాగే ప్రభుత్వంచేసిన శాసనాలవల్ల ప్రజలకు యెంతవరకూ మేలు జరిగిందనేదే ముఖ్యంగాని ప్రభుత్వం యెన్నిశాసనాలు చేసిందనేది ముఖ్యంకాదు' అన్నాడు చూడామణి.

'నువ్వు చెప్పినదాన్నిబట్టి చూస్తే, కాంగ్రెసుపార్టీ తన యెన్నికల వాగ్దానాలను నెరవేర్చడంలో విఫలమైపోయిందని చెప్పవచ్చును. దేశంలోని పరిస్థితులవల్ల పేద ప్రజలకు తమ భవిష్యత్తుమీదనే ఆశ లేకుండా పోతున్నది.'

'పేద ప్రజలకు తమ భవిష్యత్తుమీదనే ఆశపోతున్నదని చెప్పడానికి వీల్లేదు. ఉదాహరణకు పాలేర్నే తీసుకో! పెద్ద పెద్ద భూస్వాములదగ్గర పనిచేస్తున్న

పాలేర్లందరికీ తమ భవిష్యత్తు మీద యెంతో ఆశ యేర్పడింది. భూపరిమితి చట్టంవల్ల పెద్ద పెద్ద భూస్వాముల తాలూకు 'మిగులు' భూములన్నీ తమకు వస్తాయనుకొంటున్నారు. 'ఆ చెట్టుదగ్గర పొలం నువ్వు తీసుకో! ఈ చెరువుదగ్గర పొలం నేను తీసుకొంటాను' అంటూ ఆ పాలేళ్ళందరూ తమలో తాము ఆ భూముల్ని వాటాలు వేసుకొంటున్నారు. అందుచేత ప్రజలకు తమ భవిష్యత్తు మీద ఆశ లేకుండా పోతున్నదని యెలాగ చెప్పగలవు? అని అడిగాడు చంద్రలావు.

'ఆ పాలేళ్ళ ఆశ మేకపిల్ల ఆశలాగే ఉంది.'

'ఏమిటా మేకపిల్ల ఆశ?' అని ప్రశ్నించాడు చంద్రలావు.

'ఒక మేకపిల్ల మందతో కలిసి మొట్టమొదటసారి ఊరిపక్కనే ఉన్న అడవిలోనికి వెళ్ళింది.

మేకపిల్ల అడవిలో కొన్ని మొక్కలను చూసి, 'అమ్మా! అమ్మా! యివేం మొక్కలు?' అని తల్లిని అడిగింది.

'అవి తంగేడు మొక్కలు. వాటి పువ్వులు చాలా రుచిగా ఉంటాయి' అని సమాధానం చెప్పింది తల్లి.

'ఈ తంగేడు మొక్కలు. యింకెన్నాళ్ళలో పువ్వులు పూస్తాయి?'

'నాలుగైదు నెలల్లో పూస్తాయి.'

'అమ్మా! అప్పుడు మనం యిద్దరం ఈ తంగేడు పువ్వులన్నీ కడుపునిండా తినేద్దాం' అని యెంతో ఆశగా అంది మేకపిల్ల.

పిల్ల అమాయకత్వానికి జాలిపడుతూ మేక 'బిడ్డా! నాలుగైదు నెలల్లో పూసే తంగేడు పువ్వులను తిందామని నువ్వు యెంతో ఆశ పడుతున్నావుగాని ఈ లోపున మనం యెదుర్కోవలసిన ఆపదలను గురించి ఆలోచించావా? కొద్ది రోజుల్లో మన యజమాని యింట్లో యేదో శుభకార్యం జరగబోతున్నదని అందరూ అనుకొంటున్నారు. అప్పుడు మనలో కొంతమంది ప్రాణాలు కోల్పోవడం ఖాయం. లేదా మన యజమాని యింటికి యెవరైనా అతిథులు వచ్చినా, మన ప్రాణాలకు ముప్పు వస్తుంది. లేదా, యీ లోపున అడవిలో మనల్ని యే తోడేలైనా యెత్తుకొని పోవచ్చును. ఇన్ని గండాలు దాటి నాలుగైదు నెలలు బ్రతికి ఉంటే, అప్పుడు మనం యీ తంగేడు పువ్వులను కడుపునిండా తినవచ్చును' అని చెప్పింది' అంటూ చూడామణి మేకపిల్ల యొక్క ఆశను వివరించాడు.

'అయితే ఆ మేకపిల్ల ఆశకూ, పాలేళ్ళ ఆశకూ పోలిక యేమిటి?'

'ఆ మేకపిల్ల తంగేడు పువ్వులు తినడానికిముందు యెన్నో గండాలు దాటవలసి ఉంది. అలాగే పాలేళ్ళకూడా భూములు పొందడానికి ముందు యెన్నో ఆటంకాలను దాటవలసి ఉంది' అంటూ చూడామణి యిలాగే చెప్పాడు...

'భూపరిమితుల చట్టం ప్రకారం మిగులు భూములు ఉంటేకదా! వాటిని యీ పాలేళ్ళకు పంచేది. అందుచేత మొట్టమొదట భూస్వాములే 'మిగులు భూములు' లేకుండా చేయడానికి ప్రయత్నం చేస్తారు. అప్పటికీ యింకా యేవైనా మిగులు భూములు ఉంటే రాజకీయ నాయకులు వాటిని తమ అనుచరులకూ, మద్దతుదార్లకూ వచ్చేటట్లుగా చేస్తారు. ఆ తరువాతకూడా యింకా మిగులు భూములు ఉంటే, ప్రభుత్వోద్యోగులు తమను సంతృప్తిపరచినవారికే ఆ భూములు వచ్చేటట్లు చేస్తారు. ఇన్ని గండాలు దాటిన తరువాత కూడా 'మిగులు భూములు' ఉంటే అవి యీ పాలేళ్ళకు వస్తాయి. అందుచేత ఆ మేకపిల్ల ఆశలాగానే లేదా, యీ పాలేళ్ళ ఆశ?' అని అడిగాడు చూడామణి.

'అయితే, సామాన్య ప్రజల శ్రేయస్సు కోసం చేసే యీ శాసనాలన్నీ వ్యర్థమేనా?'

'రాజకీయ నాయకుల్లోను, ప్రభుత్వోద్యోగుల్లోను అవినీతి, లంచగొండితనం ఉన్నంతవరకూ యీ శాసనాలవల్ల సామాన్య ప్రజలకు కలిగే మేలు యేమీ ఉండదు. అందుచేత దేశంలో రోజురోజుకు పెరిగిపోతున్న యీ అవినీతిని లంచగొండితనాన్ని అరికట్టడం చాలా అవసరం. అప్పుడే పేద ప్రజల జీవితాలు కొంతవరకు బాగుపడతాయి' అన్నాడు చూడామణి.



కొత్త శీర్షిక ప్రారంభం!

## నిధుల కోసం వేట

విక్ ఆల్‌డిస్

# తవ్వి చూడండి, ఎనిమిది కోట్ల రూపాయలు దొరుకుతాయి!

హాలిఫాక్స్ దక్షిణంగా కొన్ని మైళ్ళకి మహోన్‌బే వస్తుంది. ఇక్కడ తరగని నిధులున్నాయని నిదర్శనాలు లభించాయి.

కెప్టెన్ కిడ్ అనే దొంగకి సంబంధించిన ఆస్తి అంతా 'వోక్ అయ్‌లాండ్' లో వుందని తెలుసుకున్న ముగ్గురు సాహసికులు ఆ నిధులను వెతకడానికి బయల్దేరారు.

నిధులకు సంబంధించిన స్థలంలో ఒక చెట్టు వుంది. ఆ చెట్టు మొదట్లో కొన్ని సంకేతాలు వున్నాయి. కొమ్మకి ఒక కప్పీ కూడా వేలాడుతూ వుంది.

ప్రపంచంలో కల్లా పెద్ద నిధి అక్కడ దొరుకుతుందని అనుకున్నారు

స్థలాన్ని కనుగొన్న ముగ్గురూ రహస్యంగా పారలూ గునపాలూ తీసుకుని బయల్దేరారు.

పది అడుగులు తవ్వాక అక్కడ కర్ర చెక్కలు కనబడ్డాయి మణులూ రత్నాలూ వుండే చెక్క పెట్టె అని భ్రమపడ్డారు.

పెద్ద పెద్ద వోక్ దూలాలు మాత్రమే కనిపించాయి.

వాటిని తొలగించి ఇంకా తవ్వడం మొదలుపెట్టారు. ఒక ఇరవై అడుగులు తవ్వాక మళ్ళీ అలాంటి దూలాలే ప్రత్యక్షమయ్యాయి. నిరాశ పడకుండా మళ్ళీ తవ్వారు. 30 అడుగుల లోతున మరి కొన్ని దూలాలు బయల్పడ్డాయి.

మొదట్లో నిరుత్సాహం కలిగింది. అయినా పట్టు విడవలేదు. ఇంత రక్షణ వున్నదీ అంటే — అడుగున ధనరాసులు వుండేతీరాలని నిర్ణయించుకున్నారు.

ఇంకా అడుక్కి తవ్వాలంటే పారలూ గునపాలూ పనికిరావు. మిషనరీ కావాలి. అందుకు డబ్బు కావాలి. ముగ్గురూ అయితే కొన్ని సంవత్సరాలు పడుతుంది. అందుచేత మరి కొంతమంది నమ్మకమైన వ్యక్తుల్ని కలుపుకున్నారు.

అలా తవ్వుతూపోతూంటే పదేసి అడుగులకి ఒకోసారి దూలాలు బయటపడుతూ వున్నాయి.

తొంభయి అడుగుల తర్వాత ఒక పోడ అడుగు భాగం కనిపించింది. దానిమీద ఒక పెద్ద రాతి పలక వుంది. ఆ పలక మీద కొన్ని సంకేతాలున్నాయి.

ఒక అయిరిష్ స్కూలు మాస్టారు ఆ సంకేతాలకి అర్థం చెప్పగలిగాడు: 'నలభయి అడుగుల క్రింద రెండు మిలియన్ పౌండ్లు పాతిపెట్టబడి వున్నాయి' అని.

సంతోషంలో ఆ రోజుకి పని మానేశారు. మర్నాడు ఉదయాన్నే ఆ స్థలానికి వచ్చారు. ఇంకేముంది ? తవ్విన మేరంతా నీటితో నిండిపోయింది.

ఆ పక్కనే మరో గొయ్యి తవ్వారు. అక్కడ కూడా నీరు వచ్చేసింది. ప్రాణాలతో బయటపడ్డారు. వున్న డబ్బంతా అయిపోయింది. ప్రయత్నాన్ని కట్టిపెట్టేశారు.

1849 లో మళ్ళీ ప్రయత్నం జరిగింది. డెబ్బయ్యేళ్ళ హాగన్ అనే ఆయన ముఠాకి నాయకత్వం వహించారు.

ఈ సారి తవ్వకం పకడ్బందీగా జరిగింది. ఒక గని తవ్వుతున్నట్లుగా తవ్వారు. అలా మిషన్‌తో డ్రిల్ చేస్తూ పోతూంటే కొత్త రకంగా అనిపించింది.

చూస్తే — డ్రిల్లింగ్ మిషన్‌కి బంగారపు తునకలు అంటుకుని వుండడం కనిపించింది.

వోక్ దూలాల అడుగున బంగారపు కడ్డీలు వున్నాయని అర్థమైపోయింది. కాని, వాటిని అంత లోతునుండి బయటికి తెచ్చేది ఎలా ?

ఇలా ఆలోచిస్తూ వుండగానే తవ్విందంతా నీటిమయమైపోయింది. ఒక పెద్ద



ఆనకట్ట లాంటిది నిర్మించి నీటిని అదుపులో వుంచారు. ఈసారి విజయం తప్పదనుకున్నారు.

అంతా భోజనాలు చేస్తూ వుండగా పెద్ద శబ్దం వినిపించింది. పనివాళ్ళంతా చెల్లాచెదరు అయిపోయారు. అంతా కూలిపోయింది.

కొన్నాళ్ళకి వాగన్ చచ్చిపోయాడు.

1860 లో కూడా కొందరు దీన్ని తవ్వడానికి ప్రయత్నించారు. కాని లాభం లేకపోయింది.

1895 లో ఒక పదిహేడేళ్ళ కుర్రాడు ఛాలెంజి చేశాడు. తవ్వకం మొదలెట్టారు.

126 నుంచి 170 అడుగుల లోతున ఒక కాంక్రీట్ ఛాంబర్ బయట పడింది. సిమెంట్ చేసి వున్నట్టుగా అనిపించింది

అడుగున వున్న పెద్ద నిధికి నీటితో రక్షణ కల్పించినట్టుగా అర్థమయింది. నీటిని అదుపులో వుంచడానికి, తవ్వకాన్ని కొనసాగించడానికి అతను ప్రాణాలు అర్పించాడు

1950 లో యెల్. ఆర్. చాప్పల్ అనే అతను ఈ తవ్వకానికి సంబంధించిన హక్కులని సంపాదించాడు.

ఈ నిధిని కెప్టెన్ కిడ్ పాతిపెట్టాడు అని ఒక వాదన వున్నా— ఈజిప్షియన్లు విడిచిపెట్టి పోయారు అనే ఆధారాలు కూడా వున్నాయని ఇతను అంటున్నాడు

బ్రిటిషువారి హస్తగతం కాకుండా ఫ్రెంచి సైన్యం ఈ నిధిని దాచిపెట్టింది అనే వాదన కూడా వుంది.

ఈ మధ్య— టెక్సాస్‌లో పెద్ద ఆయిల్ కంపెనీ అధినేత అయిన జార్జ్ జె. గ్రీన్ అనే ఆయన ఒకసారి ప్రయత్నించి విఫలుడయ్యాడు.

ఇప్పుడు ఈ వోక్ అయిలాండ్ ఒక పెద్ద టూరిస్ట్ ఎట్రాక్షన్ అయిపోయింది.

ఇప్పటికే ఈ నిధి తవ్వకానికి వేర్వేరు జట్లు సుమారుగా 60 లక్షల రూపాయలు ఖర్చు పెట్టినట్టు తెలుస్తున్నది. అక్కడనుంచి లభించిందల్లా కొన్ని బంగారపు తునకలు మాత్రమే...

ఇంకా ఈ తవ్వకం జరుగుతూనే వుంది ...జరుగుతూనే వుంటుంది...

(ఇంకా వుంది)

**పి ఎమ్ ఆర్, విజయవాడ**

మనం వాదనలో ఎప్పుడు ఓడిపోతాం?

ఎదుటివాడు 'నిశ్శబ్దంగా' వూరుకున్నప్పుడు!

**వి కె, ఏలూరు**

సంస్కారం అంటే ఏమిటి?

నలుగురిలోనూ, ఒంటరిగానూ ఉన్నప్పటి మన ప్రవర్తనే—మన సంస్కారం. సభ్యతకల ప్రవర్తన పరిశుభ్రమైన మనస్సుకి మేల్ముసుగులాంటిది.

**డి. జె. ఆర్, విశాఖపట్నం**

ఎందుకండీ నలుగురు చేరితే చాలు ఆడ వారిని గురించి చర్చలకి దిగుతారు?

అది సహజమే రావుగారూ, కొన్ని విషయాలు ఎప్పటికీ పాతపడవు అందులో ఆడతనంకల ఆడది

# ప్రశ్నోత్తం

...కె. రామలక్ష్మి...

**ఐ. వి. ఎస్, తుని**

పిల్లలు ఏడ్చినప్పుడు అమ్మా అంటారే గాని నాన్న అని ఎందుకు అనరు?

పేద దిక్కుకలది—తల్లి కనుక.

**వి కె. కె. నెరబైలు**

మగవారి జీతం, స్త్రీ వయస్సు అడగ కూడదని అంటారేమిటి?

నిజం చెప్పరు కనుక!

**వి. వి షరీదాబాదు, హరియానా**

మీరు ప్రశ్నావళిలో కనీసం అవతలి మనిషికి గౌరవం యిచ్చి మాట్లాడ అని కూడా తెలియని ప్రబుద్ధులకు సమాధానం ఎందుకు చెప్తారు? నాకోసారి చాలా బాధ కల్గుతుంది. మీరు రాసిన 'ప్రేమించు ప్రేమకై' ఇప్పటికీ మనసులో మధురమైన నవలగా హత్తుకు పోయింది.

మీరు చెప్పింది నిజమే విజయగారూ. కాని అలాంటి ప్రబుద్ధులున్నారని—మీలాంటి వారి కెలా తెలుస్తుంది—నే సమాధానం యివ్వకపోతే అందుకు వారికి సమాధానం యిచ్చి అడిగేవారిని ఏమడిగినా గౌరవించాలన్న నా సభ్యత చెప్పక్కుండా మీకుచెప్తున్నాను.

**జి, ఎస్ ఆర్. వి. ఆర్, కొత్తగూడెం**

పవిత్రమైన ప్రేమ అనే పదానికి నిర్వచనం ఏమిటి?

అనిర్వచనీయమైనదే ప్రేమ. ఎవరికి తోచిన నట్టు— వారు దానికి నిర్వచనం చెప్పుకోవచ్చు.

**పి. ఎస్ ఎమ్, అంజాజీపేట**

నేటి మహిళల ప్రధాన సమస్య ఏమిటి? దానికి పరిష్కార మార్గం ఏమిటి?

మనిషిగా బ్రతకడమే సమస్యగా వుంది. ఇంక దీనికి పరిష్కారం ఏమిటి నా ముఖం. తిరగ బడ్డమే! .. రాజకీయరంగంలోకి స్త్రీలు అధిక సంఖ్యలో ప్రవేశిస్తే తప్పించి— లాభం లేదు.

**ఎస్. ఎస్. ఆర్, విశాఖపట్నం**

ప్రేమించుట గొప్పకాదు. ప్రేమించ బడినవాడే అదృష్టవంతుడు. నిజమేనాండీ?

కరెక్ట్!

**ఎమ్ డి ఎస్ ఎస్, ?**

ఒన్స్ ఫస్ట్, ట్వయిస్ ఇన్ మూన్, బట్ నాట్ ఇన్ ది సి ఎవరు నేమి? చెప్పకోండి చూద్దాం.

బాగుంది మా పూళ్ళో మూడో క్లాసుపిల్లలు— ఆడుకుంటూ వుంటా రిలాంటి ఆటలు— తెలియక చెప్పలేక పోతే 'ఫూల్, ఫూల్' అని కేరింతలు కొడుతూంటారు!!

**జి. ఎమ్. ఎస్, పెనుమంత్ర**

ప్రేమ అనురాగం త్మ్రతలు కరువైనా ఏదో తిరుక జీవించ కలరు గాని ధనం లేనిదే నిమిషం గడవటం కష్టం. ఏమంటారు?

నిజమే కాని ఒక్క డబ్బు వున్నంతమాత్రాన జీవితం నిండుగా సాగిపోతుందనీ అనుకో కూడదు.

డబ్బు వున్నంత సేపూ మనిషిని గౌరవంగా మాస్తారు డబ్బులేకపోతే అసహ్యంగా చూస్తారు. ఎందుకు?

డబ్బు మహిమ అది. డబ్బువున్నంత కాలం—, సాటివాడిని మనిషిగానైనా చూడక— డబ్బులేక పోతే బాంయ్యా, అంటూ చేయి కలిపే తత్వంవల్ల. అందుకే కలిమిలోనూ లేమిలోనూ కూడా కాలూని నిలబడ గల్గాలి డబ్బున్నప్పుడు ఎగిరిపోయి లేనప్పుడు కృంగి పోడం— సంహీనతకి చిహ్నం

**జి షి. ఆర్, హైదరాబాదు**

మీరింత స్వేచ్ఛగా, మీ కిష్టం వచ్చి నట్టు ఎలా వుండగల్గుతున్నారు? ఆశ్చర్యంగా వుంది.

ఏంలేదు తమ్ముడూ, నేనూ నా వాళ్ళూ ఒక ఒప్పందానికి వచ్చాం వారికి తోచినది వారు అన వచ్చు నాకు నచ్చినది నేను చేస్తాను! బస్. గొడవే లేదు అవునా?

**వి. ఎస్ ఆర్, నరసన్నపేట**

ఈ పత్రికలో నా ప్రశ్న తప్పించి రీ చెత్త ఏది?

నీ ప్రశ్నకి నే సమాధానం యిస్తే— అదే కదా!

నీతికి అవినీతికి భేదం ఏమిటి?

లేదు నీ పట్ల నీతి అనిపించినది ఎదుటి వాడికి తప్పకుండా అవినీతి అనిపిస్తుంది.

**జి ఆర్, తుని**

ఏదైనా విషయాన్ని చెప్పేటప్పుడు సూటిగా, దురుసుగా కాకుండా, సున్నితంగా చెప్తే ఇంచిదంటాను. మీరేమంటారు?

నా పద్ధతి— కీళెరిగి వాత!

# పరాజితులు

## ఇచ్ఛాపురపు జగన్నాథరావు



నర్సు అతని పల్సుచూసి, నోట్ చేసి, రెండుమాత్రలు ఔన్సుగ్లాసులో మందూ తెచ్చుకుని, అతనివేపు తిరిగి, 'ఉదయం మందు తీసుకున్నారా?' అంది.

'ఎందుకు మీకనుమానం వొచ్చింది?' అని అడిగేడు శేఖర్ సగం లేచి కూర్చుంటూ.

'ఆ సీసాలు చూసి... ఈపాటికి సగం ఖాళీ పూర్తికావలసింది... అలాగే ఉన్నాయనిపించింది.'

శేఖర్ నీరసంగా నవ్వి, చేతులు కట్టుకుని కూర్చున్నాడు.

"ఏం?" అంది నర్స్.

'లేదు' అన్నాడు శేఖర్.

"నేను ఈమాట డాక్టరుకి చెప్తాను—" అంది నర్స్, మాత్రలు అందిస్తూ.

'నాకు మందులు వేసుకోవాలని లేదు!' అన్నాడు శేఖర్, ఆమె రెండు చేతుల్లోనూ ఉన్న మందుల్ని చూస్తూ.

'ప్లీజ్! మీరంత చిన్నపిల్లలు కాదు. నిజానికి వాళ్లేనయం — భయంతోనో, ప్రేమవల్లనో, నేను చెప్పినట్టు వింటారు! కమాన్!'

నర్స్ అతనితల వెనక చెయ్యిపెట్టి తల ఎత్తి నోటిలో మాత్రలు వదేసి మందు తాగించి నేప్‌కిన్ ఇచ్చింది. ఏం జరుగుతోందో అతని కర్థం అయేలోపున అతను మందుతాగడం అయిపోయింది.

కోపం, ఆశ్చర్యం కలిసిన గొంతుకతో, 'నేను చిన్న పిల్లవాడినేంకాదు!' అన్నాడు శేఖర్.

చిరునవ్వుతో, 'అందరూ ఇప్పుడేనా ఒక్కొక్కసారి చిన్నపిల్లలే అవుతూంటారు...' అంది నర్స్, రూములో అన్నీ సరిగా సర్దుతూ.

'కాని...మీరు ఇక్కడ కొత్తలాగ ఉన్నారు!'

'అవును...ఈ ఫ్లోర్‌కి ఈ నెల రావడం ఇదే'

'అందుకే చూడలేదు కాబోలు'

'అవును...మరేమైనా కావాలా?'

'ఏమీవొద్దు — ఈమందులు తాగించకుండా ఉంటే చాలును!'

అతని పక్కబట్టలు సర్దుతూ, 'మరి మీకు నయం అవడం ఎలాగ?' అంది నర్స్.

'నాకు నయం కానక్కరలేదు...ఏమైనా ఫరవాలేదు.'

'మరి ఇక్కడికెందుకొచ్చారు ? మీకు నర్వస్ బ్రేక్‌డౌన్ ఎందుకు వొచ్చింది?'

'అదేమీ నాకు తెలీదు...ఇక్కడికి రావాలని నాకు లేదు... మీకు తెలుసుకదా ... వీరి బలవంతానైనా ఇష్టంలేని పనులు చేస్తూ ఉంటాము. నే నిక్కడికి రావడము అలాటి కారణమే...'

నానీ చూసుకుని; 'మీరిక్కడ ఉన్నంత సేపూ మా విధి మేము నిర్వర్తించక తప్పదు కదా!... మరో గంటలో విజిటర్స్

# పరాజితులు

వొస్తారు— బట్టలు మార్చుకొండి. నేను డాక్టర్‌ని చూస్తాను' అంది నర్స్.

ఆమె వెళ్లబోతోంటే క్రిందికి దిగి నిలబడి శేఖర్, 'డాక్టరుతో ఏం చెప్తారు?' అన్నాడు.

'నర్స్‌లని గురించి—వాళ్లు రిపోర్ట్ చేసి ఉంటే సరే, లేకపోతే...'

'లేకపోతే?'

'ఆయన చూసుకుంటారు. ఇక్కడ డ్యూటీ విషయంలో చాలా ఖచ్చితంగా ఉంటారు.'

'నేను ఆ బద్ధం చెప్పి వాళ్లమీదకి రాకుండా చూస్తాను.'

నర్స్ నవ్వింది. 'ప్రయత్నించండి ... కాని, లాభం ఉండదు. నా సంగతి వీళ్లందరికీ పన్నెండేళ్లనుంచి తెలుసును ... మీ సంగతి తెలిసే ఉంటుంది!' అని, ఆమె వెళ్లిపోయింది.

శేఖర్ చికాకుగా అటూ ఇటూ పచారు చేశాడు — తనకి మందులు తీసుకోవాలని లేదు. తనకి త్వరగా నయం కాకపోతే బాధ లేదు. అసలు నయం కాకపోయినా విచారం ఏమీలేదు. చాలాకాలం జీవించాలనీ, ఆరోగ్యంగా ఉండాలనీ, తనకే కోరికలూ లేవు.

వీళ్లు తనకెందుకిలాగ బాధపెడతారు ? నర్స్ చేతిలో తాను ఓడిపోయాడు.

మిగిలినవాళ్లు ఇంత అన్యాయంగా లేరు... 'తరువాత' తీసుకుంటానంటే కాదనలేరు.

అసలు తానిక్కడికి రాకుండా ఉండవలసింది...

కంపెనీవాళ్లెంత బలవంతం చేసినా, కాదనే శక్తి ఉండి, సంవత్సరం గడిపాడు. తన పనిలో పెద్ద లోపాలు ఏవీ లేక పోవడంతో డైరెక్టర్లుకూడా ఏమీ అనలేక పోయారు. తనవల్ల కంపెనీకి ఎంత లాభమో, వాళకే తెలుసును ... అందుకే, తాను బాగానే ఉన్నాననిచెప్పి వాళ్ల సూచనలని గౌరవంగానే తిరస్కరించగలిగాడు తాను.

కాని, శాంతిని కాదనలేక పోయాడు; ఏదుకో, ఆమె తన జీవితంలో ఏవరికీ ఇవ్వకూడదనుకున్న స్థానాన్ని ఆక్రమించగలిగింది. అది తాత్కాలికమే ఒకరోజు—అనుకోని పరిస్థితుల్లో ఆమెకి తాను వాగ్దానం చెయ్యడం జరిగింది.

మాట తప్పడం తనకివడదు...

ఆమె ఇప్పుడు తనకేమీకాదు—కాని, డాక్టరు వెళ్లమనేదాకా తానిక్కడ ఉండి వాగ్దానం నిలుపుకోవాలి.

శాంతి...

ఒకప్పుడు తాను ఆమెని ప్రేమించాడు.

జీవితంలో ఇంకెవ్వరినీ ప్రేమించకూడదని నిర్ణయించుకున్నాక, రాగబంధాలకి కాలం దాటిపోయాక, తాను ఆమెకి చాలా దగ్గర అయాడు. ఆమెకూడా తనకి దగ్గరగా వొచ్చింది.

ఆమెని కలుసుకున్నరోజు, తొలిసారి ఆమెతో మాట్లాడినరోజు, తనకి జ్ఞాపకం ఉంది. అప్పుడు అప్పుడూ ఆరోజు తన జీవితంలో ఉండి ఉండకపోతే, ఒకదారిలో సాగిపోతోన్న తన జీవితం మరోదారి పట్టి ఉండేదికాదనీ, ఈ గతుకులదారి తనకి మరి కొంచెం అశాంతిని కలుగజేసి ఉండేదికాదనీ అతనికి అనిపిస్తూ ఉంటుంది. ఆ పశ్చాత్తాపమే ఆ జ్ఞాపకాన్ని చెరిగిపోకుండా ఉంచింది.

కమల్ ఎందుకారోజు పార్టీ ఇచ్చేడు? కమల్ పార్టీ ఇచ్చేందుకు కారణం దేనికి? అతనికి బుద్ధి పుడితేసరి... పార్టీ ప్రతినెలలోనూ కనీసం ఒకటి, తరుచు రెండు.

ఆ పార్టీలలో గెస్టులెవరు మారినా మారనిది శేఖర్ ... ఇప్పుడు ఈ నర్సింగ్ హోమ్‌లో ఉండి ఆలోచించిచూస్తే, ఆ రాత్రులూ, ఆ రొదా, ఆ దీపాలూ, తెర మీద బొమ్మలలాగ కనిపిస్తాయి — అవాస్తవంగా. కాని అప్పుడు అవి చాలా వాస్తవాలు.

సంవత్సరం అయింది ఆ పార్టీ అయి; తాను ఆరోజు మరీ చిరాగ్గా ఉన్నాడు; ఎందుకో! ఏదో చిన్న విషయమే అయి ఉంటుంది. ప్రతీ విషయానికీ కోపం తెచ్చుకోవడం, బాధపడడం, తనకి చాలా కాలంనుంచి అలవాటయిపోయింది... అలాటిదే, మరునాటికి జ్ఞాపకమే ఉండని ఏదో జరిగింది...

వొచ్చిన గెస్టులు తనని పలకరించినా శేఖర్ ముఖంలో చిరాకు తప్ప మరేమీ కని

పించేక మొదటి గంటలోనే ఆ మూరు అందరూ అతన్ని తప్పించుకని తిరిగారు. శేఖర్ మామూలుకన్నా ఎక్కువ తాగడం జరిగింది.

కమల్ అతను కూర్చున్న చోటికివచ్చి, అతని పక్కన కూర్చుని, 'ఏమిటి విశేషం, బ్రదర్? అలాగ ఉన్నావేం?' అన్నాడు, మరొక గంటతరవాత.

'ఎలాగ ఉన్నాను?'

'లోకం అంతా నీ శత్రువుల్లాగ...'

'అది నిజమేకనక!'

'కాదని నీకు తెలుసు...'

'నాకు చాలా తెలుసులే—పో కమల్... నీ పనిచూసుకో. నాకు మరో డ్రింక్ ఇమ్మనీ అందులో సోడావొద్దనీ చెప్పు...'

'శేఖర్!...నువ్వు కొంచెం స్లో అవు...'

'ఏం? నీ విస్కీ అయిపోతుందా?'

కమల్ నవ్వి, 'నువ్వీ స్పీడుతోసాగిస్తే నిజంగానే అయిపోయేలాగ ఉంది!... కొంచెం తిను ఏమైనా...' అన్నాడు. శేఖర్ అతనిమీద చిరాకుపడ్డాడు,

కమల్ పక్కన నిలబడి తనని పరీక్షిస్తూన్న అపరిచితుడెవరో అనవసరంగా కలుగజేసుకోకపోతే, ఆమాటలు మరే ఫలితానికీ దారితీసేవికావు కాని అతను కమల్ భుజాలమీదికి వొంగి, 'కమల్! ఈ ఇల్లు నీదా? కాదా?' అన్నాడు.

'ఏం?' అన్నాడు — గొంతుకలో కోపం విని కమల్.

'ఈయన శాంతిని ఇన్సల్ట్ చేశాడు...'

'ఏమయింది?'

'శాంతి అతన్ని పలకరిస్తే, కసిరాడు .. స్నాక్స్ ఆఫర్‌చేస్తే క్రిందని పడేశాడు...'

శేఖర్‌కి ఒక్కసారి తెలివి వొచ్చినట్టయింది.

కమల్ అతనివైపు ఆశ్చర్యంగా చూసి, 'శేఖర్! నిజమేనా!' అన్నాడు.

శేఖర్‌కి జ్ఞాపకం లేదు. అలాటివని ఈ పరిస్థితుల్లో కూడా జరిగి ఉంటుందనీ, తన ప్రవర్తన అంత కిందికి దిగజారి ఉంటుందనీ అతననుకోలేదు... చూచాయగా ఆ అపరిచితుడు అరగంట క్రిందట, నాలుగు డ్రింకులకి పూర్వం తన తాగుడు గురించి ఏదో అనడం. తానతనిని 'షటప్' అని చెప్పడం మాత్రం అతనికి జ్ఞాపకం ఉంది.

'అదేం నిజం కాదు కమల్!...ఈ మనిషికి అనవసర ప్రసంగం ఎక్కువే అని చెప్పడం, నోరు మూసుకోమనడం మాత్రం నిజం' అన్నాడు శేఖర్.

కమల్ వెంటనే ఏమీ అనలేదు — అనలేకపోయి. శేఖర్ తన గ్లాసులో మిగిలిన కొద్ది పానీయాన్నీ గమనిస్తూ, జరిగినదాన్ని జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

చివరికి కమల్, అవతలి మనిషిని చూస్తూ, షా! 'నువ్వుచెప్పేది నిజమా?... శేఖర్‌ని నాకు బాగా తెలుసును—అలాగ చేసి ఉంటాడని అనుకోను' అన్నాడు.

షా కోపంగా, 'అతనిసంగతి నీకు తెలీదులే — తెలిసినా ఒప్పుకోవు...అతను ఒక—' అని కోపంగా ఆగి, తాను క్షమించలేని మాట అన్నాడు.

చేతిలోని గ్లాసు బలంగా విసిరాడు శేఖర్.

అది వెళ్ళి రెండడుగులు అవతల నిలబడి అదంతా గమనిస్తోన్న శాంతిమీద పడింది.

హాలులో అంతా ఒక్కసారి నిశ్శబ్దం ఆక్రమించింది.

శేఖర్‌కి పూర్తిగా తెలివి వొచ్చింది.

క్షమించరాని తప్పు చేసిన గుర్తింపు తాగిన విస్కీని ఓడించింది.

లేచి, ఊగుతూన్న కాళ్ళమీద నిలబడి, 'ఐయామ్ సారీ...' అని, బయటికి వెళ్ళడానికి రెండడుగులువేసి పడబోయాడు.

ఇద్దరు రెండువేపులా అతన్ని పడకుండా పట్టుకుని, మెట్లుమీంచి మీదికి, బెడ్‌రూమ్‌కి తీసుకెళ్ళేరు.

చీకటి గదిలో దీపం వెయ్యగానే శేఖర్ కళ్ళు అప్పుడే కనిపించినట్టు ఆ ఇద్దరినీ చూశాడు— ఒకరు కమల్. రెండో మనిషి శాంతి.

కమల్ అతన్ని మంచంమీద కూర్చోబెట్టి, 'శాంతీ! మీరితన్ని క్షమించాలి...' అన్నాడు.

శాంతి ఏమీ అనబోయే లోపున గది తలుపులు విసురుగా తోసుకుని షా లోపలికి వొచ్చి, 'శాంతీ! నువ్విక్కడ ఏం చేస్తున్నావు? జరిగినది చాలదా?' అన్నాడు, పెద్ద గొంతుకతో.

'నువ్వు వెళ్ళు...' అంది శాంతి.

'నువ్వీ ఇంట్లోనే ఉండకూడదు ... ఈ గదిలో—'

అతి మెత్తటి శాంతి కంఠస్వరం ఒక్కసారి మారిపోయింది. 'నేనేం చెయ్యాలో, ఎక్కడ ఉండాలో నాకు తెలుసు... నువ్విక్కడినించి వెళ్ళు' అంది. అనవసరమైన ఆ కాఠిన్యం శేఖర్‌కి చాలా ఆశ్చర్యం కలిగించింది.

ఉరిమినట్టు అందరివైపూ చూసి, షా వెళ్ళిపోయాడు. కమల్ ఎయిర్‌కండిషనర్ స్టార్ట్‌చేసి, శాంతిని కూర్చోమని, పర్సోం

ఇలా అడుక్కోకపోతే
ఏదేనా పనిచేసి బ్రతకకూడదూ?

పనిచేసి
రిటైరయి
పోయాను
బాబూ!

టుని పిలిచి, స్కాచ్, బ్లాక్‌కాఫీ తెమ్మని చెప్పి, బయటికి వెళ్లేడు.

శేఖర్ పరుపుమీద నీరసంగా జారి, "శాంతి! రెండుసార్లు మీకు కష్టం కలిగించాను... ఒకసారా? రెండుసార్లా?' అన్నాడు.

'రెండుసార్లే...'

'షీ చెప్పినది నిజమే నన్నమాట!'

'అవును...'

"మీకెలాగ క్షమాపణ చెప్పేది? ... ఏ పరిస్థితిలోనూ ఇంత అనాగరికంగా ప్రవర్తిస్తాననుకోలేదు...' అన్నాడు తడబడుతూ.

ఆమె చీరా, బ్లవుజా తడిసి ఉన్నాయి. ఆ సంగతి గమనించి మరీ సిగ్గుపడ్డాడు శేఖర్.

శాంతి ఏమీ అనలేదు. లేచి అతని టై విప్పి అటు పడేసి, తువ్వాలుతో ముఖంనిండా, మెడనిండా ఉన్న చెమట తుడిచి, 'ఎలాగ ఉంది?...సాయంత్రంనించీ మీరు మామూలుగా లేరని గమనించాను' అంది.

'భరించలేని సిగ్గుగా ఉంది...మీరు నా బాధని ఈ పరిచర్యలతో ఎక్కువ చేస్తున్నారు ... కనీసం నన్ను నాలుగు తిడితే కొంత నయంగా ఉంటుంది' అన్నాడు తాను.

శాంతి చిరునవ్వుతో, 'మిమ్మల్ని తిట్టాలని లేదు—కాని, మీరు అనవసరంగా బాధపడకండి ... అందరమూ ఏదో ఒక రోజున ఇలాటి పరిస్థితుల్లో పడేవాళ్లమే!' అంది.

సర్వెంట్ కాఫీ, కొన్ని తినుబండారాలూ తెచ్చేడు.

అతనికేదీ తినాలనీ తాగాలనీ లేదు. కాని శాంతి బలవంతాన కాఫీ చాలా తాగాడు. బ్లాక్ కాఫీ.

విస్కీ ప్రభావం తగ్గేసరికి మరోగంట పట్టింది. అప్పటికి పార్టీ ముగిసి అందరూ వెళ్లేరు. శాంతి అతన్ని ఇంటిలో విడిచి వెళ్లిపోయింది.

ఆ తరవాత ఆమెని తప్పించుకుని తిరిగేడు శేఖర్... పార్టీలకి వెళ్లడమే కాక, తాగడం కూడా చాలావరకు తగ్గించేశాడు. ఆరోజు సంఘటన జ్ఞాపకం వొచ్చినప్పు

# పరాజితులు

డల్లా అతను సిగ్గుతో కుచించుకుపోయేవాడు.

నాలుగైదు వారాల తరవాత ఒకనాడు శాంతి టెలిఫోన్ చేసింది... ఆమె బర్త్‌డేకి పార్టీ ఇస్తోంది. నలుగురైదుగురుమాత్రం వొస్తారు. టీకి రావాలి తాను...

'సారీ శాంతీ ... క్షమించాలి' అన్నాడు తాను.

'మనం ఇద్దరం క్షమాపణలతో కాలం గడిపేలాగ ఉన్నాము — ఈ మధ్య మీ రెక్కడికీ పోనేలేదు గదా! రండి ... నాకు చాలా సంతోషంగా ఉంటుంది' అంది శాంతి.

తనకి వెళ్లాలని లేదు. ఆమాట మళ్లీ చెప్పి, 'రాత్రి నాతో డిన్నర్‌కిరండి... ప్లీజ్!' అన్నాడు.

శాంతి ఒక్కనిమిషం ఆగి, 'సరే!...' అంది.

'ఎనిమిదిగంటలకే వొస్తాను'

'థాంక్స్...' అని ఫోను పెట్టేసింది శాంతి.

ఆర్రాత్రి ఇంటికి చేరేసరికి పన్నెండు దాటింది—డిన్నర్—తరవాత మెరీన్‌డ్రైవ్‌లో తిరిగి, కొంతసేపు కూర్చుని.

తానిచ్చిన నెక్లెస్ తీసుకోడానికి శాంతి ముందు ఒప్పుకోలేదు. ఆమె చివరికి అంగీకరించేసరికి తనకి ఎంతో సంతోషం అనిపించింది.

ఆ పరిచయం క్రమంగా రోజూ కలుసుకొనేదాకా వొచ్చింది—ఆమె ఒక్కరోజు కనిపించకపోతే తహతహ లాడిపోయేవాడు తాను. ఆమెమీది అభిమానం క్రమంగా ప్రేమగా మారడం తనకి ఆశ్చర్యం కలిగించనూ లేదు. కాని, శాశ్వతంగా ఆమె తనదిఅయితే, ఆమెకి శాంతి ఉండదు—పేరులోతప్ప; అని తనకి తెలుసును.

దానికి కారణం—తన చరిత్రా, తన మనస్తత్వమూను. పుట్టుకనించీ తనలో విచిత్రమైన ఒక గుణం ఉండేది—అది కారణం లేకుండానే ఎవరినైనా ద్వేషించగలగడం.

తనకి జ్ఞానంవొచ్చిన దగ్గరనించీ ఈ గుణం తనని ఆశ్చర్యపరస్తూనే ఉంది; అది సహజంకాదనీ, వాంఛనీయంకాదనీ తనకి తెలుసును. కాని, కొంతమందిని చూడగానే, వారితో రెండు మాటలాడకుండానే వారిమీద తనకి ద్వేషం కలిగేది. మరీ చిన్నప్పుడు ఈద్వేషం తక్షణమూ అవతలి పిల్లలమీద (ఒక్కొక్కపుడు పెద్దవాళ్లమీద) చెయ్యి చేసుకునేలాగ చేసేది. పెరిగినకొద్దీ ఈ ద్వేషాన్ని అదుపులో పెట్టడం నేర్చుకనీ, ద్వేషాన్ని కొంత తగ్గించుకుని దైనందిన జీవితాన్ని గడుపుతూ వచ్చాడు. కాని, ఆగుణం తనలో ఎప్పటికీ పూర్తిగా నశించలేదు.

ఆ తత్వమే తనని సంసారానికి అనర్హుడిగా చేసింది. ఎంత మంచిదైనా, ఎంత సహనంగలదైనా, ఏ ఆడదీ తనలోఉన్న ఈ గుణాన్ని భరించలేదు. ఎప్పుడో ఒకప్పుడు, విధిగా ఆమె తనచేతిలో బాధపడుతుంది. జరిగేదంతా తనచేతిలోనూ ఉండదు...తనకతీతమైన ఏదోశక్తి తనలోని మానవతని హటాత్తుగా మాయంచేసి, తన స్థానంలో ఒక దానవుణ్ని ఉంచుతుంది. తాను నిస్సహాయంగా, వాడు ఎక్కడనించి వొచ్చాడో అక్కడికి వెళ్లేదాకా, వేచి ఉండడం కన్న ఏమీ చెయ్యలేడు.

ఆమెని పెళ్లిచేసుకుని సుఖపడదామనే అనుకున్నాడు తాను. అంతకుముందు ఆడవాళ్లతో తన పరిచయాలు ద్వేషంతోనే అంతమయిఉన్నా, వాళ్లు అందరూ తనకి ఆప్తులుకారు. మానసికంగా వాళ్లు తనకి దగ్గరకాదు కూడను. వాళ్ల స్వార్థంకోసం తన స్వార్థాన్ని వాళ్లు సంతృప్తి పరచారు.

గీత అలాగ కాదు.

ఆమెతో పరిచయం అయాక ఆమెని పెళ్లి చేసుకుందామని తాను మనసారా కోరాడు.

అందరిలాగానే, ఆమెతో తాను తిరిగి, యవ్వనంలో సహజమైన ఆనందాన్ని ఆమెతో పంచుకున్నాడు. ఆమెచుట్టాలెవరో హటాత్తుగా పోయిఉండడవ్వ కాని, త్వరగా ఆమె వివాహం చేసుకుని ఉండేవాడు.

మరొక ఆరునెలలు గడువుపడింది వివాహం.

ఆ ఆరు నెలలలోనూ మూడు బాగానే గడిచాయి.

ఆ తరువాత...

ఆ సాయంత్రం మళ్లీ జ్ఞాపకం చేసుకోవాలనిపించ లేదు శేఖర్‌కి. ఆ ఘట్టా లతనికి వివరాలు ముందునించీ తెలీవు.

అతనికి జ్ఞాపకం తమేని ఆ సాయంత్రం గేలార్డ్‌లో కలుసుకోడానికి ఆరువించి విదురు చూపి, ఆరువ్నరకి ఆమెరాగానే, ఆమెని దూషించడం: ఆమె కన్నీళ్లతో ఏదో అన బోతే ఆమెని లెంపమీద కొట్టడం.

దానితో ఆ సంబంధం రద్దు అయి పోయింది.

తానూ రద్దు అయాడు—చాలా మందికి. కోర్టు కేసులో తాను 'గిల్టీ' ప్లీడ్‌చేసి రెండువందల రూపాయిల జుల్మానా కట్టాడు.

తరవాత...

తరవాత అమిత: ఆమెతో మూపొట్లాట—

* * *

శేఖర్ బలవంతంగా ఆలోచనలని ప్రస్తుతానికి తెచ్చుకున్నాడు. జరిగిన వన్నీ జ్ఞాపకాలుగా తనకి కలిగించేది బాధకన్నా మరేమీ లేదుగా! 'పునరపి మరణం' అనినట్టు, సంయోగం, తన చేతులలో ఆ సంబంధానికి వినాశం, వియోగం. అంతే.

శాంతి...

తనని బలవంతపెట్టి ఇక్కడ పెట్టింది.

పదిహేనురోజుల క్రిందట.

ఆమెమీద తనకి ఆప్యాయత హెచ్చయిన కొద్దీ, అది ప్రేమగా మారినకొద్దీ తనకి బెంగగానే ఉంది—తనలోని దానవుడు బయటికి వొస్తాడేమోనని.

కాని, ఇప్పటిదాకా అవాంఛనీయమైన దేమీ జరగలేదు ... నెలరోజుల క్రిందట హటాత్తుగా తనకి జీవితంమీద కోరిక చావడం తప్ప.

అదే శాంతిమీద ఉదాసీనతని కలుగ జేసింది. అన్ని విషయాలమీద అసహ్యం కలుగజేసింది.

చావాలనిలేదు తనకి.

కాని, బ్రతకాలని లేదు.

సంపూర్ణమైన ఉదాసీనత.

శాంతిని చూడాలనిలేక ఆమెని కల వడం మానేశాడు. ఆమె తనని వెతుక్కుంటూ వొస్తే, కనిపించకుండా ఉండి పోయాడు. ఆరునెలల్లై ఆమె ప్రార్థనకి లొంగి తాగడం మానినా, మళ్లీ తాగుడు మీద విపరీతమైన కోరిక.

ఇంత ఉదాసీనతలోనూ ఆ కోరికని అదుపులో పెట్టుకున్నాడు.

చివరికామె తనని వేటాడి పట్టుకుని ఇక్కడ చేర్పించింది— మొదటి పదిరోజులూ నాలుగునుంచి ఆరుదాకా ఉన్న విజిటింగ్ అవర్స్ పూర్తిగా ఇక్కడ గడిపింది...తాను ముభావంగా ఏదో ఒకటిరెండు మాటలాడడం కన్నా చెయ్యకపోయినా. కొన్ని వారాల క్రిందట తనలో ప్రారంభించిన ఈ ఉదాసీనతకి కారణం అతనికి తెలీదు — నిజానికి ఆ విషయాన్ని గురించి తరిచి ఆలోచించాలనీ అతనికి లేదు. ఎప్పుడో హటాత్తుగా, తనకి తెలియకుండానే, ఆమె నించి జారిపోయి దూరంగా వెళ్లిపోవడం ప్రారంభించాడు... అంతే.

ఈ నాలుగు రోజులలో శాంతి ఒక్క రోజుమాత్రం వొచ్చింది-తొలినాడు రాలేనని టెలిఫోన్ చేసింది, ఆఫీసులో ఏదో అర్జెంటుపని కారణంగా. మర్నాడు అయి దయాక వొచ్చి అరగంటలో వెళ్లిపోయింది, ఉన్న కొంచెంసేపూ ముళ్లమీద కూర్చున్నట్టు కూర్చుని. ఆ తరవాత ఆమె రానూలేదు, ఫోనుగూడా చెయ్యలేదు.

ముందర అతనికి రిలీఫ్ కలిగింది ... తనని అంతగా శాంతి బంధించడం అతనికి ఈ మధ్య చాలా అసంతృప్తి కలుగ జేస్తోంది. మరోవారం తిరగకుండా ఈ నర్సింగ్‌హోమ్ విడిచి వెళ్లిపోవొచ్చుననీ, తన పూర్వాశ్రమంలోకి మళ్లీ ప్రవేశించి, ఆందోళనలేని జీవితం సాగించవొచ్చుననీ అతని కనిపించింది. అన్నీ ఆలోచిస్తే, ఈ ప్రేమ ఏమిటి, తాత్కాలిక వ్యామోహం తప్ప? గీతనీ, అమితనీ తాను ఒకప్పుడింత గాఢంగానూ ప్రేమించలేదూ? వాళ్లని ఇప్పుడు మనసారా ద్వేషించ గలగలేదూ?

శాంతిని ఇంకా తాను ద్వేషించడంలేదు; కాని, మరికొన్ని వారాల్లోనో, నెలల్లోనో, ఆమెనీ ద్వేషించ గలుగుతాడు.

శేఖర్ గడియారం చూసుకున్నాడు... మరో పదినిమిషాల్లో నాలుగవుతుంది.

తనకోసం శాంతి తెచ్చిపడేసిన పుస్తకాలలో ఒకటి తీసుకుని కుర్చీలో కూర్చుని చదివే ప్రయత్నం చేశాడు—కాని, అతని మనస్సులో ఏమీ పోవడంలేదు. పుస్తకం కిందనిపడేసి, మళ్లీ గదిలో పచార్లు సాగించాడు.

ఇక్కడినించి త్వరగా వెళ్లిపోవాలి. శాంతి మళ్లీ కనిపించకూడదు...



ఆమె ఇంకోంకూడా రాకుండా ఉంటే బాగుండును.

అతను మళ్ళీ టైము చూశాడు... ఇంకా నాలుగుకి ఆరునిమిషాలు ఉంది.

అతనికి శాంతినిగురించి ఆలోచించాలని లేదు. కాని ఆమెనిగురించి తప్ప ఆలోచించ లేకుండా ఉన్నాడు.

కొద్ది నిమిషాలు శేఖర్ దృష్టివంతనీ టెలిఫోన్‌మీద కేంద్రీకరింపజేశాడు. అది తనకి శాంతినించి సందేశం తెస్తే...

అతనెంత తీవ్రంగా టెలిఫోన్‌మీద దృష్టినిలిపినా ఏమీ జరగలేదు.

నాలుగయింది.

మరో ఇరవైనిమిషాలతరవాత అయిదు...

ఇంక ఆగలేక అతను ఆమె ఇంటికి టెలిఫోన్ చేశాడు—కాని, ఆమె ఇంకా రాలేదని చెప్పేరు.

ఆమె ఆఫీసుకీ టెలిఫోన్ చేశాడు—

నాలుగు కాకుండానే ఆమె వెళ్ళిపోయిందని అక్కడనించి చెప్పేక అతనికి కోపం వొచ్చింది. శాంతి ఎక్కడికి వెళ్ళిపోయింది?

ఆమె వెంటనే వొస్తే బాగుండును...

మళ్ళీ గదిలో పచారుచెయ్యడం ప్రారంభించాడు శేఖర్.

శాంతి ఎందుకు మారిపోతోంది?

# ప రా ఏ తు లు

శ జ్ఞాపకం వొచ్చాడు. అతనికి లండన్‌లో పోస్టింగ్ వొచ్చిందని విన్నాడు... కాని శాంతి ఆర్ద్రతితో అతనితో పూర్తి తెగతెంపులు చేసుకుంది. మరి?

తిన్నియుగాలో గడిచాక ఆరయింది.

శాంతి రాలేదు.

నర్స్‌వొచ్చి ముందురిచ్చి, డాక్టర్‌ని పిలిచింది. డాక్టర్ అతనికి సెడెటివ్ ఇచ్చి నిద్రపొగొట్టాడు.

ఆ తరువాత నాలుగురోజులూ శేఖర్ చాలా మంచి పేషెంటుగా గడిపాడు ... శాంతి ఇంక రాదని నిర్ణయించుకున్నాక అతనికి కొత్త ప్రశాంతి కలిగింది. అతని దైహిక పరిస్థితీ మారి, ఆతను అడగగానే డాక్టరు డిశ్చార్జి చేశాడు.

ఆఫీసునుంచి కొలీగ్సూ, ఇద్దరు డైరెక్టర్లూ వొచ్చి అతనికి శుభాకాంక్షలుచెప్పి ఇంటికి తీసికెళ్ళేరు... ఆతని ఇంటిదగ్గరే పార్టీ ఏర్పాటు చేశారు.

శేఖర్ తన రెండు డ్రింకులూ అయ్యాక మూడోది గ్లాసులో వేసుకున్నా, తాగలేక పోయాడు...ఫ్రెండ్స్ సంతృప్తిగా అతన్ని హేళన చేశారు.




'అంతలో — వెళ్ళిపోయేసరికి రాత్రి పది అయింది.

అప్పుడతను శాంతికి టెలిఫోన్ చేశాడు— ఈ కథకి అంతం అస్పష్టంగా ఆవడం ఇష్టంలేక.

అతనికి ఆమె కంఠస్వరం వినిపించగానే, 'శాంతీ! నేను నిన్ను డిస్టర్బ్‌చేస్తున్నానా?' అన్నాడు.

శాంతి నవ్వి, 'లేదులే... ఎక్కడినించి?' అంది.

'ఇంటినించి'

'బాగున్నావా?'

'చాలాను...'

'గుడ్...'

ఆ తరవాత నిమిషాలో అతనికి తెలియలేదు. ఆమెని చాలా ప్రశ్నలు వెయ్యాలని అతననుకున్నాడు. కాని, అవన్నీ అసందర్భాలుగా అనిపించాయి.

నిశ్శబ్దానికి అడ్డొస్తూ, 'శేఖర్!... ఇక్కడ చాలామంది ఉన్నారు. కాని, ఒక్కసారి నిన్ను చూడాలి...ఇప్పుడే. వొస్తేదా?' అంది శాంతి.

అతను ఆలోచనలో పడ్డాడు.

'పదినిమిషాలలో అక్కడ ఉంటాను.'

శాంతి టెలిఫోన్ పెట్టేసింది.

ఆమె వొచ్చేసరికి అతని డ్రాయింగ్ రూమ్ ఇంకా చిందరవందరగానే ఉంది. సిగరెట్ల పీకలతో నిండిన ఆష్‌ట్రేలూ, ఖాళీ గ్లాసులూ అసహ్యంగా కనిపిస్తున్నాయి.

శాంతివొచ్చి సోఫాలోకూర్చుని 'ఈమధ్య నా ప్రవర్తన విచిత్రంగా కనిపించింది కాదూ?' అంది ఉపోద్ఘాతం లేకుండా.

'అవును...'

'కారణం వినాలని ఉందా?'

'నీ ఇష్టం...'

'చెప్పాలని ఉంది నాకు...మళ్ళీ మనం కలుస్తామని అనుకోకు—చెప్పనీ' అంది.

'చెప్పు' అన్నాడు శేఖర్, అటూ ఇటూ పచారుచేస్తూ.

'నాకు ఎదురుగాకూర్చో...ఇంత కదలికచూస్తే నెర్వస్‌గా ఉంటుంది నాకు.'

శేఖర్ ఆమె మాట్లాడుతున్న తీరుకి ఆశ్చర్యపడి, ఆమెకి ఎదురుగా కూర్చున్నాడు.

'థాంక్స్...శేఖర్, కమల్ ఇంట్లో పార్టీ నాటకమనుంచి - చాలా దూరం వొచ్చేం

అతను జవాబివ్వలేదు.

'ఆరాత్రి నించీ నిన్ను ప్రేమించాను... అదీ నీకు తెలుసును...'

'అవును — కాని...'

'అదే చెప్తున్నాను. తరవాత నువ్వొ ప్రేమలోపడ్డావు — నీ ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. గౌరవనీయుడవు అయిపోయావు'

'...............'

'అదే నాకు పడదు శేఖర్ — నాది విచిత్ర ప్రవృత్తి అంటే అను. కాని, మెత్తటి మనుషులంటే చీదరించుకుంటాను నేను ... దానికి క్షమాపణ చెప్పడంలేదు. నీకు అర్థమౌతుందనుకుంటాను.'

శేఖర్ లేచి నిలబడి, ఆమె కళ్లల్లోకి చూశాడు — అక్కడ మార్దవంగాని, అనురాగం కాని కనిపించలేదు.

శాంతి తన బేగ్ తీసి, అనాడతనిచ్చిన నెక్లెస్ తీసి అతనికి ఇచ్చేందుకు చెయ్యి జాపుతూ, 'ఇది నాకు వొద్దు శేఖర్ ... నువ్వే ఉంచుకో' అంది.

'ఇచ్చినది తిరిగి తీసుకునే లోభం లేదు శాంతీ!... నువ్వే ఉంచుకో' అన్నాడు కోపంగా శేఖర్. అతని కోపం ఆమెమీద కాదు. తన మీదనే.

శాంతి నవ్వి, 'నీకు చాలా ప్రియురాళ్లు ఉన్నారు కదా! వారికెవరికైనా ఇయ్యి. నాకు నగలమీద మోజు లేదు' అంది.

'కుదరదు'

శాంతి నెక్లెస్ పెట్టెలో ఉంచి టేబిల్ మీద పెట్టి నిలబడి బయలుదేరుతూ, 'నీ యిష్టం — కాని. అది నాకు పాములాగ కనిపిస్తోంది. నేను ఏ పరిస్థితుల్లోనూ పట్టుకుని వెళ్ళను...గుడ్‌బై!' అని, నెమ్మదిగా అడుగులు వేసింది.

శేఖర్ ఆ పెట్టె చేతిలోకి తీసుకుని కోపంగా ఆమెమీదికి విసరబోయాడు.

శాంతి ఒక్కసారి వెనక్కి చూసి, అతని రౌద్రాన్ని గమనించి క్షణమాత్రం నిలబడి, మళ్ళి ముందుకి సాగి, తలుపు తీసి మళ్లీ వెనక్కి చూసింది.

అతను చేతిలో ఆ పెట్టెతో అలాగే నిలబడి ఉన్నాడు. వెక్కిరిస్తోన్న ఆమె కళ్లు మరింత కోపోద్రేకుడిగా చేశాయి.

అతను పెట్టెని గోడకేసి కొట్టాడు.

# సప్తవిధపాపాలు



బులుసు వెంకటరమణయ్య — ధర్మపథం

మనం చేసే పనులలో కొన్ని పుణ్య కృత్యాలు; కొన్ని పాపకార్యాలు కూడా ఉంటాయి. అందులో ఎక్కువ, తక్కువ భేదాలు ఉండవచ్చును. ఆ భేదాలను అటుంచి గమనించగా పాపాలు ఏడు విధాలుగా ఉంటాయని తెలుస్తుంది.

'ఏతజ్జన్మకృతం పాపం
యచ్చ జన్మాంతరార్జితమ్,
మనోవాక్కాయజం యచ్చ
జ్ఞాతాజ్ఞాతం చ యత్పునః
ఇతి సప్తవిధం పాపం—'

అని ఆ భేదాలు చెప్పబడినవి. అవి—(1) ఈ జన్మలో చేసుకున్న పాపం (2) వెనకటి జన్మలో చేసినది, (3) మనస్సువల్ల కలిగినది, (4) మాట మూలంగా వచ్చినది, (5) శరీరంవల్ల చేసినది, (6) తెలిసి చేసినది, (7) తెలియక చేసినది — అని.

మనం ఎంత ప్రయత్నించినా పాపాలు చెయ్యకుండా తప్పించుకోలేము. ఈ జన్మలో సంపాదించుకొన్న పాపం ఈ భేదాలలో ఒకటి.

కడచిన జన్మలో చేసుకున్న పాప పుణ్యాలు ఈ జన్మలోనూ మన పుట్టుకతోనే ప్రాప్తిస్తాయి. అలా సంపాదించుకున్నది జన్మాంతర పాపం.

పైకి చెప్పకపోయినా, మనస్సులోనే ఏ కారణంచేతనైనా ఇతరులను తిట్టుకొనడమో, నిందించడమో జరగవచ్చు అది కూడా పాపమే! అది బయటికి తెలియని పాపం!

ఇతరులపై ఉండే అసూయ, కోపం పట్టలేక మాటలమూలంగా వాటిని వ్యక్తం చెయ్యడం వల్ల కలిగే పాపం మరొక రకమైనది.

కోపంతోను, ద్వేషంతోను చెయ్యి కలుగ జేసుకొని ఆర్జించే కోపం మరొక భేదం.

కొన్ని పాపాలను మనం, అవి పాపాలని తెలిసి కూడా చెయ్యడం ఉన్నది. అట్టివి జ్ఞాత పాపములు.

కొన్ని పాపాలను మనం పాపాలని తెలియకుండానే చేస్తాము. అట్టివి అజ్ఞాతములైన పాపాలు.

ఈ రీతిగా సంభవించే పాపాల వల్ల దుఃఖం కలుగుతుంది. రోగం కలుగుతుంది. ఈ ఫలితాలు ప్రత్యక్ష గోచరమైనవి.

ఈ శోక, రోగాలు — రథసప్తమి నాడు స్నానం చెయ్యడం వల్ల నశిస్తాయట! ఆనాడు స్నానం చేసే సమయంలో

'యద్యజ్జన్మకృతం పాపం
మయా సప్తసు జన్మసు,
తన్మే రోగం చ శోకం చ
మాకరీ హంతు సప్తమీ'

అని పఠిస్తారు. మకర మాసపు సప్తమి రథసప్తమి. నాటి స్నానం ఏడు జన్మలలో చేసిన పాపాలనీ, రోగ శోకాలనీ నశింప జేయాలని దీని అభిప్రాయం. ●

నెక్లెస్ బయటికొచ్చి, నేలమీద పడింది.

శాంతి ఆశాభంగం చెందినట్టు ఆమె ముఖం చూస్తే తెలిసి ఉండేది ... ఆ విసరడం ఆమెమీదికే విసిరితే, ఆ ఆశాభంగం ఉండిఉండేది కాదు.

ఆమె నిరసంగా తలుపువేసి బయటికి వెళ్ళిపోయింది.

శేఖర్ ఆ మూసిన తలుపువేపు చూస్తూ చాలాసేపు నిలబడి, తరవాత సోఫాలో కూర్చుని నెక్లెస్‌వేపు దృష్టిని మళ్లించాడు.

చివరికి నెమ్మదిగా నెక్లెస్ తీసి, డ్రాయర్‌లో పడేసి, మరో డ్రింక్ గ్లాసులో పోసుకున్నాడు.

దాని రుచి చేదుగా ఉంది,

ఓటమిలాగ. ●




### జరిగిన కథ

రమణమూర్తి, శేఖర్ బాల్య స్నేహితులు. రమణమూర్తి ఒక కంపెనీలో పని చేస్తున్నాడు. శేఖర్ స్టేట్స్‌కి వెళ్ళి భార్య సుమతితో సహా ఇండియాకు వచ్చి రమణమూర్తిని చూడ్డానికి వచ్చాడు. రమణమూర్తి భార్య ఇందిర, సుమతి ఇద్దరూ ప్రాణ స్నేహితులు. శేఖర్‌కి పేకాటపిచ్చి. రమణమూర్తికి అలవాటు చేశాడు. శేఖర్ రిజైన్‌చేసి హైదరాబాదు మారడానికి ప్రయత్నాలు చేశాడు. విమానంలో పోవడంతో అపూరు బయల్దేరింది ఇందిర పిల్లలతో. తండ్రి రమణ పేరుతో పిల్ల, వామా రాయడం చాలమందికి కష్టం కలిగించింది. మిగిలిన వ్యవహారాలని లాయర్‌గారికి అప్పగించి చెల్లెలు గిరీష్‌ని తీసుకుని తిరిగి వచ్చాడు రమణ. శేఖర్, సుమతి వెళ్ళిపోయాక ఇందిర ఆదోలా అయిపోయింది. రాజారావుని ప్రేమించింది శిరి. ఆ విషయం అందరికీ తెలిసిపోయింది.

## 9

ఫైనల్ పరీక్షలు దగ్గిరపడ్డాయి ప్రిపరేషన్ లీవులు ఇచ్చారు కాలేజీలకు. అల్లరి మాని అంతా సీరియస్‌గా చదవసాగేరు.

రాజా వాళ్ళ వూరు వెళ్ళేడు. పదిరోజులైంది. ఇన్నిరోజులు రాజుని చూడక రాణికి పిచ్చిపట్టినట్టున్నది. పుస్తకం తెరిచినా— మూసినా చిరునవ్వులు చిందులాడే రాజా మోము గుర్తుకు వస్తూ చదువు సాగటం లేదు. ఏదో ఆలోచిస్తూ బాల్కనీలో అశాంతిగా తిరగటమే తప్ప పుస్తకం ముట్టుకోటం మానేసింది. పరధ్యానంగా విరాసక్తిగా ఉంటున్న రాణి వాలకం చూసి ఇందిర బాధపడింది.

'ఏమిటమ్మా అలా వున్నావు? శ్రద్ధగా చదువుతున్నట్టు లేదు. ఈ నాలుగు రోజులు కాస్త కష్టపడితే, ఇంక నిన్ను అడిగేవాళ్ళు వుండరు. ఒంట్లో కులాసాగా లేదా ఏం?' ఆప్యాయంగా అడిగింది.

'ఏమీలేదు వదినా—బాగానే చదువుతున్నాను' తప్పించుకో చూసింది.

'రాజుని మనింటికోసారి తీసుకు రమ్మన్నాను — పరీక్షలు కూడా అయిపోవస్తున్నాయి. నీనుకురాలేదేం?' రాణి మనస్సులో ఏమున్నదో తెల్సుకోవాలని ఇందిర ప్రయత్నం.

'రాజా వూళ్ళో లేడు వదినా — వచ్చాక తీసుకు వస్తాను'.

'దొరికిపోయావు దొంగ— నీ పరధ్యానానికి ఇదా కారణం' నవ్వుకున్నది ఇందిర.

నాలుగురోజుల అనంతరం రాజా వూరి నుండి వచ్చినట్టు తెల్సి, రాణి అతనికి ఫోన్ చేసింది.

'దొరగారు వూరి నుండి వచ్చినా — దర్శనం అపురూపమైంది, సాయంత్రం పార్కులో కలుస్తావా?'

'సారీ, నాకు చాలా బడలికగా వున్నది. ఏమనుకోకు రేపు కలుద్దాం, మాటలు పొడిగించకుండా ఫోన్ పెట్టేసాడు. ఆమె మనస్సు చిన్నబోయింది. తరువాత రెండురోజుల వరకూ అతడు దొరకలేదు. హాల్‌టికెట్ కొరకు కాలేజీకి వెళ్ళిన ఆమెకు గేటు దగ్గిర రాజా కనపడి వడివడిగా ఆమె అడుగులు అతడి వేపుకు సాగేయి. ఆమె అభ్యర్థన కాదనలేక మ్యాటరు పార్కువేపు పోనిచ్చాడు అతడు. ఒక ఏకాంతంగా వున్న నిద్రగన్నేరు చెట్టు నీడన ఇద్దరూ కూచున్నారు. అతడిలో మునుపటి వుత్సాహం లేదు, ఏటో చూస్తూ మౌనం దాల్చాడు. అది ఆమెకు వింతగా అనిపించి తానే ముందుగా పలకరించింది.

'ఏమి రాజా అలా వున్నావు? కులాసాగా లేదా? నాలుగురోజులని చెప్పి పదిరోజులుండిపోయావు. ఉత్తరమన్నా రాయలేదు. నన్నిలా వేధించటము నీకు సరదాగా వున్నదా!' ఆమె కంఠాన దిగులు ధ్వనించి—కన్నుల్లో నీరు సుళ్ళు తిరిగింది.

అతడు తేలిగ్గా నవ్వేస్తూ, 'మొత్తానికి అమ్మాయివనిపించుకున్నావు, నాలుగు రోజులకే ఇలా అయితే ఎలా? అవసరమైనప్పుడు వియోగాన్ని భరించే ధీరత్వం వుండాలి. ఇపుడు వచ్చానుగా ఇంకెందుకు దిగులు' ఆమె చేయి నొక్కుతూ అన్నాడు.

అతడి నవ్వులో—మాట తీరులో ఏదో లోటు కన్పించింది శిరికి. కాని అతడి సమక్షంలో తనకు వింతో తృప్తి—సంతోషము నిండి మైమరపించే మనస్సు మరోటి ఆలోచించనీయదు. పైగా ఇన్నాళ్ళ వియోగము అతడికి తనని మరింత చేరువగా చేసింది. ఉద్వేగంతో మనోభావాలు బిగిసిపడుతూంటే అతడి మౌనాన్ని భరించలేక పోతూంది. నవ్వలేని అనురక్తితో అతడికి మరింత దగ్గరకు చేరి చెక్కిలి భుజానికానించి 'హో...మైడియర్ రాజా మైహార్ట్ స్వీట్' చెవిలో గుసగుసలాడింది. అతడిచేయి ఆమె చెక్కిలి మెత్తగా నిమిరింది. కొంతసేపు ఇద్దరి మధ్యా మౌనం...

'చీకటి పడింది ఇక లేద్దామా?' రాజా మాటకు వులిక్కిపడి.

'అరె అప్పుడే చీకటి పడిందే! నిమిషంలో నాకు కాలగమనమే తెలీదు, నీవు లేకపోతే కాలమే స్తంభించినట్లుంటుంది. రాజా నన్ను వదిలి ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళవుగా! నన్నింత పిచ్చిదాన్ని చేస్తున్నావు నీలో ఏమి మహత్యం ఉన్నదో'. ఆమె వాలు కన్నుల్లో వర్ష ఋతువు గోచరించింది.

అతడు గంభీరంగా నవ్వుతూ, 'నీలో వున్న సమ్మోహనమే నాలో ప్రతిబింబిస్తూంది. చదువు మరిచి నీ చుట్టూ నన్నిలా తిప్పుకుంటున్నావు—నువ్వా తక్కువ దానివి కాదు' అన్నాడు.

'మాటలు తిప్పికొట్టటంలో ఘనుడివే' అని అతని చేయి అందుకుని లేచింది ఇద్దరూ స్కూటరు దగ్గిరకు వచ్చేరు.

'రాజా నాదో మాట' అర్థింపుగా అన్నది.

ఏమిటన్నట్లు చూశాడు అతడు.

'మా ఇంటికి ఒక్కసారి రావాలి నువ్వు, మా వదిన నిన్ను చూడాలనుకుంటోంది'

'ఎన్నాళ్ళీ వదినా—ఎందుకూ?'

'ఏమో—ఒక్కసారి వద్దూ—మా వదిన నిన్నేమీ కొరుక్కు తినదులే'

'నువ్వే కొరుక్కు తింటావేమోనని భయం' గట్టిగా నవ్వేడతను.

'పరిహాసం కాదోయ్. నిజంగానే—వస్తావుకదూ' గోముగా అన్నది.

అంతలో అతడి మొహం సీరియస్‌గా మారింది.

'ఇప్పుడు కాదు, చదవాల్సినది బోలెడు వున్నది, మరోసారి చూద్దాంలే'

ఆమె ఏమనలేక పోయింది. అంతలో వారిల్లు సమీపించింది. ఆమె నక్కడ వదిలి అతడు ముందుకు సాగిపోయాడు.

తరువాత రెండుమూడు పర్యాయాలు ఆమె వారింటికి రమ్మని అడగటం అతడు ఏవో కారణాలు చెప్పి దాటవేయటం జరిగింది. అతడు కావాలనే ఏవో సాకులు చెప్పి తప్పించుకుంటున్నాడేమోనని ఆమెకు అనిపించినా మాటిగా అడగలేక పోయింది.

పరీక్షలు మొదలై—అన్ని అలా వన్నపి—ఆరాటాన్ని వెనక్కు నెట్టివేశాయి. లాస్ట్ పరీక్షలు వ్రాసి విద్యార్థినులంతా వుత్సాహంగా కబుర్లు చెప్పుకుంటూ బస్‌స్టాప్ వేపు నడవసాగారు. మణి పిక్చర్ ప్రోగ్రామ్ వేసింది. అంతా ఓ-కే అన్నారు. శిరికిమాత్రం ఇష్టంలేదు. రాజుని కలవాలన్న కోరిక తీవ్రంగా వున్నది. ఎలా చెప్పాలా అని సంశయిస్తోంది. అంతలో రాజా స్కూటర్ దూరంగా కన్పించింది. మణివంక అర్థింపుగా చూసింది. అర్థం చేసుకున్న మణి భావగర్భితంగా నవ్వుతూ శిరి భుజం తట్టి 'నువ్వుండు శిరి— మళ్ళీ రేపు మనం వెళ్దాంలే' అన్నది. వాళ్ళ నెంబరు బస్సు రావటంతో అంతా శిరిని వెక్కిరిస్తూ బస్సెక్కేరు. 'హమ్మయ్య' అని వూపిరి పీల్చుకున్నది శిరి.

రాజా స్కూటరు దగ్గిరకొచ్చి ఆగింది. ఎక్కమన్నట్లు చూశాడు. అందుకొరకే ఎదురుచూస్తున్న శిరి 'ఎక్కడికని' అడగకుండానే వెనక కూచున్నది. సరాసరి

అతడి రూముకొచ్చి అగింది సూట్కేసుతో
'ఇదేమిటి! ఇక్కడికెందుకు' తెల్ల బోయింది శిరి.

'ఎప్పుడూ మా రూమ్ నీవు పావనం చేయలేదు. అందుకు' తాళం తీస్తూ అన్నాడు.

ఇదీ మంచిదే — అతడితో ఫ్రీగా మాట్లాడవచ్చు నమకున్నది. కుర్చీ ఒకటి ముందుకులాగి ఆమెని కూచోమని — ఫ్లాస్కులో కాఫీ రెండు కప్పుల్లోకివంచి ఒకటి ఆమెకు ఇచ్చి—ఒకటి తను తీసుకుని మంచంమీద కూచున్నాడు.

'ఊఁ... చెప్పు విశేషాలేమిటి? పేపర్సు బాగా అన్సరు చేశావా? ఈ మధ్యన మనం కలవటమే పడలేదు. నామీద కోప మొచ్చిందా ?' అతడేమో అంటున్నాడు. ఆమె నోటమాట రావటంలేదు. ఆమె మనస్సు ఎందుకో బెదరుతూంది. ఎప్పుడూ పార్కులోనో, బీచిలోనో కల్సుకునేవారు. చుట్టూ జనం వుండేవారు. కనకధైర్యంగా వుండేది— ఇప్పుడీ గదిలో ఒంటరిగా ఇతడితో— ఏదో భయం గొంతు నొక్కుతుంది. సంవత్సరం పైగా ఇతడితో పరిచయం వున్నది. ఇలా ఎప్పుడూ సంకోచంగా ఫీలవలేదు. చెప్పదల్చిన మాటలు నోట్లోంచి వూడిపడడంలేదు. చివరికెలాగో న్నది.

'మా ఇంటికి రమ్మని ఎన్నిసార్లు పిల్చినా రాలేదు. ఇంక మీ వూరెళ్ళిపోతావు. మరి ఇప్పుడైనా రావా ?'

'ఎందుకు మీ ఇంటికి?'

'ఎందుకేమిటి ? మా అన్నయ్యకు — వదినకూ నిన్ను పరిచయం చేస్తాను.

'ఆ అవసరం ఏమి వున్నది ఇప్పుడు!'

'అవసరం లేదా? కొత్తగా మాట్లాడుతున్నావేం రాజా.'

'కొత్తేమిటి? అవసరమేమిటి! నాకేమీ అర్థం కావటంలేదు' దగ్గిరగా వచ్చి అన్నాడు.

అతడికెలా చెప్పాలో తోచలేదు. కళ్ళప్పగించి అలా చూస్తుండిపోయింది. అతడామె భుజంమీద చేయివేసి మళ్ళీ అడిగాడు.

సిగ్గుతో పెదాలు అదురుతూంటే — తల వొంచుకుని, 'మన పెళ్ళి సంగతి' వినీవినపడకుండా మెల్లిగా గొణిగింది.

# చరితార్థులు

గదిగోడలు అదిరేట్లు నవ్వేడు 'పెళ్ళా? మనకే! భలే జోక్' మళ్ళీ పగలబడి నవ్వసాగాడు.

ఆమె బిత్తరపోయింది.

కొంతసేపటికి నవ్వటం ఆపి, 'రాణీ ఎప్పుడో సరదాకు అలా అన్నానని—ఇక ఆమాటే పట్టు కూర్చున్నావను కోలేదు' అతడి మాటలకు ఆమె శిలా ప్రతిమే అయింది. గుండె లయ తప్పినట్లు —రక్త ప్రసారం నిలిచిపోయినట్లు. ఏమిటో—ఏమిటో...కళ్ళు చీకట్లు కమ్మి తూలిపడబోయి నిలదొక్కుకున్నది. ఆ దిగ్భ్రాంతి నుండి తేరుకుందుకు కొన్ని నిమిషాలు పట్టింది.

అపలేని బాధ కంఠాన సుళ్ళు తిరుగుతూంటే— 'సరదానా? ఇదంతా సరదానా చెప్పు రాజా' పిచ్చిగా చూస్తూ అన్నది.

'ఎందుకంత ఫైర్ అవుతావు? కాస్త నింపాదిగా ఆలోచించలేవూ! అసలు మీ ఆడవాళ్ళకున్న జబ్బే ఇది. కాస్త చనువుగా — స్నేహంగా వుంటే చాలు ... ఇక దానికేవో అర్థాలు కల్పించుకుని 'పెళ్ళి' అని ఏడ్చి —ఆ స్నేహాన్ని వికృతంగా మార్చుతారు. ఆడవాళ్ళ ఈ ఏడుపుల్తో, స్వార్థంతో జీవితంలో ఎంతో ఆనందాన్ని, అందాల్ని కోల్పోతారు. హాయిగా ఎంజాయ్ చేయవల్సిన స్టూడెంటు లైఫ్‌లో — ఇలాటి స్నేహాలే మధురస్మృతులుగా మిగులుతాయి. పైగా అమ్మాయితో పరిచయాలు అబ్బాయికదో గొప్ప కూడాను.'

'నీ గొప్పదనం కోసం నా మనస్సుతో ఆడుకునే వంచకుడవనుకోలేదు' క్రోధంతో కసిగా అన్నది.

'పోనీ ఇప్పుడైనా తెల్సిందిగా ఏం చేస్తావేమిటి?' క్రూరంగా నవ్వేడు.

'రాజా ఎందుకిలా మనస్సుని బాధిస్తావు? నువ్వెందుకిలా మారిపోయావు — నీలాటివాడి పాలపడటం నా దౌర్భాగ్యం' ఏడవ సాగింది.

అతడు నిర్లక్ష్యంగా తల ఎగరేసి కిటికీ వేపు తిరిగి సిగిరెట్టు వెలిగించాడు.

అతణ్ణే చూస్తే ఆమెకేదో భయం ఆవహించింది. 'నిన్ను చూడక ఒక్క రోజైనా వుండలేనన్నాడు. ప్రేమించానన్నాడు, పెళ్ళి చేసుకుంటానన్నాడు. వీడెందుకిలా మారిపోయాడు? మెదడు మొద్దుబారి—కళ్ళు మూసుకుని వెనక్కి వాలింది.

అతడి అడుగుల సవ్వడికి కళ్ళువిప్పింది. వాకిలి తలుపు గడియవేసి దగ్గరగా వస్తున్న అతణ్ణి చూసి ఎగిరి నిల్చున్నది. అతడు భుజాల మీద చేతులువేసి నొక్కి కుర్చీలో కూలేసేడు. అతడి స్పర్శ ఆమెకిప్పుడు మైమరపు కలిగించలేదు. అతడి నవ్వులో పైశాచికత్వం గోచరించి భీతిల్లి — వణికిపోయింది.

'రాజా నేను వెళ్ళిపోతాను' లేచి నిల్చున్నది.

అతడి మొరటు చేతులు ఆమె చుట్టూ బిగుసుకున్నాయి. ఆ చేతుల మధ్య ఆమెకి వూపిరి ఆడటం లేదు. అతడి వూపిరి చెంపలకు తాకి కాలిపోతున్నాయి. అతడి స్పర్శకు వళ్ళంతా వుడికిపోతూ ఉంది.

'వద్దు—రాజా— వద్దు—నీకు దణ్ణం పెడ్తాను. నన్ను వదులు వెళ్ళిపోతాను' బ్రతిమలాడ సాగింది.

ఆమె స్థితి అతడికి సరదాగా వున్నది.

'ఇన్నాళ్ళు కల్సి తిరిగేం — ప్రేమించుకున్నాం. ఈ మాత్రం అనుభవమైనా లేకపోవటం పిచ్చిచేటు. నీ అందం నన్ను పిచ్చివాణ్ణిచేస్తే—అవకాశం కల్సిరాక ఎంత నిగ్రహించుకున్నానో తెల్సా—రాణీ మంచి అమ్మాయిలాగా నామాట విని నాకోరిక తీర్చు. అల్లరి పెట్టావో అది నీకే ముప్పు. నిన్ను రక్షించటానికి ఎవరూ లేరిక్కడ' బలవంతంగా మంచం మీదకు తోశాడు.

ఆమె గింజుకుంటూ— అతడి నుండి విడివడటానికి విశ్వప్రయత్నం చేస్తోంది. అతడిలో పట్టుదల, కోపం పెరిగింది. 'పోనీ పెళ్ళి చేసుకుంటానులే. పెంకితనం చేయకు' హేళనగా నవ్వేడు. ఆ నవ్వు రాక్షస నవ్వులాగా ఆమెని అదరగొట్టింది. 'పెళ్ళిచేసుకుంటే అప్పుడు నీ ఇష్టం— ఇప్పటికిమాత్రం నన్ను వంపేయి' కళ్ళనీళ్ళతో దీనంగా ప్రాధేయపడింది. అతడికి జాలి కలగలేదు. ఆమెలో క్రోధం— ఆవేశం పెల్లుబికి, చేతులూ— కాళ్ళు కొట్టుకుంటూ—గుప్పెళ్ళు బిగించి అతడి ఛాతీ మీద కొడ్తూ పెనుగులాడ సాగింది.

ప్రాణంలేనిదానిలా సుకుమారంగావున్న ఈ అమ్మాయిలో ఇంత బలం ఎక్కడిదా అని ఆశ్చర్యపోయాడు. ఆమె పెనుగులాడుతున్న కొద్దీ అతడిలో పట్టుదల పెరిగి మానవత్వాన్ని మరచి— క్రూరంగా ఆమెని వశపర్చుకోవాలని చూశాడు. చివరికామె అలసిపోయింది. చేతులు కాళ్లు గుడ్డపేలికల్లా వేలాడిపోతూంటే — నీళ్ళూరే కళ్ళతో నిస్సహాయంగా చూస్తూ—

'దేవుడా నన్ను రక్షించు' కనపడని భగవాండికి రెండుచేతులూయెత్తి నమస్కారం చేసింది.

ఉత్తము కులోద్భవులకు— భగవంతుడు సదా తోడుగావుండి రక్షిస్తాడని అంటారు. ఆమె మొర భగవానుడు ఆలకించాడేమో?

వాకిలి తలుపు దబదబా చప్పుడైంది. ఆమె కళ్లల్లో ఆశ మెరిసింది. అతడి గుండె భయంతో క్షణం ఆగింది. అదే పనిగా తలుపు కొడుతున్నదెవరో? — ఇహ లాభం లేదనుకున్నాడేమో — వాడిపోయిన మొహంతో—కసిగా ఆమెవంక చూసి— వెళ్ళి తలుపు తెరిచాడు.

రోజూ క్యారియర్ తెచ్చే కుర్రాడు, తల్లికి సుస్తీగావుండి ఆపూట శలవు అడగటానికొచ్చి వాకిట నిలబడ్డాడు.

'శని వెధవ— ఏం ముంచుకుపోయిందని ఇప్పుడే తగులబడ్డావు?' తన కోపమంతా వాడిమీద చూపి చెంప చెళ్ళుమనిపించేడు.

తలుపు తెరిచిందే తడవుగా— ఆకలిగొన్న బెబ్బులి పంజానుండి— తప్పించుకున్న లేడికూనలాగా వాకిట్లోకి దూసుకుపోయింది శిరి. ఎలా ఇంటికి వచ్చిందో ఆమెకే తెలీదు. వస్తూనే సరాసరి తన గదిలోకి వెళ్ళి మంచంమీదవాలి భోరున ఏడవసాగింది.

రాత్రి భోజనాంవేళ...ఇందిర పిలవగా—పిలవగా తూలుతూ లేచి వెళ్ళి తలుపు తెరిచింది. శిరి వాలకం చూసి విస్తుపోయింది ఇందిర.

'ఏమిటమ్మా యిలా వున్నావు' వొళ్ళు పట్టిచూసి 'జ్వరం వచ్చినట్లున్నది. సరిగ్గా నిద్రలేకుండా పరీక్షలకని చదివేవు పడి చేసిందేమో! రెండురోజులు రెస్టు తీసుకుంటే తగ్గిపోతుందిలే' అని తలనొప్పి మాత్ర— కాఫీతెచ్చి ఇచ్చింది. వదినమాట కాదనలేక మాత్రవేసుకుని కాఫీ త్రాగి పరున్న శిరికి తెల్లవారేసరికి నూటనాలుగు డిగ్రీల జ్వరంతో వొళ్ళుతెలీకుండా పడున్నది. అర్థంలేని కలవరింతలు—వుండివుండి వెక్కివెక్కి ఏడ్వటం ఆమె స్థితి ఇంట్లో అందర్నీ ఆదుర్దా పరిచింది. రామనాథం గారు దగ్గరేవుండి శ్రద్ధగా ట్రీట్‌మెంటు చేస్తూ — ఇంట్లో అందరికీ ధైర్యాన్ని కలిగించారు. నాలుగవరోజు జ్వరం కాస్త తగ్గి మత్తుగా నిద్రపోయింది. మరి రెండు రోజులకు కాస్త తేరుకున్నది— కానీ ఆలోచన్లు ఆమెను వీడటంలేదు. పరివేదన మెదడును పుడికించేస్తోంది. రాజా గదిలో ఆనాటి సంఘటన తల్చుకుని — తల్చుకునీ కుమిలిపోతూంది. అది నిజమేనా? కల కాదు కదా. అన్న భ్రాంతి మనస్సువీడటం లేదు.

రాజా—రాజా? అతడి పేరు తల్చుకుంటేనే హృదయం ఆనందంతో గంతులిడుతుంది. ఇన్నాళ్ళ పరిచయంలో అతడెప్పుడూ హద్దుమీరలేదు. ఆరోజు ఎందుకలా జరిగింది. తన దౌర్భాగ్యమా! అతడి అవివేకమా? తనే సరైన విధంగా అడుగలేదేమో—తన తప్పిదం కూడా కొంత వున్నదేమో!

నిన్నోసారన్నాడు — అతడు తన కళ్ళల్లోకి చూస్తూ — 'డియర్ రాణీ నా హృదయమంతటితోనూ నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను తప్ప మరొకర్ని కలలో సహితం తలువను.—నన్ను నమ్ము రాణీ —నేను నీవాణ్ణి' తెలిపి అంతగా నమ్మబలికినవాడు — అతడెందుకింతలా మారిపోయాడు. అమర్యాదగా — ఆప్యాయతతో అతడు కోరితే నిరాకరించేది కాదేమో— ఎందుకంత మొరటుగా ప్రవర్తించి — ఇంతలా అపహాస్యం చేశాడు? తను తట్టుకోలేక పోయింది. పవిత్రమైన ప్రేమను బుగ్గిపాలు చేసి— నీచాతి నీచంగా బలాత్కరిస్తే— తనెలా ఒప్పుకోగలదు? ప్రేమించిన ప్రియుడికైనా—పెళ్లి కాకుండా సమర్పణ కావటం స్త్రీ ధర్మానికే విరుద్ధం — తనలా ధర్మచ్యుతురాలు కాలేదు. వూ...హూ...తన తప్పేమీ లేదు.

అతను...అతనే!... నమ్మశక్యంగాని అతని ప్రవర్తన తల్చుకుంటే బాధతో, అసహ్యంతో నరనరమూ ముడుచుకుపోతోంది. కానీ ... కానీ. మనోహరమైన అతని రూపు—ముద్దులూరే అతని పెదాల్లోంచి విరిసే సమ్మోహనకరమైన చిరునగవు — తల్చుకుంటే మనస్సు ఆనంద రసాబ్ధిలో మునిగిపోతుంది. అతడి రెండు సంవత్సరాల పరిచయం — పూలజల్లులాగా హృదయాన్ని పరిమళావృతం చేసింది. ప్రప్రథమంగా తన ముగ్ధ మనస్సుని దోచుకున్న సుందర పురుషమూర్తి అతడే. ఆరాధనా భావం నిండిన తన మనస్సు, కోరికలు తీవలు సాగి చివురించే సమయానికి—దారుణంగా తుంచివేసి — హృదయాన్ని అతడు గాయపరిచిన మాట నిజమే అయినా అతణ్ణి మరచి తను బ్రతకలేదు, అతడి ప్రవర్తన ఎలా వుండని



తోక — అతడు తనకు కావాలి; అతడితో గడిపిన గత స్మృతులు పూల డోలికలై — హాయిగొల్పి — ఒకానొక బాధా మధురమైన విలక్షణ దశలో మనస్సు కొట్టుకుపోతూంటే పిచ్చిగా మంచం మీద పడి పొరలసాగింది. చివరికో నిర్ణయానికొచ్చి — మెల్లగా లేచి హాల్లోకి వచ్చింది. ఇందిర వంటఇంట్లో పని చూచుకుంటుంది. పిల్లలు ఎక్కడున్నారో — హాల్లో ఎవ్వరూ లేరు. మెల్లగా ఫోన్ తీసింది.

'మీకు ఫోన్ వచ్చిందండి' ఇంటివారి అబ్బాయి వచ్చి చెప్పితే రూమ్ నుండి వచ్చి ఫోన్ అందుకున్నాడు రాజా.

'హలో — ఎవరు కావాలండీ?'

'రాజా నువ్వేనా?'

'ఓహో రాణీగారా! ఇంత పొద్దుటే నాతో తమరికేమిటి పని?' అతడి మాట వాడి బాణంలాగా దూసుకొచ్చి గుండెల్లో గుచ్చుకొంది కన్నీరు ఆపుకుంటూ

'అలా అనకు రాజా. నీతో కాక నాకింక ఎవరితో పని వుంటుంది?

'మొన్నటి సంఘటనకు నేను చాలా విచారిస్తున్నాను. తప్పెవరిదన్న ప్రసక్తి వద్దు. పరస్పరం క్షమించుకుందాం' ఆమెమాట పూర్తి కాకుండానే,

'నేను నిన్ను క్షమార్పణ కోరలేదే?' అతడి కంఠం కరుగ్గా పలికింది.

'పోనీ నేను కోరుతున్నాను. జరిగింది మరిచి ఎప్పటిలా వుందాం.'

'పెళ్ళిచేసుకుని' హేళనగా నవ్వు.

'రాజా నన్నలా అవమానిస్తే నీకు తృప్తిగేదేమన్నావుంటే — అవశ్యం అలానే కానివ్వు, కానీ — నా వేడికోలు తోసి పుచ్చకు — డియర్ — ఇన్నాళ్ళ మన ప్రేమను వృధా కానీయకు — దాంపత్యజీవితంలో మన ప్రేమ పండించుకుని ధన్యులమవుదాం — కోరివచ్చిన దాన్ని చులకనచేయకు — నీకు తప్ప మరొకరికి నా మనస్సులో చోటు లేదు — నన్ను నమ్మి రాజా' జాలిగా ఆమె కంఠం వణికింది.

'ఈ విషయాన్నిగూర్చి ఇక తర్కించటం అనవసరం — నా నిర్ణయానికి తిరుగు లేదు. ఏదో కొన్నాళ్ళు సరదాగా కలిసి తిరిగేము. ప్రేమ నే కైపులో వాళ్ళం మరిచి — అర్ధంలేని వాగ్దానాలెన్నో చేసుకొవచ్చు; వాటికేమాత్రం విలువలేదు. అది అంతటితో మరిచిపోవటం ఉభయ శ్రేయస్కరం. ప్రేమవేరు — పెళ్ళివేరు

# చరితార్థులం

రేంటినీ కలపటం దుర్లభం — అయినా నాకు బోలెడు ఆశయాలు వున్నా. జీవితంలో ఎంతో ముందుకువెళ్ళాలి — రెండు చేతులా ధనం సంపాదించాలి. పదుగురిచేతా ప్రశంసల కిరీటం పెట్టించుకోవాలి — మా నాన్న గారి ఫ్రెండొకాయన — వాళ్ళమ్మాయిని చేసుకుంటే — ఫారెన్ పంపుతానన్నాడు. ఆ అమ్మాయి నీ అంతటి అందగత్తె కాకపోవచ్చును. జీవితంలో కావాల్సినది అందమొక్కటేకాదు — కాళ్ళముందుకొచ్చిన బంగారు అవకాశాన్ని — వదులుకుని — వ్యర్ధమైన ప్రేమకోసం తల్లీ — దండ్రీ — ధనం లేని నిన్ను చేసుకుని నేను పొందబోయే లబ్ధి ఏమీ వుండదు — అసలలాటి ఫూల్స్ ఎవరూ వుండరనుకుంటాను. ఏదో నాలుగు రోజులు కలిసి తిరిగేమని, పెళ్ళి, పెళ్ళి — అని వెంటపడటం నీకు సిగ్గుగా లేదూ!'

'రాజా అలా అనకు — నామాట కొంచెం విను' దుఃఖంతో నోటమాట రాక తడబడింది.

'లేదు — ఇంక వినేది లేదు — నువ్వు చెప్ప వద్దు — ఇవాళే నేను మా వూరు ట్రయిన్ ఎక్కుతున్నాను. మన పరిచయానికి గుడ్ బై' టక్కున ఫోను పెటిన శబ్దం.

'రాజా హలో... హల్లో... హ...ల్లో' చేతిలో రిసీవర్ జారిపోయి స్మృతితప్పి టేబిల్ మీదికి ఒరిగిపోయింది శిరిష్...

* * *

## కోయిల కూత

కోయిల కూయదేమి
ఆమని రాదదేమి?

అలుముకొన్న యిరులు
తొలగిపోయి మరల
వెలుగు రాదదేమి? ॥కోయిల॥

ముసురుకొన్న వెతలు
సమసిపోయి మరల
సుఖము రాదదేమి? ॥కోయిల॥

చీకు చింతలతో
చేదు తలపులతో
సతమతమై పోవు
నాదు మనసులోన ॥కోయిల॥

— డా॥ చల్లా రాధాకృష్ణశర్మ

మెదడంతా మనోశూన్యం ఆవరించింది. రాజాలేని తన బ్రతుకుని వూహించటమే దుర్భరంగా వున్నది. ఒకవిధమైన ఉన్మాద స్థితిలో పిచ్చిగా కప్పునంకమూస్తూ గదిలో మంచానికంట పెట్టుకుని ఏడ్వడూ వరుండే శిరిని మాసి ఇందిర ఎంతో బాధపడింది.

'ఏమిటని?' అడిగితే వెర్రిగా నవ్వటమే తప్ప జవాబులేదు. ఈ స్థితిలో ఆమెను బలవంతం చేయరాదని తనంతట తానే చెప్పేవరకు వేచివుండాలని వోర్పు వహించింది ఇందిర.

రమణకు ఆఫీసు వర్కు ఎక్కువగా వుండటం వలన — ఇంట వుండే టైము తక్కువ అవటంవలన, ఇంటి విషయాలు అంతగా పట్టించుకోటంలేదు. పిల్లలంతా శలవులకు సుమతివాళ్ళ వూరు వెళ్ళారు; శిరికి కోరినంత ఏకాంతం లభించి అనేకమార్గాల్లో ఆలోచనలు పరిగెత్తి — పరిగెత్తి అలసిపోయింది.

చివరికి ఇదంతా వదినకు చెప్పి గుండె భారం దింపుకోటం ఒక్కటే మార్గమన్న నిర్ణయానికి వచ్చింది.

పదిహేనురోజుల తరువాత ఆనాడే బైట కొచ్చి వాకిట్లో పూలమొక్కల మధ్య కూర్చున్నది శిరి. రమణ క్యాంపు వెళ్ళేడు.

పాపకు అన్నంపెట్టి నిద్రపుచ్చి, తమిద్దరికి వడ్డించి ఇందిర కేకపెడ్తే — లేచి లోపలకు వచ్చింది శిరి. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేశారు. ఆడబడుచులో ఈమాత్రం మార్పు వచ్చినందుకు ఇందిర ఎంతో సంతోషపడింది. ఇందిర వంటగది సర్దుతూంటే, శిరి ఏదో పుస్తకం తీసుకుని సోఫాలో కూర్చున్నది. వదిన పని ముగించుకుని వచ్చాక — తన మనోవేదన ఆమెకి చెప్పాలని ఆరాటంగా ఎదురు చూస్తోంది. పేజీలు తిప్పుతోంది గాని, ఆమె దృష్టి అందుమీద లేదు.

ఇందిరకు రాత్రివేళ పని ముగిసేక — పరుండే ముందు కాసేపు రామాయణం చదువుకోటం అలవాటు.

ఆనాడు అల్లాగే పనయ్యాక రామాయణం చేతిలోకి తీసుకు కూర్చున్నది. ఆమెను ఆటంకపరచలేక సోఫాలో జారగిలపడి మౌనంగా వినసాగింది శిరీష్.

సీతాదేవి పరిత్యాగ ఘట్టం చదువసాగింది ఇందిర.

(ఇంకా వుంది)




ఎస్. సామ్రాజ్యం, ఒంగోలు

చిన్నపిల్లలకు లివరు వచ్చినప్పుడు కనబడే లక్షణాలు ఏమిటి? దీనికి ఏమి చేయాలి? ఇది పెద్దవారికి కూడా వస్తుందా?

* కడుపు ఉబ్బరం, ఆకలి లేమి, మలబద్ధకం, వాంతులు, తరచూ జ్వరం రావటం, ముఖము, చేతులు, కాళ్ళు సన్నగా వుండి, కడుపుమాత్రం పెద్దదిగా వుండటం లివరు వున్న పిల్లలకి కనబడే లక్షణాలు ఇలా వటానికి చాలా కారణాలు వున్నా, ముఖ్యంగా కామెర్లు వచ్చిన తర్వాత, ఎక్కువగా గ్రైప్‌నాటర్ లాంటి పదార్థములు వాడినప్పుడు, ఆహారంలో క్రొవ్వు పదార్థములు ఎక్కువయినప్పుడు, ఆహారంలో కొన్ని అసాధారణ పదార్థాల వల్ల ఈ లివరు పెద్దది కావటం జరుగుతుంది.

పెద్దలకి కూడా ఈ కారణాలవల్ల లివరు పెద్దదవవచ్చును. ఎక్కువగా మధు పదార్థములను వుపయోగించేవారికి ఈరోగం తరచూ వస్తుంది.

టి. హనుమయ్య, వినుకొండ.

మూడు సంవత్సరాలుగా, కొన్ని పళ్ళు పుచ్చినాయి. ఎన్ని మందులు వాడినా పంటి బాధ తగ్గలేదు. పళ్ళు కదలటంలేదు.

* పిప్పి పళ్ళకి, దంతవైద్యుల సలహా ప్రకారం వైద్యం చేయించాలి. ఫిల్లింగ్ చేయటంవల్ల, ప్రారంభదశలో వున్న పళ్ళు నెప్పి పెటవు మరీ ఎక్కువగా వున్నప్పుడు, పళ్ళు కదలకపోయినా దంతవైద్యులు ఇంజక్షను చేసి తీసివేయగలరు.

వైద్యం చేయించకుండా వుంచటం వల్ల, మొత్తం శరీరానికి, క్రిములు వ్యాప్తి చెందటానికి అవకాశము వున్నది.

బి. సీత, పెద్దాపురం.

నా వయస్సు 19 సం॥లు. సుమారు 4 సం.లుగా తల వెనుకభాగంలో పోటు వస్తోంది; అప్పుడప్పుడు వాంతులు, కళ్ళు తీపు వుంటున్నాయి.

* ఈ విషయాలను గురించి మీరు దగ్గరలో వున్న న్యూరాలజిస్టుకి చూపించండి. వారు నేత్రవైద్యులు కలిసి కొన్ని ప్రత్యేక పరీక్షల ద్వారా రోగ నిర్ణయము చేయగలరు. ఆలస్యం చేయకుండా వైద్యం చేయించటం చాలా ముఖ్యము. మెదడులో ఏదైనా భాగములో వాపు, కురుపు మొదలయినవి వున్నప్పుడు ఇలా రావటానికి అవకాశము ఎక్కువ

కె. రామేశ్వరం, మద్రాసు.

అపెండిసైటిస్ అంటే ఏమిటి? అది వచ్చినప్పుడు ఏమేమి జాగ్రత్తలు తీసుకోవాలి.

* పెద్దప్రేవుల మొదటి భాగంలో వున్న చిటికెనవేలు ప్రమాణంలో వున్న భాగము (అపెండిక్స్) వాయటాన్ని అపెండిసైటిస్ అంటారు. ఇలా జరగటానికి, పురుగులు, గట్టిపడిన మలము దాని ద్వారమునకు అడ్డుపడటం ముఖ్య కారణం. అడ్డుపడినప్పుడు, ఈ భాగములో వుత్పత్తి అయ్యే ద్రవములు బయటికి పోవు.

ఈ రోగం వచ్చినప్పుడు శస్త్రచికిత్స ద్వారా తీసివేయుటమే సరిఅయిన మార్గము. ఇలా కాకుండా, రోగికి విశ్రాంతితోపాటు, శరీరానికి కావలసిన నీరు, లవణములు ముఖ్యముగా ఇస్తూ, అక్రోమైసిన్, పెన్సిలిన్ వంటి మందులద్వారా చాలామటుకు వుపశమనం కలిగించవచ్చును. అయినా, ఏ సమయంలోనైనా, శస్త్రచికిత్సకు తయారుగా వుండాలి.

డి. రామకృష్ణ, విజయవాడ.

నా ఎడమచేతి బొటనవేలి మీద గోరు ప్రక్కన కాయలాగా లేచి నొక్కినప్పుడు మాత్రం నెప్పి పుడుతుంది. అది నల్లగా వుండి నీళ్ళు తగిలినప్పుడు తెల్లగా అవుతుంది...

* దీనిని శస్త్రచికిత్స ద్వారా తీసివేయవచ్చును. ఏమీ ప్రమాదం లేదు మీ స్నేహితుని సలహామీద నైట్రిక్ ఆసిడ్ వుపయోగించితే పుండుపడి ఇంకా ఎక్కువ అవటానికి అవకాశము వున్నది.

ఎమ్. సత్యనారాయణరావు, నూనికొండ.

నాకు 16 సం॥ల వయస్సు. కొన్ని ఏండ్లుగా చేతివేళ్లు వణుకుతున్నాయి శరీరం అంతా కూడా కొద్దిగా వణుకుతున్నట్లు అనిపిస్తున్నది.

* చేతివేళ్ళు వణకటం, నరాల బలహీనతవల్ల, థైరాయిడ్ గ్రంధి ఎక్కువగా పనిచేయుటం వలన కలిగే 'హైపర్ థైరాయిడిసమ్' వల్ల, 'రుమాటిక్ కొరియా', వయస్సు పైబడిన వారిలో పార్కిన్సోనిజం, మొదలగు వాటివల్ల గావచ్చును.

సీరమ్ కొలెసగాల్, బి ఎమ్. ఆర్, I 131, పి. బి ఐ మొదలగు పరీక్షలు వైద్యుల సలహామీద చేయించుకొంటే థైరాయిడ్ గ్రంధికి సంబంధించిన రోగమైతే తెలుతుంది. ఇది సరిగా వున్నప్పుడు మిగిలిన రోగాలకు పరీక్ష చేయించుకొని తగిన మందులు వాడండి.

కె. ఎల్. శేషకుమారి, హైదరాబాద్.

నా మెడమీద రూపాయిబిళ్ల ప్రమాణంలో తామరలాగ వుండి, మందులు వాడినప్పుడు తగ్గినట్లుండి తిరిగి వచ్చుచున్నది.

* పైపైకి ఎన్నిమందులు వాడినా లోపలికి కూడా మందులు తీసుకోవటం ముఖ్యం. సబ్బు వుపయోగించకూడదు 'గ్రైసొవిన్—ఎఫ్–పి 11 మాత్రలు కెనలాగ్. ఎస్' ఆయింట్‌మెంటు ఒకేసారి పదిహేనురోజులపాటు వాడితే తగ్గుతుంది. మాత్రలు పూటకి ఒకటి చొప్పున మూడు పూటలు రోజుకి వాడాలి.

# పెద్దకథ



ఎస్.ఎస్. ప్రసూన

# తెరచియున్న తలుపు

■ ఉదయం తొమ్మిదిగంటలవేళ.

అప్పుడే వూరినుండి వచ్చిన సుజాత స్నానం ముగించి—వదిన సుమిత్ర ఇచ్చిన వేడి వేడి కాఫీసేవించి— పేపరు తీసుకుని ఈజీఛైర్లో వాలింది.

ప్రయాణం బడలికవున్నదేమొ. మెల్లగా కళ్ళు మూతలుపడ్డాయి.

'ఇదేమిటలా కుర్చీలోనే పవళించావు. లేచి గదిలోకి వెళ్ళి మంచంమీద పడుకోపోయావు? సరేలే! ఎలాగూ పదకొండు గంటలైంది. కాస్త భోజనంచేసిపడుకుందువు గాని!!' సుమిత్ర లేపితే బద్ధకంగా కళ్ళు విప్పిన సుజాత.

'అన్నయ్యవచ్చాడా? రానిద్దూ అందరం కల్సే తిందాం' మళ్ళీ కళ్ళు మూసుకున్నది.

'మీ అన్నయ్య ఈ టైముకు రావటం ఎప్పుడన్నా చూశావా! ఆయనకు హాస్పటలే ఇల్లు, రోగులే ఆప్తులు. ఎవరితో వంతేసు కుంటే మనకు శివరాత్రే—ఎవరినన్నా పెళ్ళి చేసుకోవచ్చుగాని—డాక్టర్లని మాత్రం ఛస్తే చేసుకోకూడదు. డాక్టర్లని చేసుకుంటే— తిండికి నిద్రకు నీళ్ళొదులుకోవాల్సిందే. ఈ సంగతి గట్టిగా గుర్తుపెట్టుకో అమ్మాయ్— రద్దూ మనం తినేద్దాం' సుజాత మాటకు ఎదురుచూడకుండానే వంట ఇంట్లోకి వెళ్ళి ఇద్దరికి కంచాలుపెట్టి వడ్డించింది సుమిత్ర

ప్రయాణం సంగతులు వదినగారికి చెప్తూ మెల్లగా తినసాగింది సుజాత.

'నీకు ఇష్టమని కాలీఫ్లవరు ఆలు దుంపలు కలిపి కూరచేసేను మరి కాస్త వేసుకో' అని వద్దన్నా బలవంతంగా వేస్తూ,

'అన్నట్లు చెప్పటం మరచాను. 'మాస్టారి పెళ్ళిట' అన్నది సుమిత్ర.

'ఏ మాష్టారి పెళ్ళి?' యాధాలాపంగా అడిగింది సుజాత.

'మన మాష్టారే, జగన్నాధరావు పెళ్ళి' వింటున్న సుజాత వులిక్కిపడింది నోట్లో పెట్టుకోబోతున్న ముద్దజారి కంచంలో పడింది తత్తరపాటు కప్పిపుచ్చుకుంటూ మంచినీళ్ళు త్రాగబోతే కొలబారి వుక్కిరి బిక్కిరైంది 'కాస్త నెమ్మదిగా తాగు ఎందుకంత తొందర' అంటున్న సుమిత్ర మాట వినిపించుకోకుండా—

'ఇక చాలు పెరుగుపోసెయ్ వదినా' అన్నది

'అదేమిటి కాస్తన్న తినలేదు ఇప్పటిదాకా బాగానేవున్నావుగా ఇంతలో ఏమైంది'

'బాగా తలనొప్పిగావున్నది వదినా, రైల్లో బాగా రష్‌గావున్నది నిల్చునేందుకైనా జాగా లేదు తెల్లవార్లు కన్నుమూయనేలేదు. కాస్సేపు పడుకుంటేనేగానీ ఈ తలనెప్పిపోదు' అంటూ పెరుగన్నం సగమయినా తినకుండానే కంచంలో నీళ్ళుపోసి లేచిపోయింది సుజాత.

'ఇదిగో ఈ లెటర్ నిన్ననే నీకు వచ్చింది మాష్టారు శుభలేఖకూడా పంపేరు చూడు' ఆ కవరుతోపాటు వెడ్డింగ్‌కార్డు కూడా సుజాతకిచ్చింది సుమిత్ర

'శుభలేక పంపేడా? ఎంత సాహసం!' వెర్రిగా ఆ కార్డువంక మాస్తూండిపోయింది సుజాత.

పి. యు. సి పరీక్షలు వ్రాసి హుషారుగా వచ్చిన సుజాతని చూస్తూ

'ఎలావున్నది పేపరు, బాగా ఆన్సరు చేశావా! ఇదేగా లాస్ట్ పరీక్ష' అడిగేడు జగన్నాధరావు

'బాగా' అని నెమ్మదిగా అంటారేం మాష్టారు 'క్లాస్' వస్తుందని ఢంకామీద కొట్టి చెప్పచ్చు మాష్టారిదగ్గిర శిష్యరికం వూరికే పోదులెండి' కిలకిల నవ్వింది సుజాత

'అయితే మాకు మంచి పార్టీవున్నదన్న మాట' నవ్వేడు జగన్నాథం

'రిజల్ట్సు రానివ్వండి మీరుకోరినరీతిలో ఎంత గ్రాండ్‌గా పార్టీ ఇస్తానో చూద్దురు గాని' కళ్ళు తిప్పింది.

'అబ్బో ఇప్పుడే వూరిస్తున్నావే ! అవును గాని—తరువాత ప్రోగ్రామ్ ఏమిటోయ్' కుతూహలంగా ముందుకు వొంగేడు.

'ఏమున్నది ! హాయిగా తినటం— జాలీగా తిరగటం — అర్ధరాత్రిదాకా స్నేహితుల్తో బాతాఖానీవేస్తూ—కార్డ్సు ఆడుతూ వదిన చేత మెత్త మెత్తగా అప్పచ్చులు తినటం' పకపకా నవ్వింది

ఇదికాదు నెక్స్టు ఇయర్ సంగతి'

అంతవరకు అల్లరిగా నవ్వుతున్న సుజాతమోము మబ్బులుకమ్మిన జాబిల్లిలాగా మసగబారింది. క్షణంసేపు అలాగే తల దించుకుని,

'ఇంక చదవనేమో మాష్టారు !' అన్నది అతిమెల్లగా.

'ఏదేమిటి' తెల్లబోయాడు ఆమె నుండి మౌనమే జవాబు...

'వద్దు వద్దు—బ్రిలియంట్ స్టూడెంట్‌వి నీవేమానేస్తే ఎలా ? బి. ఏ. లిటరేచర్ తీసుకో—క్లాస్ వస్తుందని నేను ప్రమిస్ చేస్తున్నాను నీకు క్లాస్ వచ్చేట్లు చూసే బాధ్యతనాది' ప్రోత్సాహంగా భుజంమీద తట్టేడు.

'నాకంత అదృష్టం లేదు మాష్టారు' దిగులుగా అన్నదామె.

ఎప్పుడూ నవ్వుతూ. తుళ్ళుతూ గాలిలో ఎగిరే సీతాకోక చిలుకలాగా వుండే ఈ అల్లరి అమ్మాయిలో ఇంత దిగులు గూడు కట్టేవున్నదేమా అని విస్తుబోయారు.

'ఏమ్మా సుజా—నీబాధ ఏమిటో నాకు చెప్పవూ ?' లాలనగా అడిగేసరికి ఆ పిల్ల కళ్లలో నీరు సుళ్లుతిరిగింది.

అతను అనునయంగా బ్రతిమలాడుతూ మళ్లీమళ్లీ అడుగుతూంటే ఇక తనబాధ దాచుకోలేక తలదించుకుని చెప్పసాగింది

* * *

నాకు నాలుగైదేళ్ల వయస్సు వున్నప్పుడే అమ్మను పోగొట్టుకున్నాను. తరువాత రెండేళ్లకు వచ్చిన పిన్ని ! 'సవతితల్లి' అన్న సార్ధక నామధేయురాలు—కానీ నా అదృష్టం. నాన్న నన్ను అల్లారుముద్దుగా కంటి రెప్పలాగే చూచుకునేవారు. దురదృష్టవంతురాల్ని, నాకా అదృష్టము ఎక్కువ రోజులు నిలువలేదు. హఠాత్తుగా గుండె పోటుతో నాన్న మరణించి నన్ను దిక్కులేనిదాన్నిగా చేశారు

మూటాముల్లె సర్దుకుని—నా సంగతే తనకు పట్టనట్లు పిన్ని నిర్దయగా నన్ను వంటరిగా వదిలి పుట్టినింటికి వెళ్లిపోయింది.

నాన్న పోయినప్పుడు చూడటానికి వచ్చిన మా పెదనాన్న కొడుకు శేఖరు అన్నయ్య – నా దైన్యస్థితికి కరిగిపోయి దేముడులాగా ఆదుకుని నా కన్నీరుతుడిచి—తనతో తీసుకువచ్చాడు. అన్నయ్య సహృదయానికి వదిన మంచితనం తోడై నన్నింత దాన్ని చేశాయి అందుకు నేను సదా వారికి కృతజ్ఞురాల్ని, 'ఇంకా పైచదువులు చదివితే అందుకు తగిన వరుణ్ణితేవటం కష్టమని, ఇక్కడితో ఆపుచేసి ఎలాగో ఆమూడు ముళ్లు వేయిస్తే ఇక తమ భారం తీరుతుందని' వదిన ఆలోచన. అందుకు నేను బాధపడటంలేదు. ఇప్పటికే వారికెంతో ఋణపడి వున్నాను. ఇకనైనా నాభారం తప్పించటం, నా కర్తవ్యంగదా ! అందుకే సంతోషంగా—అన్నయ్య వదినల నిర్ణయానికే తలొంచుతాను వారేమీ నాకు అపకారం తలపెట్టటం లేదుగదా ! నా భవిష్యత్తు చక్కగా తీర్చిదిద్దటానికే అన్నయ్య తాపత్రయం కూడాను నిజానికి నేను ఇంకా చదవాలని పట్టుబడితే అన్నయ్య తప్పక వొప్పుకుంటాడు. కానీ నాకే ఇష్టంలేదు కాస్త ఆలోచించగలిగే జ్ఞానం వచ్చాక మన బాధ్యతలేవో మనం గుర్తించటం. మనకే మంచిదికదా ! నాకైతే చదవాలనే వున్నది గానీ—కానీ...మాష్టారు నాలాటివాళ్లకు కోరిక లుండకూడదండీ .' ఇంక మాట్లాడలేక కంఠం పూడుకుపోయి కన్నీరు చెంపల మీదకు జారింది.

కిటికీ రెక్కమీద ఒకచేయివేసి బైటకు చూస్తూ—ఆమె మాటలన్నీ విన్న జగన్నాధం తలతిప్పి ఆ పిల్లవంక చూశాడు. క్షణం అలాగే చూసి దగ్గిరగా వచ్చి భుజాలమీద చేతులువేసి.

'సుజా ! ఇప్పటిదాకా నీ బాధ్యత మీ అన్నయ్యది. ఇకనుండి నాది. నేను మీ అన్నయ్యతో చెప్తాను—' అతడి మాటను మధ్యలోనే అడ్డుకుంటూ 'అహ వద్దు వద్దు—మీకు పుణ్యముంటుంది' ఖంగారుగా అన్నది.

'పిచ్చిపిల్లా ఎందుకంత భయం ఏదీ నావంక చూడు' చిబుకాన్ని మునివేళ్లతో తాకేడు.

మంచులో తడిసి విరిసీవిరియని నంది వర్ధనం పూవులాగా వున్న మొహమెత్తి బేలగా అతడివంక చూసింది. ఆ చూపు అతడి గుండెను కరుణతో ద్రవింపచేసింది. గభీల్న ఆమెచుట్టూ చేతులువేసి దగ్గిరకు హత్తుకున్నాడు. ఆమె అతడి కౌగిట్లో ఒదిగి వెక్కివెక్కి ఏడ్చింది. దుఃఖోద్వేగం కొంత చల్లారేక తనచుట్టూ బిగిసిన అతడి చేతులు చూసి సిగ్గుపడి, అతడి చేతులు వదిలించుకుని దూరంగా జరిగింది.

'సిగ్గుపడకు సుజా—నేను మీ అన్నయ్యకు చెప్పి నిన్ను చదివించేట్లు చూస్తాను. ఆతరువాత కట్నం లేకుండా నిన్ను పెళ్లి చేసుకుంటాను. సరా ! మీ అన్నయ్య

కట్నాలు ఇవ్వలేదని భయపడి చదువు మానేయకేం—నీకు స్కాలర్‌షిప్ కూడా వచ్చేట్లు చూస్తాను—ఏం నామాటమీద నమ్మకంలేదూ ? పోనీ ఇప్పుడే పెళ్లి చేసుకోనేమిటి—తరువాతే నేను చదివిస్తాను' అతడలా అంటూంటే ఆమెకు సిగ్గు ముంచుకొచ్చి—తూనీగలాగా పరుగుతీసింది.

* * *

అప్లికేషన్‌ఫారమ్ తెచ్చి చేతికిచ్చిన అన్నగారి వంక సంభ్రమంగా చూసింది సుజాత. 'చూస్తావేమిటమ్మా, సంతకం చేయ్' నవ్వుతూ అన్నాడు శేఖర్.

ఒక్కసారి అన్న మొహంలోకి చూసి తలవొంచుకుని.

'ఇంక చదవలేను అన్నయ్యా — ఇప్పటికి చదివింది చాలు' మెల్లగా భయం భయంగా అన్నది

'సుజా ! ఏమిటి తల్లీ ఎందుకిలా అంటున్నావు? మీ వదిన ఏమన్నా అన్నదా? నీకు త్వరగా పెళ్ళిచేయమని వదిన అన్నదనుకో. ఈ బి. ఏ. అయిపోయాక చేద్దామని నేనే నచ్చచెప్పను తను సరే అన్నది కూడాను. ఇంక నీకు సందేహమేమిటమ్మా!' అభిమానంగా అన్నగారు అంటుంటే సుజాత కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

'అలా అనకు అన్నయ్యా— వదిన ఏమీ అనలేదు. నేనే చదవాలనుకోటంలేదు ఇంత కాలం మీ అభిమానపు నీడలో ఆనందంగా పెరిగాను ఇంకా మీకు భారం ఎందుకు అన్నయ్యా' తలవొంచుకొని నేలమీద కాలి వేలితో గీస్తూ మౌనంగా వుండిపోయింది.

'అదేమిటమ్మోయ్ భారం — రుణం అంటూ కొత్తగా మాట్లాడుతున్నావు. రూపాయపైసల్లో లెఖ్కలు రాస్తున్నావా ఏం?' పకపకా నవ్వింది సుమిత్ర.

శేఖర్ చెల్లెలి భుజంమీద చేయివేసి 'అవునమ్మాయ్ మీ వదిన అన్నది నిజమే. ఎల్లాగూ లెఖ్కలు రాస్తున్నావు గనక ఈ బి. యే.కు అయే ఖర్చుకూడా రాసుకో చదువు అయాక తీరుద్దువుగాని' తనూ నవ్వుతూ అన్నాడు శేఖర్ !

'అప్పుడేనా, పెళ్ళికూడా జరిగేక, కట్నం కూడా పద్దులో రాసుకుని ఏకంగా రుణం తీర్చి అత్తారింటికి వుడాయిస్తుంది' అన్నా— వదినా జతగా నవ్వుతూంటే సుజాత సిగ్గు నటి పుస్తకం మొహాని కడ్డుపెట్టుకున్నది.

# తెరచి మూసిన తలుపు

జగన్నాధరావు స్థానిక హైస్కూల్లో ఇంగ్లీషు టీచరు. శేఖర్ ఇంటికి పక్కనే వున్న ఇంట్లో ఒక గదిలోవుంటూ టీచరు వుద్యోగంచేస్తూ—బెనారస్ ఎమ్. ఏకి చదువుతున్నాడు అతడికి టీచింగ్‌లో మంచి ప్రతిభవున్నది. ఎంత అల్లరిచేసే దడుకు పిల్లలైనా సరే అతడు క్లాస్ తీసుకునే సరికి — బుద్ధిమంతులల్లే మంత్రించినట్లు కూర్చుని శ్రద్ధగా పాఠాలు వింటారు ఆ చుట్టుపట్ల ఇళ్లలోకూడా అతడికి మంచివాడన్న పేరున్నది. అతడిదగ్గర చదువుకుంటే తమ పిల్లలు బాగుపడ్తారన్న ఆశతో ఆ చుట్టుపట్ల ఇళ్లల్లోని గృహస్థు తమ పిల్లల్ని అతడిదగ్గిరకు ట్యూషన్‌కు పంపేవారు. కానీ తన చదువుకు ఆటంకమున్న పేరుతో — ఎక్కువమందిని చేర్చుకునేవాడు కాదు, మరీ మొహమాట పెట్టే వాళ్ళ ఏ ఇద్దరో ముగ్గురోతప్ప. సాయంత్రం వేళల్లో చిన్నపిల్లల్ని నలుగుర్ని చేర్చుకుని కథలు-కబుర్లు చెప్తూ కాలగడపటం అతడికదో సరదా !

సుజాత అన్నకొడుకు మురళి అయిదారేళ్లవాడు ఎప్పుడూ మాష్టారిగదిలోనే వుండేవాడు. పెద్దచదివేవాడల్లే పలకా— పుస్తకాలు చంకబెట్టుకుని వెళ్ళి చాక్లెట్లు చప్పరిస్తూ — చిలిపికబుర్లతో మాష్టార్ని ఆటలు పట్టించి అల్లరి చేసేవాడు. బూరి బుగ్గల్లో—చక్రాలలాటి కళ్ళు తిప్పుతూ చిలిపికబుర్లు చెప్పే ఆ పిల్లాడంటే జగన్నాధాని క్కూడా ఎంతో ఇష్టం—పక్కఇల్లే కనక అస్తమానం అక్కడే ఆడుతూ పాడుతూవుండి ఒక్కోప్పుడు అక్కడే నిద్రపోయేవాడు కూడాను. వాడికోసం అప్పుడప్పుడు సుజాత జగన్నాధం గదికి వెళ్లేది. అలా అతడితో అయిన పరిచయం - అప్పుడప్పుడూ తెలీని లెఖ్కలు అతడితో చెప్పించుకోటందాకా వచ్చింది. అప్పుడామె స్కూలుఫైనలు చదువుతోంది. తరువాత పి. యు. సి. లో చేరేక, జగన్నాధం దగ్గిర ఇంగ్లీషు ట్యూషన్‌కు చేరింది. శేఖరమే జగన్నాధాన్ని పిల్చి చెప్పేడు. 'మాష్టరూ మా సుజా ఇంగ్లీషులో బాగా పూర్—మీరు కాస్త చూడండి' అన్నాడు.

'మీరు అంతగా చెప్పాలా ! పాస్ చేయించే బాధ్యత నాది' హామీ ఇచ్చాడు జగన్నాధం. అల్లాగే తనమాట నిలబెట్టుకున్నాడు కూడాను,

'మాష్టారూ బి.ఏ. లో సీటు వచ్చింది' గలగలా నవ్వుతూ వచ్చిన సుజాతని ఆప్యాయంగా చూస్తూ,

'మొత్తానికి గెలుపు సాధించావన్నమాట' నవ్వుతూ అన్నాడు.

'ఏ రే పోరాటం లేకుండానే గెలుపు వరించింది మాష్టారి ఆశీర్వచన బలమంది' ఫక్కున నవ్వింది.

'నిన్ను చూస్తే వరించాలనిపించదూ' చిలిపిగా -న్నాడు.

ఆమె పెదాలు సిగ్గుతో ముడుచుకున్నాయి.

అతడే మళ్లీ అన్నాడు.

'సరే సీటు వచ్చింది చాలా సంతోషమే— కానీ పాసైనప్పుడే నిజమైన గెలుపు. ఆ గెలుపు సాధించటానికి దీక్షతో కృషి సాగించాలి 'అమ్మో నేను చదవలేను బాబూ' అన్న పిరికితనం మచ్చుకైనా మనస్సులో జొరనీయకూడదు. దేనికయినా ధైర్యం ఉండాలమ్మాయ్. ఆశయాలు నెరవేర్చుకుందుకు అవసరమైతే పోరాటమూ సాగించాలి. అందరి బ్రతుకులు వడ్డించిన విస్తరిలాగానే వుండవు—కొందరి ముందు ఖాళీవిస్తరేవుంటుంది. మనమే ప్రయత్నించి మన విస్తరినిండా పంచభక్ష్యాలు నింపుకోవాలి. నా సంగతి చూడు.

నేను ఇంటికి పెద్దకొడుకుని నా తరువాత ముగ్గురు తమ్ముళ్ళు, నలుగురు చెల్లెళ్ళువున్నారు. యు. డి 'క్లార్క్'గా నాన్నగారు తెచ్చే జీతం పదిరోజులైనా చాలేదికాదు పెద్ద పెద్ద చదువులు చదివి ప్రతిభావంతుణ్ణనిపించుకోవాలని — హోదా గల వుద్యోగం చేయాలని ఇంకా ఎన్నో కోరికలు చిన్నప్పటినుండీ నా మనస్సు నిండా పేరుకున్నాయి ఏం లాభం? నాన్నగారి స్థితి ఇందుకు పూర్తిగా విరుద్ధం. ఎల్లాగో తినీ తినకా స్కూలుఫైనలుదాకా నెట్టించి ఇక నీ బ్రతుకు నీవే చూచుకో అన్నారు నాన్నగారు ఆరోజు ఒంటరిగా గదిలోపడుకుని ఎంత ఏడిచానో దేవుడికే తెల్సును. పోట్లాడి అయినా కాలేజీలో చేరాలన్న పట్టుదల పెరిగింది. అమ్మను బెదిరించాను.

నాన్నను ప్రతిమాలేను, ఫలితం శూన్యం—వారంరోజులు పిచ్చిగా ఎక్కడెక్కడో తిరిగి వారాలు చేసుకునైనా— అడుక్కుతినైనా సరే చదవాలన్న పట్టుదలతో ఇంటికి తిరిగి వచ్చాను ఇంట్లో అడుగుపెట్టగానే చూసిన దృశ్యం స్తంభీభూతుణ్ణిచేసి నా నవ నాడులు కృంగదీశాయి

పక్షవాతంతో ఒక కాలు— చేయిపడిపోయి మాట్లాడలేని స్థితిలో మంచానికంటుకు పోయిన నాన్న—ఆ ప్రక్కనే కొంగుతో కళ్ళు వత్తుకుంటూ కుమిలి కుమిలి ఏడిచే అమ్మ బిక్కమొహాలతో దిక్కులుచూసే తమ్ముళ్ళు చెల్లెళ్ళు వాళ్ళ పసిమొహాల్లో దీనత్వం నా మనస్సుని కలచివేసింది నా పట్టుదల సడలి—సంసారపు కాడి బుజాలకెత్తుకున్నాను మైనరు వెళ్ళే వెళ్ళని వయస్సులో బడిపంతులుగా చేరి ఇంట్లో పరిస్థితులు కొంత కుదురుకున్నాక—మెల్లి మెల్లిగా చదివి బి.ఏ బియిడి అయి ఇప్పుడు ఎమ్. ఏకు చదువుతున్నాను. ఇది పూర్తి అయితే నా ఆశయం కొంతవరకూ ఫలించినట్లే—అంతే సుజాతా దేనికయినా—ఓరవ— పట్టుదలతో ముందడుగువేయాలి అప్పుడే అవకాశాలు మనకాళ్ళవగ్గరకువస్తాయి' ఆత్మవిశ్వాసంతో వుత్సాహంగా చెప్తున్న అతడివంక విప్పారిన కళ్ళతో చూస్తూండిపోయింది సుజాత

క్రమంగా వారిద్దరిమధ్యా సాన్నిహిత్యం పెరగసాగింది రోజులో సగభాగం ట్యూషన్ పేరిట అతడి గదిలోనే గడపసాగింది అత డికి స్కూలు ఆమెకు కాలేజీవున్న టైము మినహా తక్కిన టైమంతా అతడితోనే ఆమెకు లోకం రాత్రి ఏ పదకొండు గంటలకో నిద్రకోసం తప్పనిసరై ఇంటికి వచ్చేది 'ఇంత రాత్రిదాకా చదువేమిటమ్మా ఆడపిల్లలు రాత్రిళ్ళ అలా తిరక్కూడదు' అని వదిన సుమిత్ర మందలిస్తే—

'చదవక పాస్ ఎల్లా వదినా, ఎక్కడో తిరగటమేమిటి మాష్టారి దగ్గరేగా' అని దబాయించేది అలా అని చదువూ అశ్రద్ధ చేసేదికాదు చేసినా అతడూరుకునేవాడు కాదు

ఆమెకు పాఠాలు చెప్పేటప్పుడు ఎంతో గంభీరంగా—సీరియస్‌గా చెప్పేవాడు ఆమె అప్పుడప్పుడూ చిలిపిగా అల్లరిచేసి—అతడి గాంభీర్యం చెదరగొట్టాలని చూసేది,

'ఇదిగో అమ్మాయ్! నీవిల్లా గొడవ చేస్తే? నేనసలు మంచి వాణ్ణికాదు, చదవులో నిర్లక్ష్యం అసలు సహించను—బుద్ధిగా చదువకపోయావా? ఇదే శిక్ష' అంటూ ఆమె బుగ్గ మెలిపెట్టేవాడు

'అమ్మో వదలండి మాష్టారు ఇంక అల్లరి చేయనుగా!' అని లెంపలు(?) పెట్టి చేతులు కట్టుకున్న ఆ పిల్లను చూస్తే అతడికి నవ్వు వచ్చేది. పాఠాలు చెప్పటం ముగిసేక అతడి సీరియస్‌నెస్ చెదిరిపోయి మరో అవతారం దాల్చేవాడు పుస్తకాలు తీసుకుని బుద్ధిమంతురాలల్లే తలవొంచుకుని వెళ్లబోతున్న ఆమెను గభాల్న చేతుల్లో బిగించి కందిపోయిన బుగ్గలమీద మెత్తగా ముద్దులు నింపి,

'నన్ను క్షమించు సుజా! మరి శ్రద్ధగా



ఆంధ్రరాష్ట్ర విభజన కోసం జరిగిన ఆందోళనకి గురైన ఆర్ టి సి బస్సు అద్దం అందంగా బీటలు వేసి కూడా యింకా సమైక్యంగానే వుంది.

(ఫోటో వఖ చిత్రకారుడు శ్రీ సంపత్ కుమార్)

## తెరచి మూసిన తలుపు

చదవకపోతే ఎలా ? నా ఎమ్. ఏ. అయే సరికి నీ బి. ఏ. కంప్లీట్ చేస్తే—అప్పుడు అందరి ఆశీస్సులతోనూ ఇద్దరం ఒకటై పోదాము. అప్పుడు నీ ఇష్ట మొచ్చినంత అల్లరిచేద్దువుగాని, నిన్నువద్దనే వాళ్ళుండరు. మన ఇంట్లో పాప పారాడేదాకా నువ్వే పాపా యివి.' ఆమె ముంగురులు సరుదుతూ లాలనగా అంటూంటే—మైమరువుగా అతడి కౌగిట్లో ఒదిగిపోయి. 'నేను అదృష్టవంతు రాల్ని జగన్' మెల్లిగా గుసగుసలాడేది 'నేను కూడాను' అంటూ ఆమెను గట్టిగా గుండె లకు హత్తుకునేవాడు.

* * *

కాలతురంగం ఛెంగుఛెంగున గంతులిడుతూ వడివడిగా ముందుకు పరుగిడుతూంది.

సుజాతలో ఎంతో మార్పు. నవ వికసిత సుమసౌకుమార్యం ఆమె తనువెల్లా ఆక్రమించి హరివిల్లులాటి అందాల సోయగంతో మెరిసిపోతున్నది సుజాత. విడిగివిప్పారిన ఆమె మనస్సంతా జగన్ రూపమే. అతడి సమక్షం ఆమెకు ఇహలోక స్వర్గం—అతడు కృష్ణుడు ఆమె రాధ. ఈ చిన్న గది వారికి — బృందావనమే. అతడి స్పర్శమాత్రానే పులకితురాలై —రంగురంగుల విహంగమై రెక్కలు విప్పుకుని ఏ సుందరతరసీమలకో ఎగిరిపోయి రాగరంజితమైన రమ్య బృందావనారామ సీమల్లో విహరిస్తున్నట్లు భ్రాంతి కలిగేది. 'ఇది భ్రాంతికాదు. నిజమే సుమా' అని అతడి బిగికౌగిలి ఆమెకు గాఢమైన నమ్మిక కలిగించేది.

సుమిత్ర పురిటికి పుట్టినింటికి వెళ్ళింది. ఇంట్లో పనంతా తన పరంకావటం వల్ల సుజాతట్యూషన్‌కు వెళ్ళటాని వీలయేదికాదు. జగన్నాధమే వీరింటికి వచ్చేవాడు సుజాత అన్న శేఖర్ హాస్పటల్‌నుండి ఏవేళకో ఇంటికి వచ్చేవాడు. ఈ ఒంటరితనం ఇద్దరికీ మరింత ప్రోత్సాహమయిన దుర్బల క్షణంలో సుజాత తన సర్వము—జగన్ పరం చేసింది. అతడామె ప్రేమదైవం ఆమె ప్రణయస్వరూపిణి అయి అతణ్ణి ఆరాధించేది.

సుమిత్ర పాపను ఎత్తుకువచ్చింది.

సుజాతకు ఫైవలు పరీక్షలు దగ్గిర కావటంతో ఏకాగ్రతతో చదువసాగింది. ఆఖరి పరీక్ష వ్రాసివచ్చిన సుజాత 'మాష్టారూ తపస్సు పూర్తి అయింది. ఇంక దేముడు వరమివ్వాలి' వుత్సాహంగా అతడి బుజాల మీద వ్రాలి, చెక్కిలికి చెక్కిలి రాస్తూ గోముగా అన్నది ఆమెను ముందుకులాగి లేతబుగ్గలు కందిపోయేట్లు గట్టిగా ముద్దు పెట్టుకుంటూ,

'ఓ-తప్పకుండా నీవు కోరినన్నివరాలు ఇవ్వటానికి ఈ దేముడు సిద్ధంగానేవున్నాడు మరి నా తపస్సుకూడా పూర్తి అయేదాకా కాస్త వోపికపట్టు చిలకమ్మా' అన్నాడు నవ్వుతూ.

'పోండి మాష్టారూ మీకన్ని హాస్యమే ఇంకా వోర్పు నాకు చాతకాదు బాబూ. త్వరగా పరీక్షలు రాసెయ్యండి లేకపోతే నేను మీదగ్గిరకు రానేరాను తెల్సా' అని చూపుడు వెలెత్తి బెదిరించి వెక్కిరించి తుర్రున పారిపోయింది.

* * *

శలవుల్లో సుజాతమిత్రులంతా కల్సి — మద్రాసు—మహాబలిపురం—కంచి. వగైరాలన్నీ తిరిగిరావాలని ప్రోగ్రామ్స్‌వేసుకున్నారు. వెళ్ళేరోజున చెప్పటానికి వెళ్ళిన సుజాతను కౌగిట్లో బిగించి తీయని ముద్దులతో ముంచెత్తి.

'నేనూ రెండురోజుల్లో బెనారస్ వెళ్తున్నాను. పరీక్షలు అవగానే అటునుంచే మా వూరు వెళ్ళి— మా అమ్మా నాన్నలకు మన సంగతి చెప్పి వొప్పించి నువ్వొచ్చేసరికి తియ్యనివార్త అందచేస్తానని అన్నాడు జగన్...

(ముగింపు పైవారం)

# రామనాథన్ క్రిష్ణన్ కి ప్రియమైన కాఫీ :

# నెస్‌కాఫే !

"ఉత్తేజ కల్పనకు
దక్షిణాది కాఫీ
గింజలతో
తయారయిన
కాఫీకి దీటులేదు.
నా కాఫీ మెచ్చుతారు...
నెస్‌కాఫే."



అతనికి తెలుసు కాఫీకి అలవడినవారికి తెలిసినట్టు ఇతర ఇన్‌స్టంట్ కాఫీలన్నిటికన్న నెస్‌కాఫే విశిష్టమని దానిని ప్రత్యేకం తనవంటి కాఫీ కాముకులకోసం తయారు చేశారని అత్యుత్తమమయి 100% పరిశుద్ధమయిన దక్షిణాది కాఫీ గింజలతో.




## నెస్‌కాఫే

**నెస్‌కాఫే యిష్టం ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది**

ACIL-90(2) 233 TEL

## ఏసుక్రీస్తు ఏమైనాడు?

అవి 'మానవుడు, దానవుడు' నిర్మించే రోజులు. ఒకరోజు ఉషశ్రీ చిన్నపరెడ్డి వీనస్ స్టుడియోకి పత్రికల వాళ్ళను పిలిచారు 'ఏసుక్రీస్తు' జీవిత కథను ఈస్ట్ మన్ కలర్‌లో భారీ ఎత్తున నిర్మించదలచినట్టు చెప్పారు ఏసుక్రీస్తుగా శోభన్‌బాబు నటించడానికి సమ్మతించినట్టు పాత్రికేయులకు తెలియజేశారు అందరూ చిన్నపరెడ్డిని అభినందించారు ఒక మహాత్ముని కథను నిర్మించడానికి నిర్ణయించినందుకు, చిన్నపరెడ్డిని ఆశీర్వదించారు ఇప్పుడు 'ఏసుక్రీస్తు' ఏమైనాడు? నిర్మాణ జాప్యం జరగడానికి కారణం ఏమిటి? ఈ ప్రశ్నలకు చిన్నపరెడ్డి యిచ్చిన సమాధానం

# సినిమా

మౌనం. ఆయనకు తీయాలన్న తలంపు యిప్పటికీ వుంది కానీ, వేస్తాను అన్న వాళ్ళు వెయ్యాలిగా?

### చిన్నపరెడ్డి చిత్రంలో కృష్ణ, శారద

సంధ్యశ్రీ ప్రొడక్షన్స్ నిర్మించబోయే రెండవ చిత్రంలో కృష్ణ, శారద నటించ గలరట కథ, సినిమా అనుకరణ దర్శకత్వంను, చిన్నపరెడ్డి చేపట్టే యీ చిత్రాన్ని 'మనువు—మనసు' నిర్మాత పి. త్రినాధరావు నిర్మిస్తారు.

## చంద్రకళ వింత వివాహం

ప్రేమించిన ప్రియుడు తనను కాదని డబ్బుకోసం పిచ్చిదాన్ని పెళ్ళి చేసుకున్నాడు. ఏ డబ్బుకోసం అతడు తనను కాదన్నాడో ఆ డబ్బుకు తనే అధికారిణిగా మారటానికి ముసలివాణ్ణయినా పెళ్ళాడటానికి సిద్ధపడిందామె దగాపడిన యువతి కృష్ణవేణిగా చంద్రకళ, కథానాయకునిగా ప్రకాష్, వింతచేష్టలు చేసే పిచ్చిపిల్లగా విజయలలిత నటిస్తున్నారు, సంధ్యశ్రీ వారి 'మనువు—మనసు'లో జూలై 25 నాటికి షూటింగ్ పూర్తవుతుంది సెప్టెంబర్‌లో విడుదల అవుతుంది కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం పి చిన్నపరెడ్డి, నిర్మాత పి. త్రినాధరావు, తారకరామ విడుదల

## పుష్పాంజలిలో శారద!

'పద్మవ్యూహం' చిత్రాన్ని అందించిన పుష్పాంజలి పిక్చర్స్ అధినేత ఇన్నారెడ్డి నిర్మించబోయే రెండవ చిత్రంలో కథానాయికగా నటించడానికి శారద అంగీకరించిందట. ఈ చిత్రంలో కృష్ణంరాజు, చంద్రమోహన్ కూడా వుంటారని కథకుడు, దర్శకుడు అయిన చిన్నపరెడ్డి చెప్పారు.

### ప్రకాష్‌ని పూనా పంపే వుద్దేశ్యం

'పద్మవ్యూహం' కథానాయకుడు, చిన్నపరెడ్డి తమ్ముడు చిరంజీవి ప్రకాష్‌ను పూనా ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌కి పంపాలన్న ఉద్దేశ్యం తనకున్నట్టు ఉషశ్రీ సంస్థాధినేత చెప్పారు

### నటరత్న అంగీకారం

ఉషశ్రీ నిర్మించనున్న చిత్రంలో కథానాయకుడిగా నటించడానికి 'నటరత్న' రామారావు అంగీకరించారట కథను ఉషశ్రీ వ్రాయ, దర్శకత్వాన్ని చిన్నపరెడ్డి నిర్వహించగలరని తెలుస్తూంది

లోగడ యీ సంస్థ నిర్మించిన 'పసిడి మనసులు, విచిత్ర దాంపత్యం, మానవుడు దానవుడు' చిత్రాల్లో శోభన్ కథానాయకుడు అన్న విషయం పాఠకులకు తెలుసు

## త్యాగయ్యగా నటసామ్రాట్!

'నాగేశ్వరరావు చేత వేషం వేయించి,



'పసిహృదయాలు'లో జమున

నేను డైరెక్ట్ చెయ్యాలని వుంది' అన్నారు త్యాగయ్య పాత్రను మనోహరంగా పోషించిన చిత్తూరు నాగయ్యగారు ఆ పాత్రను చిరంజీవి నాగేశ్వరరావు అద్భుతంగా పోషించగలడన్న నమ్మకం తనకు వున్నట్లు చెప్పారు 70 ఏండ్లు నిండిన క్యారెక్టర్ నటుడు నాగయ్య 'విప్రనారాయణగా ఎంత వికసించాడు అక్కినేని ఆయన అసాధారణ ప్రజ్ఞావంతుడు ఎలాంటి వేషం వేసినా, అందులో ప్రత్యేకతను చూపించగల సమర్థుడు' అని నాగేశ్వరరావు నటనా కౌశలాన్ని ప్రశంసించారు నాగయ్య

*సత్ సంకల్పం!*

మన తెలుగు తెర గర్వించదగిన మహానటులు నాగేశ్వరరావు, రామారావుగార్లు ఇద్దరు మూడు దశాబ్దాలుగా కథానాయకులుగా ప్రజలను మెప్పించడం అంటే మాటలా? పరిశ్రమకు ఎంతగానో సేవ చేస్తూ, ప్రజలకు రోజు రోజుకి దగ్గరవుతూ వున్న రామారావు, నాగేశ్వరరావుగార్లను ఒకే వేదికపైన ఘనంగా సన్మానించాలని వుంది నా కోరికను ఆ పరమేశ్వరుడు ఆలకించి, ఏర్పాటు చెయ్యగలడు అన్న నమ్మకం నాకు వుంది' అన్నారు నలభై అయిదేండ్ల తెరజీవితానికి అలవాటు పడ్డ నాగయ్యగారు

## పల్లవి ప్రొడక్షన్స్!

మదరాసు హాలివుడ్‌లో వెలసిన మరొక సంస్థ యిది జగపతి, అన్నపూర్ణా, డి వి ఎస్, ఎన్ ఏ టి, విశ్వశాంతి, పి ఏ పి, గౌతమీ కోవకు చేరిన సంస్థ యిది ఈ సంస్థను ఆనంద్‌బాబు అధినేత

ఎప్పుడూ ఆనందంతో సాక్షాత్కరిస్తూ, అందరికీ సహాయపడుతూ వుండడం ఆనందబాబుకు అలవాటు ప్రముఖ నిర్మాత, దర్శకుడు, స్టుడియో అధినేత అయిన ఎల్ వి ప్రసాద్‌గారి కుమారుడు పరిశ్రమలోని అన్ని శాఖల్లో విశేష అనుభవం వున్న మనిషి.

*తెలుగులో విక్టోరియా 203*

హిందీలో అఖండ విజయాన్ని సాధించిన 'విక్టోరియా 203' కథను తెలుగులో తలపెట్టారు, పల్లవి అధినేత ఈ చిత్రానికి భమిడిపాటి రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, కృష్ణారావు కళను, వెంకటరత్నం ఛాయను, సంజీవి కూర్పును నిర్వహిస్తారు ఈ చిత్రం పూర్తి రంగుల్లో తయారవుతుంది

*అందరూ దొంగలే*

అన్న పేరును స్థిరపరిచారు, 'విక్టోరియా 203' తెలుగు ప్రతికి, ఈ చిత్రానికి సినిమా అనుకరణ, దర్శకత్వంను 'దసరాబుల్లోడు, బంగారుబాబు' ఫేమ్ వి బి రాజేంద్రప్రసాద్ చేపట్టారు

*భలే జంట!*

క్యారెక్టర్ నటులు ఎస్వీరంగారావు, నాగభూషణంగార్లు ధరిస్తున్న పాత్రలు, ప్రేక్షకులకు సరికొత్త రుచులను అందిస్తాయి. నాయకీ, నాయకులుగా లక్ష్మి, శోభన్ నటిస్తారు అన్నపూర్ణా విడుదల

## అన్నపూర్ణాలో రామారావు

అన్నపూర్ణా డిస్ట్రిబ్యూషన్‌లో 'నటరత్న' రామారావు నటిస్తున్న చిత్రం విడుదలయ్యే మంచిరోజులు మన పరిశ్రమకు వచ్చాయి

*ఆరుణ ఆరంభం!*

నిర్మాత పుండరీకాక్షయ్య నిర్మించే కొత్తచిత్రం షూటింగు జూన్ ఆరున ఏ వి ఎమ్ లో ఆరంభం అయింది మొదటిషాటు రామారావుపై చిత్రీకరించడం జరిగింది ముహూర్తానికి కృష్ణ



'డాక్టర్ బాబు'లో [illegible]

ప్రసాద్, రాజేంద్రప్రసాద్, ఆనంద్‌బాబు, విజయా పూర్ణచంద్రరావుగార్లు వంద మూరి చిత్రనిర్మాతలు వచ్చి శుభాకాంక్షలు తెలిపారు.

*వాణిశ్రీ-సరోజాదేవి :*

ఈ చిత్రానికి గొల్లపూడి రచన్ను, హనుమంత రావు సంగీతాన్ని, సత్యనారాయణ ఛాయను నిర్వహిస్తున్నారు ముఖ్యపాత్రలను రామారావు, గుమ్మడి, కృష్ణంరాజా, రాజబాబు, ధూళిపాళ, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, వాణిశ్రీ, సరోజాదేవి, అంజలీదేవి, విజయలలిత పోషిస్తున్నారు ఇందరు పెద్దలు పాత్రధారులుగా వుండే చిత్రానికి, బి వి ప్రసాద్ దర్శకత్వం

# సినిమా

నెరవడం ముదావహం

'మట్టిలో మాణిక్యం' తర్వాత రావలసిన మంచిరోజులు, యీసారి అయినా రావాలి అని ఆశిద్దాం

## రాముడే—దేవుడు

అనగనగా ఒక చిన్న పల్లెటూరులో అమ్మా, నాన్నా లేని అనాథుడు అమాయకుడు. చదువులేకపోయినా, సంస్కారానికి లోటులేని మనిషి అతన్ని ఏకాస్త పరిచయమున్నవారైనా, అతని జీవితాంతం మరచిపోలేరు అదే అతని విచిత్రవ్యక్తిత్వం అదే అతని పవిత్ర మనస్తత్వం.

అతని పేరు రాముడే. అతను కొలిచే దేవుడూ రాముడే అందుకే నిరాధారంగా దొరికిన రాతిబొమ్మ రాముడికి గుడి కట్టించాలని జీవితాశయంగా పెట్టుకున్నాడు మన రాముడు తన కష్టార్జితంతోనే కట్టించాలని రాముడిమీద భారంవేసి బస్తీకి బయలుదేరాడు నమ్మినవాళ్లను దేవుడెవుడూ విడనాడడు అందుకే బస్తీలో ఒక బంగారు మనసుతో చెలిమి కలిపాడు ఆమె పేరు గౌరి ఒకేగూటి గువ్వల్లాగా, ఒకేతోట పువ్వుల్లాగా గౌరి రాముడు మానసికంగా దగ్గరయ్యారు ఆ తర్వాత ఏం జరిగిందో తెలుసుకోవాలంటే ఫల్గుణా కంబైన్స్‌వారి 'రాముడే దేవుడు' చిత్రం చూడాల్సిందే రాముగా చలం, గౌరిగా వాణిశ్రీ నటించారు పి ఏకామ్రేశ్వరరావు నిర్మించిన యీ చిత్రానికి బి వి ప్రసాద్ దర్శకుడు.

*జి. వి. జి కథ*

'దేవదాసు'లో స్వర్గీయ సి ఎస్ ఆర్ కుమారుడు వేషం ధరించిన, ప్రస్తుతం పత్రికా రచనచేస్తున్న జి వి జి కృష్ణ వ్రాసిన కథయే 'రాముడే దేవుడు ఈ చిత్రానికి రాజశ్రీ మాటలను, సత్యం సంగీతాన్ని సమకూర్చారు 'హంతకులు— దేవాంతకులు' నిర్మాత ఎం కె రాధ నిర్వహణలో నిర్మితమైన యీ చిత్రం లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.

## సంగీతమా? సాహిత్యమా ?

గౌతమ్ పిక్చర్స్‌వారి 'వాడే — వీడు' చిత్రానికిగాను, కవి దాశరధి యిటీవల ఒక పాటను వ్రాశారు ఆ పాటను, సుశీల, ఘంటసాలచేత పాడించారు, సంగీత సారధి సత్యం.

ఆ పాటను రామబ్రహ్మంగారి ఆఫీసులో టేపుద్వారా విన్నాను ఆహా ! ఎంత మంచి పాట ఎంత మధురమైన గానం నాకు 'విర్దోషి'చిత్రంలోని 'మల్లియలారా, మాలికలారా' పాట గుర్తుకొచ్చింది ఆ పాటను ఎన్నిసార్లు విన్నా తనివి తీరని ఆనందం ఏర్పడుతుంది అలాంటి అనుభూతిని కలిగిస్తుంది, యిప్పుడు నేచెప్పిన పాటకూడా



'రాముడే దేవుడు'లో వాణిశ్రీ, చలం.



విరహ తాపాన్ని తెచ్చింది దుర్వాసన!




DCG 49 TL

# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి... రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంత క్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎప్పుడూ ప్రకటించబడనట్లు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటే. కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. ఎంత చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు యిష్టపడతారు!

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు.
ఎక్కువ మంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్‌కంటే కాల్గేట్‌నే కొంటారు!



'అటు చల్లని వెన్నెల జాబిలి
ఇటు వెచ్చని చూపులకోమలి
నా మదిలో కలిగిన అలజడి
కోమలీ! జాబిలీ!'

అను పాటను వింటే సంగీతం గొప్పగా వుందా? లేక సాహిత్యం గొప్పగా వ్రాయబడిందా? అనిపిస్తుంది ఈపాటను రామారావు మంజులపై దర్శకుడు యోగానంద్ చిత్రీకరించారు

గౌతమ్ పిక్చర్స్ అన్నిటా సంగీతం చాలా బాగుంటుంది నిర్మాత రామబ్రహ్మం గారికి సంగీత జ్ఞానంవుంది అందుచేత పాటలు మధురాతి మధురంగా వస్తాయి. 'వాడే—వీడు' చిత్రంలో సంగీతం స్కోరు చెయ్యడం తథ్యం ఇప్పటివరకు రికార్డ్ చెయ్యబడిన మూడుపాటలూ, ప్రజాదరణ పొందగలవన్న నమ్మకం నాకు వుంది

పై చిత్రానికి ఎస్ ఎస్ లాల్ ఛాయను కృష్ణారావు కళను, వెంకటరత్నం ప్రొడక్షన్సు నిర్వహిస్తున్నారు. కథ, మాటలు, సినిమా అనుకరణను డి. వి. నరసరాజు సమకూర్చారు ప్రధాన పాత్రలను నాగభూషణం, పద్మనాభం, అల్లు రామలింగయ్య, పండరీబాయి పోషిస్తున్నారు. గౌతమీ విడుదల,

## సినిమా

### కొత్త రచయిత

ప్రతిభాసంపత్తి, కవితా స్రవంతి వుండి కూడా వెలుగులోకి రాలేకపోతున్నారు, ఎందరో తాత్కాలికంగా అలాంటి వారు కష్టపడవద్దు. ఏదేని ఒక మంచిరోజు వాళ్ళకు రాకమానదు అలాంటి హ్యాపీ రోజులు యువరచయిత గోపీకి యిప్పుడిప్పుడే వస్తున్నాయి

నటుడు ప్రభాకరరెడ్డి నిర్మిస్తున్న 'గాంధీ పుట్టిన దేశం' చిత్రంలో గోపీచేత ఒక పాట రాయించారు, నిర్మాత ఆపాటను ఎంత బాగా రాశాడనుకొంటున్నారు, ఆగోపీ స్వరలో మీరే వింటారుగా అతడి కవితా శక్తిని కొంతయినా వ్రాయడం నా ధర్మం

'గాంధీ పుట్టిన దేశం
రఘు రాముడేలిన రాజ్యం
ఇది సమతకు, మమత
లకు నిలయం,'

ఈ పాటను సుశీల పాడింది కోదండపాణి సంగీత సారథి. ఈ చిత్రానికి 'పండంటి కాపురం' ఫేమ్ లక్ష్మీదీపక్ దర్శకుడు

● గోపీ వివరాలు:

ఇతడు లోగడ చాలా పాటలను, అనేక చిత్రాల్లో రాసియున్నారు ముఖ్యంగా ప్రభాకరరెడ్డి యీ కవికి గుర్తింపు కలిగించే పాటను వ్రాయించారు 'పచ్చని సంసారం'లో 'ఆడమని, పాట వినే రాజా ఎవ్వరు, పండంటి కాపురంలో 'మనసా కవ్వించకే నన్నిలా?' పాటలు గోపీ రచనా పటిమకు నిదర్శనాలు

వయస్సు చిన్నదే అయినా మనస్సులో పెద్ద పెద్ద భావాలు పుట్టిస్తాం అయ్యేవరాన్ని భగవంతుడు గోపీకి ప్రసాదించాడు.

### శారదగా జమున

ప్రేమించడంలోనేకాదు, త్యాగం చెయ్యడంలోకూడా స్త్రీకి సాటిలేదు ఆదికాలం నుండి నేటివరకు స్త్రీ సమాజంలో తనకొక ప్రత్యేకస్థానం ఏర్పరచుకొని దాన్ని కాపాడుకొంటూ వస్తున్నది ప్రేమకు, శాంతికి నిలయమైన స్త్రీ తల్చుకుంటే ప్రపంచాన్నే తల్లక్రిందులు చెయ్యగలదు. తన ప్రాణస్నేహితురాలికోసం, ఎవరూ తన కేమీ కాకపోయినా, ఆ స్నేహితురాలి బిడ్డకోసం తన జీవితాన్నే త్యజించడానికి సిద్ధపడింది త్యాగమయి శారద ఎందుకు తన జీవితాన్ని త్యాగం చెయ్యవలసివచ్చింది? దీనికి సమాధానం పవిత్ర ప్రొడక్షన్స్‌వారి 'పసిహృదయాలు' చిత్రం యిస్తుంది శారదగా జమున నటించింది

'పిల్లలు భగవత్‌స్వరూపులు' అనేది నిత్యనిజాన్ని కమనీయంగా చిత్రించారు, దర్శకుడు మల్లికార్జునరావు మల్లెపువ్వు ఎంత గుబాళింపునిస్తుందో, మల్లికార్జునరావుగారి 'పసిహృదయాలు' చిత్రం అంత పరిమళ సౌరభాన్ని సరఫరాచేస్తుంది

'పసిహృదయాలు' చిత్రానికి రాజశ్రీ రచన్ను, వెంకటేష్ సంగీతాన్ని, ప్రకాష్ ఛాయను నిర్వహించారు ప్రధాన పాత్రలను కృష్ణ, రామకృష్ణ, చంద్రకళ, మునందిని, అల్లు రామలింగయ్య, కె వి చలం, విజయభాను ధరించారు నవయుగ విడుదల

పై చిత్రం తమిళంలో 'కనిముత్తుపాపా' పేరిట వందరోజులు ప్రదర్శింపబడింది. మూలకథను గుహనాథన్ వ్రాశారు.



'స్నేహబంధం'లో కృష్ణ, జమున, కృష్ణంరాజు.

## గోనగన్నారెడ్డిగా రామారావు!

నవశక్తి ప్రొడక్షన్స్ 'నటరత్న' రామారావుతో యీ చిత్రాన్ని నిర్మించదలచి నట్టు, ప్రస్తుతం కొత్తవాళ్లతో 'పిడతేవి ఆడది' చిత్రాన్ని పూర్తిచేసిన పర్వతనేని గంగాధరరావు చెప్పారు

లోగడ రామారావుగారితో 'సింధు సంసారం, జీవితచక్రం' చిత్రాలను గంగాధరరావు నిర్మించి యున్నారు హిందీలో కూడా హిట్ చిత్రాన్ని నిర్మించారు. ఆ చిత్రం పేరు 'ఏక్ నారీ ఏక్ బ్రహ్మచారీ'. ఆ చిత్రానికి ప్రత్యగాత్మ దర్శకుడు.

## రామారావు చిత్రానికి ప్రత్యగాత్మ

'మంచి మనిషి' తర్వాత రామారావు నటించిన చిత్రాన్ని ప్రత్యగాత్మ డైరెక్టు చేసే అవకాశాన్ని ఎవ్వరూ కలిగించలేదు. ఇప్పుడు అలాంటి అవకాశం ప్రత్యగాత్మకు లభించింది

లోగడ నాగేశ్వరరావుతో 'మ' తో మొదలయ్యే సినిమాను నిర్మించిన కుటుంబరావు త్వరలో ప్రారంభించబోయే చిత్రానికి 'నటరత్న' నాయకుడిగా, ప్రత్యగాత్మ దర్శకుడిగా అంగీకరించారట,

కథ కూడా ఓ కే, అయినట్టే సినిమా అనుకరణ, సంభాషణలు వ్రాయడం ప్రారంభం అయింది

## ప్రేమలోపడ్డ శోభన్ జయలలిత

మంచి, మానవత మనసులో పెంచుకొన్న యువకుడు శేఖర్ విదేశాలలో డాక్టర్ చదువును చదివి, స్వదేశానికి తిరిగి వచ్చి నిస్వార్థబుద్ధితో, అన్నెము, పున్నెము ఎరుగని అమాయక ప్రజలమధ్య సేవచేస్తూ, కొనవూపిరులకు కొత్త వూపిరిపోస్తూ జీవిస్తున్న త్యాగజీవి శేఖర్

అతని అడుగుజాడలలో నడుస్తూ, తన అమాయకత్వానికి అతని త్యాగశీలతను జోడించుకొని, రాత్రింబవళ్లు అతని సేవలో పాలు పంచుకుంటుంది గౌరి.

ఆ పాల మనసులు కలుసుకున్నాయి. మంచిని, మమతను పంచుకున్నాయి ప్రేమను పెంపొందించుకున్నాయి ఒక మధురక్షణాన ఒంటరిగా, జంటగా ప్రకృతి అందాల మధ్య కలుసుకున్నారు

'విరిసే కన్నులలో వేయి బాస లున్నవిలే
అవి నా గుండెలలో అల్లరిచేస్తున్నవిలే'

అంటూ ప్రేమానురాగబద్ధులై మైమరచి, సుఖసంతోషాలలో తేలియాడారు 'కట్' అన్నారు దర్శకుడు లెనిన్‌బాబు ఈ రమణీయమైన దృశ్యం 'డాక్టర్ బాబు' చిత్రంలో కనిపిస్తుంది శేఖర్‌గా శోభన్, గౌరిగా జయలలిత టించారు

రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించే 'డాక్టర్ బాబు' చిత్రం తమ్మారెడ్డి కృష్ణమూర్తి గల్లాపెట్టెను నింపడం తథ్యం ఈ చిత్రంలో రంగారావు, గుమ్మడి, రాజబాబు, నాగేష్, రాజనాల, విజయలలిత, లీలారాణి, జి వరలక్ష్మి ముఖ్య పాత్రధారులు మోదుకూరి జాన్సన్ రచన చలపతిరావు సంగీతం, కణ్ణప్ప ఛాయాగ్రహణం, సూర్యన్న కళాదర్శకత్వం, సంజీవి కూర్పు నిర్వాహం ఒక దాంతో మరొకటి పోటీపడ్డాయి ఇవన్నీ ఒక ఎత్తు, లెనిన్ బాబు దర్శకత్వం ఒక ఎత్తు, అంటున్నారు సినిమా చూసిన వ్యక్తులు లక్ష్మి విడుదల

## కృష్ణ చిత్రానికి 'శారద' దర్శకత్వం

కృష్ణ చిత్రానికి, శారద దర్శకత్వం ఏమిటి, అని మీకు సందేహం కలగొచ్చు

ఇప్పుడు ఆంధ్రదేశంలో అమోఘ ప్రజాదరణ పొందుతున్న చిత్రం 'శారద'. ఆ చిత్రానికి దర్శకత్వం నిర్వహించినది కె విశ్వనాథ్‌గారు ఆ విశ్వనాథ్‌ను తన తమ్ముడి చిత్రానికి దర్శకుడిగా పెట్టారు హీరో కృష్ణ

'దేవుడు చేసిన మనుషులు' నిర్మాణం పూర్తయింది ఆగస్టులో విడుదల అవుతుంది 80 చోట్ల ఈ చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించారు, కథను వ్రాసిన జి. హనుమంతరావు.

శ్రీ హనుమంతరావు నిర్మించనున్న తదుపరి చిత్రానికి కథ, సినిమా అనుకరణ దర్శకత్వంను విశ్వనాథ్ నిర్వహిస్తారు ముఖ్యపాత్రలను కృష్ణ విజయనిర్మల పోషిస్తారు అప్పలాచార్య మాటలను, రమేష్‌నాయుడు సంగీతాన్ని, స్వామి ఛాయను, గోపాలరావు కూర్పును చేస్తారు

### కె ఎస్ పి దగ్గర కృష్ణ

బాక్సాఫీస్ దర్శకుడు శ్రీ కె ఎస్ ప్రకాశరావు దగ్గర, హీరో కృష్ణ ఒక



'పల్లెటూరిబావ'లో నాగేశ్వరరావు, లక్ష్మి.

## సినిమా

చిత్రానికి పని చేస్తున్నారు 'విచిత్ర కుటుంబం' తర్వాత కె. ఎస్. పి., కృష్ణ గార్ల కాంబినేషన్‌లో తయారయ్యే యీ చిత్రాన్ని లక్ష్మి చిత్ర నిర్మిస్తున్నారు గొల్లపూడి రచన చేస్తున్నారు.

*కృష్ణవిన్నీ ఎం. జి. చిత్రాలే*

హీరో కృష్ణ నటించి, విడుదలకాబోయే ప్రతి చిత్రం, మినిమమ్ గ్యారంటీని చూపెట్టవిగావున్నాయి ప్రతిదాంట్లో ఒకే రకంవేషంగాక, వెరైటీవేషాలను ధరించాడు కృష్ణ ఆయనకు 'మాయదారి మల్లిగాడు' పెద్ద విజయాన్ని తెచ్చిపెడుతుంది ఆదుర్తి కీర్తి మరింత పెరుగుతుంది యీ చిత్రంతో

అలాగే టుడు బాలయ్య సమర్పించే 'నేరము—శిక్ష'లోకూడా, కృష్ణది మంచి వేషం 'చెల్లెలి కాపురం'కన్నా మిన్నగా యీ చిత్రం ప్రజలను ఆకర్షిస్తుంది ఈ సంవత్సరాంతంలోగా విడుదలయ్యే కృష్ణ చిత్రం ఏదీ, నిర్మాతలను క్షోభపెట్టదు

## జూలై 20న స్నేహబంధం

శ్రీ వాణీ కంబైన్స్ నిర్మించిన 'స్నేహబంధం' చిత్రం జూలై 20న అన్నపూర్ణా ద్వారా విడుదలవుతుంది ఎస్. వి. సుబ్బరాజు నిర్మించిన యీ చిత్రానికి పి. చంద్రశేఖర రెడ్డి దర్శకుడు మాటలను దాశరథి నారాయణరావు రచించారు

'స్నేహబంధము, ఎంత మధురము
అది చెరగిపోదు, తరిగిపోదు
జీవితాంతము'

అనేది సందేశాన్ని, యితివృత్తంగా తీసుకొని, కథను రాయడం జరిగింది, అన్నారు నిర్మాత సుబ్బరాజు

ఇటీవల యీ చిత్రం చూడడం జరిగింది. చిత్రానికి రాజబాబు హీరో అనిపించింది 'ఇల్లు—ఇల్లాలు' తర్వాత రాజబాబు హాస్యం 'స్నేహబంధం'లో గొప్పగా వచ్చింది

*విడాకుల లాయరు!*

ఈ చిత్రంతో విడాకుల లాయరుగా రాజబాబు నటించాడు పేరుకు లాయరే గాని కోర్టుకు ఒక్కపూట అయినా వెళ్ళడు, ఇంటిదగ్గర రిహార్సలు చేస్తాడు, కోర్టులో వాదించడానికి, కానీ కోర్టుకు వెళ్ళడానికి జంకుతాడు

*మొద్దబ్బాయిలు!*

అతడికి నలుగురు మొద్దబ్బాయిలు వున్నారు. ఒకడిపేరు దొంగరాముడు, రెండవవాడు పిడుగురాముడు, మూడవవాడు అగ్గిరాముడు, నాలగవవాడు బండరాముడు తను కోర్టుకు బయల్దేరు సమయానికి ఒకడు తుమ్మడం, మరొకడు గోవిందా అనడం, యిలా అపశకునం చేష్టలు చేసి తండ్రికి నిరాశ కలిగిస్తారు. మొద్దబ్బాయిల్ని కన్న తల్లిగా రమాప్రభ నటించింది.

*సత్యం సంగీతం!*

'స్నేహబంధం' చిత్రంలో సత్యం సంగీతం ప్రజలను ఆకట్టుకుంటుంది అన్నిపాటలూ, ప్రజాదరణ పొందే విధంగా సత్యం బాణీలను సమకూర్చాడు ఈ చిత్రానికి రామచౌదరి ఛాయను, మహేష్ కూర్పును, చలం కళను నిర్వహించారు.



'గాంధిపుట్టినదేశం'లో ప్రమీల

ప్రధాన పాత్రలను కృష్ణ, జమున, కృష్ణంరాజు, లీలారాణి, రాజబాబు, రమాప్రభ అల్లు రామలింగయ్య, రాధాకుమారి, సత్యనారాయణ, శ్రీరంజని, రావుగోపాలరావు, ఆశారాణి మువమ, కె. వి. చలం, సారథి, కె. కె. శర్మ పోషించారు

## లక్ష్మికి కొరడా దెబ్బ

పట్నవాసపు అలవాట్లకు, పాశ్చాత్య నాగరికతకు ప్రతిరూపంయిన లలిత ఏరికోరి యిష్టపడి, 'పల్లెటూరి బావ' ఏడుకొండల్ని పెళ్ళిచేసుకుంది.

ఆమె పల్లెలో కాపురంపెట్టిందన్న పేరేగాని, తలో జీర్ణించుకుపోయిన అలవాట్లను దూరం చేసుకోలేకపోయింది.

ఆరోజు లలిత పుట్టిన రోజు ఆమె తన మిత్రులను ఆహ్వానించి పెద్ద పార్టీనిచ్చింది, వచ్చి వాళ్ళ కన్ను, మిన్నుగానక తప్పతాగి, అక్కడ నివసించే ఆడపిల్లను బలాత్కారం చెయ్యబోతారు అప్పుడే యింట్లోకి అడుగు పెట్టిన ఏడుకొండలు ప్రళయకాల రుద్రుడయ్యాడు కొరడాతో బాది ఆ గుంపును తరిమేశాడు

తన స్నేహితుల్ని తన్ని తరిమివేసిన భర్తని మర్యాదలేని మనిషి అని ఆవేశంలో అనేసింది లలిత ఏడుకొండలు కోపం ఆపుకోలేకపోయాడు కొరడాతో నాలుగు బాదాడు.

'ఏమిటే, నీకూ, నీ బ్రతుక్కీ మర్యాద కూడానా' అంటూ కొరికొట్టాడు. 'కట్, అన్నారు దర్శకుడు ప్రత్యగాత్మ ఈ దృశ్యం పి. ఏ. పి. సుబ్బారావు నిర్మించే 'పల్లెటూరి బావ'లో కనిపిస్తుంది ఏడుకొండలుగా నాగేశ్వరరావు, లలితగా లక్ష్మి నటించారు

'పల్లెటూరి బావ' చిత్రానికి భమిడిపాటి మాటలను, చలపతిరావు సంగీతాన్ని, సెల్వరాజ్ ఛాయను, కృష్ణస్వామి కూర్పును నిర్వహిస్తున్నారు. నవయుగ విడుదల

—శ్రీనివాస్ ●

# మందారం అంటే మీకు విశ్వాసమేనా? అయితే మరింత విశ్వాసంతో వాడండి– ల్యూర్ ఆల్మండ్ హెయిర్ ఆయిల్!




అందమైన శిరోజ పోషణకు–ల్యూర్ ఆల్మండ్ హెయిర్ ఆయిల్!

# సినిమా బ్యూటీ బులెటిన్

లేక

## అందానికి చిట్కాలు

**అందాల తార సిమీ అందానికి, ఫాషన్‌కి తగిన చిట్కాలు తెలుపుతుంది వ్యక్తిగత మయిన ప్రశ్నలకి సమాధానాలు ఇవ్వలేనని తెలుపటానికి ఆమె చింతిస్తోంది! సాధారణంగా అందరికీ ఉపయోగంగా ఉండే ప్రశ్నలనే 'SIMI'S BEAUTY BULLETIN, Post Bag No 7117, BOMBAY 400014 కి పంపవచ్చు.**

ప్ర: మామూలుగా అబ్బాయిల జుట్టు ఎలా పొడవుగా వుంటుందో నేనూ అలాగే జుట్టు పెంచుతాను. కాని, గాలి వేస్తే మాత్రం జుట్టంతా చెదిరిపోయి 'ఫ్రాంకిన్ స్టిన్' సినిమా జ్ఞాపకం చేస్తుంటాయి భయంకరంగా. నూనె పట్టించినా అసహ్యంగా తయారవుతుంది. ఏం చెయ్యమంటారు!

జ: సమస్యకి తక్షణ పరిష్కారం కావాలి అనుకుంటే గుండు కొట్టించెయ్యండి. నచ్చకపోతే నూనె రాయకుండా డ్రస్సింగ్ చేసుకోవడంలో ఒక పద్ధతి అవలంబించండి. మరో విధానంకూడా చెబుతాను — లైవ్ షాంపూతో తలస్నానం చెయ్యండి. సహజంగా వుంటుంది. బాగా దువ్వబడే జుట్టుకు కూడా ఈ షాంపూను వుపయోగిస్తే అందంగా కనిపిస్తుంది

ప్ర: రోజుకి ఏడు సిగరెట్లన్నా తాగుతాను. నా పెదవులు నల్లగా అయిపోయాయి. రక్షించండి.

జ: పొగత్రాగడం మానెయ్యండి. వీల్లేదంటారా? మీ వూపిరితిత్తులు తప్పితే తక్కిన చోటల్లా నల్లగా మాడిపోవడం ఖాయం. అంచేత నల్లగా మారిపోకుండా వుండడానికి వేరే దారి లేదు. సెనగపిండి కొంత రక్షించవచ్చు. ప్రయత్నించి చూడండి

ప్ర: నేను మధ్యగా పాపిడితీస్తాను. ఆ పాపిడి అంతకంతకు ఎడం ఎక్కువయిపోతున్నది ఇది బట్టతలకి సూచన అని మిత్రులు అంటున్నారు. దీనికి విమోచనం వుందా?

జ: పాపిడి తీసుకోవడం మాత్రావే బట్టతల అయిపోతే మనల్ని ఆ భగవంతుడే రక్షించాలి. మీ తలలో మరి ఏ యితరమైన లోపాలున్నాయో? మీ హెయిర్ స్టయిలిస్ట్‌కి మొరపెట్టుకోండి.

ప్ర: నా చేతులు సన్నంగా వుంటాయి. అందంగా వుండాలంటే ఏం చెయ్యాలి?

జ: ఎక్సర్‌సైజ్ చెయ్యండి. వెనక్కి ముందుకీ మడుస్తూ వుండండి. అందరిలోనూ చెయ్యకండి, మీదేదో మెంటల్ కేస్ అనుకోగలరు!

ప్ర: నావి పొడవుగా బాగా వుండే కాళ్లే. కాని కొంచెం సన్నంగా వుంటాయి' దృఢపర్చాలంటే ఏం చెయ్యాలి, ముఖ్యంగా చీలమండల దగ్గర...?

జ: సన్నబడాలన్నా దృఢపర్చాలన్నా వ్యాయామం కావాలి. రెగ్యులర్‌గా ఎక్సర్‌సైజ్ చేసినట్లయితే మీ అవయవాలు



చక్కగా పొందికగా వుంటాయి. రోజూ పొద్దున్నే అయిదు నిమిషాల్లో తెమిలిపోయే ఒక ఎక్సర్‌సైజు చెప్తాను — వెల్లకిలా నేలమీద పడుకోండి ఒక కాలు వంచండి. రెండవ కాలు శరీరానికి సమకోణాకృతిలో నిలపండి. పాదం సీలింగ్‌కి సమాంతరంగా వుంచాలి అలా పైకీ కిందికీ కాలిని దింపుతూ వుండాలి. మీ బలం వున్నటయితే ఒకేసారి రెండు కాళ్లూ చెయ్యవచ్చు ఇలాచేస్తే కాళ్ళ సన్నబడ్డం తగ్గుతుంది. దృఢత్వం వస్తుంది. చీలమండలు దృఢంగా వుంచుకోవాలంటే పాదాన్ని గుండ్రంగా తిప్పాలి (పైకీ, పక్కకీ, కిందికీ) అలా రోజూ చెయ్యండి.

ప్ర: నాకు చెమట ఎక్కువగా పడుతుంది. ఎంత ఎక్కువగా పడుతుందీ అంటే — టెలిఫోన్‌లో మాట్లాడుతున్నాననుకోండి — నా చెయ్యి నీళ్లలో ముంచెత్తినట్టుగా అయిపోతుంది. ఒకటి గమనించండి, నేను ఎంతో ఆరోగ్యంగా వున్నాను. డాక్టరు దగ్గరకి వెళ్లమని సలహా యివ్వకండి. నేను విసుగెత్తి పోయాను మీకేమన్నా తెలిస్తే చెప్పండి.

జ: మామూలు పౌడర్లు, సబ్బులూ పరిష్కరించలేని చెయ్యలేని సమస్య మీది. మీకు యిష్టమైనా లేకపోయినా డాక్టర్ని చూడడమే మంచిది మీ గ్రంథుల్లో ఏదో లోపం వుంటుంది. డాక్టర్లే దాన్ని సరి చెయ్యగల్గుతారు. ●



రాఘవ అలిసిపోయి యింటికొచ్చాడు. వీధి అరుగుమీద ఆడుకుంటున్న బాబి తండ్రిని అల్లంతదూరం నుండి చూస్తూనే పరిగెత్తుకు వెళ్ళి—

'నాన్నమ్మా! నాన్నగారొచ్చారు!' అన్నాడు సంబరంగా. బాబినోట ఆమాట వింటూనే —ఆఁ... రాఘవ వచ్చాడా?' అంటూ ఆత్రుతగా లేచి రాబోయింది రామాయమ్మ. అప్పటికే రాఘవ లోపలికి వచ్చి గదిలోకి వెళ్ళిపోయాడు.

'నాన్నమ్మా! నాన్న రాగానే చెబితే ఐదు పైసలు యిస్తానన్నావుగా' అన్నాడు బాబి రామాయమ్మ కొంగుచివర ముడేసి పెట్టుకున్న ఐదుపైసలు మనవడి కిచ్చి పంపిస్తూ, 'లంచగొండి వెధవ — నాన్న ఆఫీసునుండి రాగానే చెప్పరా!' అంది. 'ఐదు పైసలిస్తావా?' అన్నాడు. 'ఊఁ' అనేసింది తను. 'గుంట వెధవ గుర్తు పెట్టుకున్నాడు' అని అనుకుంటూ నవ్వుకుందావిడ.

బయటికి వస్తాడేమో అంటూ పది నిమిషాలు చూసి తనే గదిలోపలికి వెళ్ళింది రామాయమ్మ. కుర్చీలో వెనక్కివాలి కళ్ళు రెండు మూసుకొని కుడిచేత్తో నుదురు నొత్తుకుంటున్నాడు రాఘవ. కొడుకు నా స్థితిలో చూసేసరికి రామాయమ్మ చెప్పాలన్నది చెప్పలేక బయటికి వచ్చేసింది. అదంతా ఓకంట గమనిస్తున్న జానకి గ్లాసులో కాఫీ పోసుకొని గదిలో కొచ్చింది. రాఘవ చేతిని కళ్ళకడ్డంగా పెట్టుకొని పడుకున్నాడు.

కాలి సవ్వడివల్ల ఎవ్వరొచ్చారో తెలిసి కూడా అలాగే వుండిపోయాడు రాఘవ. జానకి కాఫీగ్లాసును టేబుల్‌మీద పెట్టి రాఘవ నుదురు తాకి చూస్తూ,

'ఏమిటి అలా వున్నారూ?' అంది. జవాబియ్యలేదు రాఘవ. కళ్ళకు అడ్డంగా పెట్టుకున్న చేతిని తొలగిస్తూ—

'అలా వున్నారేం?' అంది తిరిగి.

'ఊహూఁ...' అన్నాడు రాఘవ. అతణ్ణి మరింత బలవంత పెట్టి, తెలుసుకోవడం ఇష్టంలేక—'కాఫీ త్రాగి కాసేపు పడు కోండి' అంటూ కాఫీగ్లాసు అందించింది. రాఘవ మౌనంగా కాఫీ త్రాగి గ్లాసు తిరిగి యిచ్చేసాడు జానకి గ్లాసు అందుకొని గది లోకి వెళ్ళిపోయింది. రాఘవ లేచి మంచం మీద వాలిపోయాడు.

రాఘవ కళ్ళుమూసుకున్నాడన్న మాటే గాని చెవుల్లో ఆఫీసరు మాటలే గింగుర్లెత్తుతున్నాయ్.

'ఈసారి యిలాంటి తప్పు జరగడానికి వీల్లేదు. పై అధికారులకు రిపోర్టు చేయాల్సి వుంటుంది' అన్నాడు.

'ఎంత గర్వం! బోడి ఆఫీసర్నని ఎంత [illegible]. పై అధికారులకు రిపోర్టు చేస్తా డట. చేసుకోని — ఏమవుతుంది? వెధవ

ఉద్యోగం పోతుంది అనుకోలేదా! అయినా తను కావాలని చేసాడా ఏమిటి ఆ తప్పు? ఆ కోటి వెధవ సెలవు పెట్టి తన ప్రాణం తీస్తున్నాడు. అసలు ఆరేళ్ళ సర్వీసులో ఒక్కనాడు ... ఒక్క చిన్నతప్పు చేసాడా? ఇదంతా ఆ కోటిగాడివల్లే వచ్చింది. వెధవ! పెళ్ళాం పుట్టింటికి వెళ్ళిందని సెలవు పెట్టి వెళ్ళాడు. అలాంటి వెధవ—పెళ్ళాన్ని వొదిలి వుండలేనివాడు అసలు ఎందుకు ఉద్యోగం చేయాలి? ఎంచక్కా పెళ్ళాం కొంగు పట్టుకొని తిరగ్గూడదూ?'

'ఎప్పుడో వారం రోజుల్క్రితం పంపించాల్సిన అర్జంటులెటరు ఫైల్లో పెట్టి, తనకోమాటమాత్రం అయినా చెప్పకుండా అడుగున పడేసాడు. తనకేం తెలుసు? ఎవరికీ వాడు నెలరోజులుగా పెండింగ్‌లో వుంచినవన్నీ వీలైనంతవరకు పూర్తి అయిందనిపించాడు. సంతకంకోసం ఆఫీసరుదగ్గరికి వెళ్ళిపోయాయి. కాని ... ఆ లెటర్‌కోసం, అంతగా ఎగిరాలా?'

'ఇది ఆఫీసనుకున్నావా? యిల్లా? వారం క్రితం పంపిచాల్సిన వుత్తరం ఇప్పుడటయ్యా పంపించేది? కనిపించడంలేదూ? 'అర్జంటు' అని. ఎందుకు? ఈ ఉత్తరం సమయానికి పంపించకపోతే?' అంటూ పిట్టగా రంకె...సారీ ..అరిచాడు,

'అది నాసీటు కాదండి! కోటీశ్వరరావుది. ఆ వుత్తరం అర్జంటు అని యిందాకనే చూసాను. ఫైల్లో అడుగున పడేసాడు' అని తానెంత చెప్పినా వినిపించుకుంటేనా?

'రాఘవగారూ! మీరు సిన్సియర్‌గా వర్కు చేస్తారని నాకు తెలుసు. అందుకే మీకే పని అప్పచెబుతున్నాను. శ్రమ అనుకోకుండా కాస్త కోటీశ్వరరావుగారి సీటు కూడా చూడండి. అని ఆరోజు బ్రతిమాలిన' ఆఫీసరు—

ఈనాడు నేను తప్పుచెయలేదు మొర్రో అంటే వినిపించుకున్నాడా? విన్పించుకో లేదూ! పైగా సవాల్ చేస్తున్నట్టూ 'ఎందుకు?' అన్నాడు. అంటే — ఈ వుత్తరం అర్జంటని తెలిసి చేయలేని నీ బతుకెందుకు, నీ బి. ఏ. డిగ్రీ ఎందుకు అసలు నీకీ ఉద్యోగం ఎందుకు అనేగా?

ఛీ...యిన్నాళ్లకు ఎలాంటి మాట పడ్డాడు. ఇదంతా ఆ కోటిగాడివల్లే జరిగింది'

# ఈ బతుకు చాలు!

'ఒరేయ్! రాఘవా! చచ్చి నీ కడుపున పుడతారా! నా సీటు చూడమని ఆఫీసరు అడిగితే ఒప్పుకోరా నా తండ్రీ! నీకు పెళ్ళయింది కదురా! పైగా సీనియర్‌వి. నాబాధ నీకు అర్థంకాదని కాదు. కాని... నేను జూనియర్‌ని. పెళ్ళయి ఆరునెలలు కాలేదురా. మా ఆడది పుట్టింటికెళ్ళి వారం దాటింది. నా బాధ, ఈ వారం రోజులుగా నా ఆవేదన, సూటిగా చెప్పాలంటే నా విరహం నీతో విడమర్చి చెప్పలేను. అయినా నీకు అనుభవం వుంది కదురా చిట్టీ! ఈమాత్రం పుణ్యం కట్టుకోరా బాబ్బాబు' అని బ్రతిమాలాడు.

నిజమే అంటూ జాలిపడి దయతలిచి ఒప్పుకున్నాడు. కోటీశ్వరరావు తనను విత్తేసినంత పనిచేసి, పదిరోజుల సెలవు పెట్టి వెళ్ళాడు. వారం రోజులు పెళ్ళాం పుట్టింట్లో వుందని వీడు పదిరోజులు సెలవు ఎందుకు పెట్టాడో అర్థంకాక, ఆఫీసరు అడగ్గానే ఒప్పుకున్నాడు.

తీరా మంచికిపోతే చెడు ఎదురైంది. ఆఫీసరు అలా తిడ్తుంటే? ముఖ్యంగా ఆ లేడి టైపిస్టు ముందు. ఆ అమ్మాయి నవ్వింది. అప్పుడు... నిజంగా ఆఫీసరు తిట్టిన దానికంటె ఆ అమ్మాయి అలా నవ్వినందుకే తన గుండె నింత బాధపడి పోయింది. ఆ బాధ ఆ ఆఫీసరుకు తెలుసా? ఉహూం... ఆ కోటి వెధవకు తెలుసా? అర్థం చేసుకుంటాడా? ఉహూం...లేదు.

'ఛీ...వెధవ బతుకైపోయింది...ప్చ్...' బాధగా, విసుగ్గా నిట్టూర్చాడు రాఘవ.

ఆ రాత్రి భోజనాల వేళ వరకు రాఘవ అలా కూర్చుండి పోయాడు. మధ్యలో బాబిగాడు నోసారి వెళ్ళి పలకరించి మాట్లాడించాలని ప్రయత్నించి మారు పలకకుండా ఉరిమి చూసిన తండ్రిని చూసి, బిక్కమొహం వేసుకొని బయటికి వచ్చేసాడు.

'అబ్బాయ్ అలా వున్నాడేం జానకి?' కొడుకు దగ్గరికి వెళ్లలేక కోడలిని అడిగింది రామాయమ్మ.

'నాతో కూడా ఏం చెప్పడం లేదు అత్తయ్యా!' అంది జానకి.

'భోజనానికి వస్తారా?' అంది జానకి వచ్చి.

[illegible] చూచాడు రాఘవ భార్యవంక.

'ఇక్కడికే తీసుకురమ్మంటారేమోనని' అంది చిన్నగా నవ్వుతూ.

'నీకు నవ్వుగానే వుంటుంది. అసలు ఆఫీసులో నాకెంత అవమానం జరిగిందో నీకు తెలీదు' కసురుకున్నాడు రాఘవ.

'అలిగి కూర్చోవడానికి ఇది ఆఫీసు కాదు. నేను ఆఫీసరును కాను. యిది యిల్లు. మీ ఆఫీసుగొడవ యింట్లో ఎందుకుగాని భోజనానికి లేవండి' అంది తిరిగి.

'ఊఁ.. గొడవ అక్కర్లేదు కాని... వెక్కిరించటం చేతవవుతుందేం?' అన్నాడు రాఘవ.

'అసలు విషయం చెప్పకపోతే ఎలా అర్థం అవుతుంది? అడిగినా చెప్పకుండా అలక పాన్పు...కాదు అలక కుర్చీ ఎక్కారుగా అందుకే అక్కర్లేదన్నాను' అంది అతనిపక్కనే కూర్చుంటూ.

'ఇంతకీ ఏం జరిగింది?' అంది.

'ఆ కోటివెధవ చేసాడు ఇంత' అన్నాడు తలా తోకా తెలీకుండా! జానకికేం అర్థం కాలేదు.

'ఆ చెప్పేదేదో అర్థం అయ్యేలా చెప్పకూడదటండి!' అంది ఏనుగుమొహంవేసి.

'ఏం? ఇంగ్లీషులో చెబుతున్నానా?' అన్నాడు రాఘవ. తన బాధ జానకి అర్థం చేసుకోవడం లేదనే బాధ తప్ప, తనేం చెబుతున్నాడో అర్థం చేసుకోక.

'ఇంగ్లీషులో చెప్పినా బావుండిపోనూ! తెలియని భాష, అంతగా పరిచయంలేని భాష కాబట్టి బాధ వుండేది కాదు. చెప్పిన దానికి ఊఁ కొడ్తే అయిపోయేది. తెలుగులో చెబుతున్నా అర్థంకావడంలేదు అంటే...' రాఘవ మొహం ఎర్రబారడంతో ఫక్కున నవ్వేసింది.

'ఆ కోటి వెధవ చేసాడు ఇంత' అన్నారు. ఏ కోటివెధవ? ఏం చేసాడు. పైగా ఒక్కవెధవ, పదివెధవ, వె[illegible] వెధవ, లక్షవెధవ కోటివెధవ అని వుంటారేమిటండి?' నాకు తెలీకడుగుతాను' అంది జానకి అమాయకంగా మొహంపెట్టి. తెలిసిన తెలియనట్టు చూస్తూ, రాఘవను నవ్వించాలని.

అంత కోపంలోను రాఘవకు నవ్వు

వచ్చింది. అయినా తన మాటలకు అలా వెరి అర్థాలు తీసి, అమాయకంగా తెలి వటు ఆవడం గుర్తుకొచ్చి, అదంతా కేవలం తను నవ్వడానికే అని అర్థమై, సీరియస్‌గా మారిపోతూ చిరాకు పడతూ—

'నీకంతా వేళాకోళంగా వుంది కదూ!' అంటూ మొహం ప్రక్కకు తిప్పుకున్నాడు రాఘవ. భర్త అలా పసిపిల్లవాడిలా అలి గడం చూస్తుంటే జానకికి నవ్వు వచ్చింది. అంతలోనే జాలేసింది. అతని భుజం మీద చేయివేసి, మొహాన్ని తనవైపు తిప్పుకొని తల నిమురుతూ.

'కోపం వచ్చిందా?' అంది. కళ్ళలోకి చూస్తూ. జానకి ఆ మాటలో ఏం మహత్యం వుందో కాని, చాలాసార్లు, అలా లాలనగా అడిగేసరికి, ఎంత కోపంలో వున్నా, తక్కున జరిగింది మర్చిపోయి, కరిగిపోయే వాడు రాఘవ. ఈసారి అంతే అయ్యింది.

'ఛీ...వెధవ బతుకైపోయింది జానకీ! ఏమిటో!' అన్నాడు మెల్లిగా.

'ఛ ..ఆఫీసులో ఏదో గొడవ జరిగినంత మాత్రాన అలా అనుకుంటారా? చూడండి! మీది వెధవ బతుకేనా?' అంది అతని మొహాన్ని రెండు చేతుల్లోకి తీసుకుంటూ.

'చెప్పరేం? రాజా బతుకు కాదూ!' అంది, రాఘవ మాట్లాడలేదు. జానకి మొహంలోకి చూస్తూ తృప్తిగా నవ్వాడు.

'ఇంతకీ అసలు విషయం చెప్పేరు కాదూ!' అంది జానకి. ఏలాగైతేనేం రాఘవ చెప్పేదంతా అర్థం చేసుకొని తేలిగ్గా నవ్వేసింది జానకి.

'నీకు నవ్వుగా వుందా జానకీ?' అన్నాడు రాఘవ.

'మీ ఆఫీసరు అలా మీరు చెప్పేది వినకుండా తిట్టడం తప్పే. కాని మీరిలా తలచుకొని బాధపడడం బావులేదు' అంది.

'అసలు ఆ కోటి వెధ...అదే కోటేశ్వర రావు రానీ! వాడిపని చెబుతాను. పెళ్ళాం కొంగు పట్టుకు తిరిగే వెధవకు ఉద్యోగం ఎందుకో కనుక్కుంటా! వొట్టి బుద్ధిలేని వెధవ. సిగ్గులేని'...

'మీకు మహా వున్నట్టే! మొదట్లో మీరు అంతేగా' అంది జానకి.

'ఛ ..వాడిలా నేను, అంతలా నీ కొంగు పట్టుకొని తిరిగానా జానకి. నేను మొదటి నుండి కూడా చాలా...'

'బుద్ధిమంతులు అవునా!' అంటూ నవ్వేసింది జానకి.

'మరే... మీరు నిజంగా బుద్ధిమంతులు— బోల్డు మంచివారు. అవునా? ఒక్కసారి వచ్చి వెళ్ళమని నాన్నగారు రాస్తున్నారు కదూ, వెళ్ళి ఓ పదిరోజులు' జానకిమాట పూర్తికాకముందే హడావుడిగా లేచాడు రాఘవ.

'పదవోయ్ జానకీ! వడ్డించేద్దువు కాని, నేను నాలుగు చెంబులు పోసుకొని వచ్చేస్తానూ' అంటూ నడిచాడు.

'అయ్యింది! అబ్బాయిగారిపని?'

'వెడితే వెళ్ళవోయ్! నీకే బాధ. అమ్మకు చేతకాదు ఏపని చేయలేదు. వేళకు ఇంట్లో కాకపోతే హోటల్‌లోతింటే ఆరోగ్యం సరిగా వుండదని కంగారుపడుతూ నువ్వు రావల్సిందే' అన్నాడు.

'ఊఁ...అసలు పంపను అని చెబుతూ! నాన్నదగ్గరికి వెళ్ళాకా నేనసలు మీ గురించి కంగారుపడను.'

'ఆఁ... నాకు తెలుసులేవోయ్! అయినా నా వెర్రిగాని నిన్ను వెళ్ళంటేమాత్రం వెళ్తావా! వెళ్ళడం ఇష్టంలేక, తప్పు నా మీద తోస్తావ్ కాని' అంటూ జానకి బుగ్గమీద చిటికేసి, హుషారుగా ఈలవేస్తూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు రాఘవ.

'రాఘవ! నీకువచ్చే పౌర్ణమినుండి మంచి రోజు లొస్తాయటరా. ధనలాభం, పుత్ర ప్రాప్తి. ప్రమోషను వస్తాయట' అంది భోజనం చేస్తూ, రామాయమ్మ — రాఘవ కాస్త హుషారుగా కన్పించడంతో వచ్చి నప్పటినుండి ఆపుకున్నా, యిక ఆపుకో లేనట్టుగా.

'ఎవరు చెప్పేరమ్మా?'

'మధ్యాహ్నం కామాక్షమ్మగారింటికి ఓ జ్యోతిష్కుడు వచ్చాడులే.'

'వాడి మొహం!' అన్నాడు రాఘవ తేలిగ్గా తీసిపారేస్తూ.

'నీ పెళ్ళాం అలాగే అందిరా బాబు! కాని... ఏ పుట్టలో ఏ పాముందో? కామాక్షమ్మగారికి జరిగినవన్ని చెబుతుంటే అన్నీ నిజమే అంది. నువ్వు కూడా చూపించుకోవే అమ్మాయ్ అంటే నీ పెళ్ళాం వింటేనా? నాకు నమ్మకం లేదత్తయ్యా! అనవసరంగా పావలా దండగ అంది' కోడలివంక చూస్తూ రామాయమ్మ.

చిన్నగా నవ్వుకుంది జానకి.

'నాచేయి చూసి నీ గురించి చెప్పాడురా రాఘవ! నీ చెయ్యి చూస్తే యింకెన్ని విషయాలు చెబుతాడో అని, రేపు ఆది వారం కదూ! రమ్మన్నాను. మర్చిపోకుండా వుండు!' అంది.



# ఈ బతుకు చాలు!

'నాగురించి ఏం చెప్పాడు?'

'నువ్వు ఉద్యోగం చేస్తున్నావని చెప్పాడు. ఆర్థికలోపంవల్లే నువ్వు బి. యే. తరువాత చదవలేకపోయావని చెప్పాడు. చిన్నప్పటి నుండి నీ కొడుకు పెద్ద బుద్ధులు కలవాడని చెప్పాడు. ఈ సంవత్సరం తరువాత ధనలాభం, పుత్రప్రాప్తి అని చెప్పాడురా! యింకా నీకు పెళ్ళవ్వలేదని నీకో కొడుకని...యింకా త్వరలోనే పుత్రప్రాప్తి అని కూడా చెప్పాడురా!' అంది సంతోషంగా.

'పుత్రప్రాప్తి కూడానా?' అంటూ భార్యవంక చూస్తూ నవ్వాడు రాఘవ. అప్పటికి వచ్చే నవ్వు నాపుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తున్న జానకి భర్త అలా చూడ్డంతో బయటికి వచ్చేసింది మంచినీళ్ళకంటూ.

మర్నాడు మధ్యాహ్నంవేళ రాఘవ మంచంమీద పడుకొని పేపరు చదువుకుంటూ మధ్య మధ్య, చాప మీద కూర్చొని తన చొక్కాకు బొత్తాములు కుడుతున్న జానకితో వినకున్నా వింటున్నట్టు ఊఁ... అంటున్నందుకు హుషారుగా వార్తలు, సినిమా కబుర్లు చెబుతున్నాడు.

'రాఘవా!' అంటూ రామాయమ్మ గట్టిగా పిలవడంతో, కంగారుగా పేపరు టేబుల్ పైకి విసిరేసి బయటికి వెళ్ళాడు రాఘవ.

'అదుగోరా! జ్యోతిష్యుడు!' అంటూ వరండా మెట్లెక్కి వస్తున్న ఓ మనిషిని చూపెట్టింది.

'నాకెందుకమ్మా? చెప్పాల్సినవి నిన్నే చెప్పాడుగా!' అన్నాడు. నిన్న ఏదో చెబుతుంటే విన్నాడన్నమాటే కాని, అంతగా ఆలోచించలేదు రాఘవ.

'అది కాదురా! నీ చేయి చూస్తే యింకా ఏమైనా చెబుతాడు' అంటూ అతను రావడంతో, అతని కూర్చోపెట్టి ఎదురుగా రాఘవ ప్రక్కనే కూర్చుంది.

విధిలేక కూర్చున్నాడు రాఘవ. ఏలాగైతేనేం అరగంటసేపు చెప్పినమాటలే చాలాసార్లు చెప్పి లేచాడతను. పావలా ...జేబులో వేసుకొని.

'నువ్వూ చూపించుకోరాదుటే జానకి!' అంది రామాయమ్మ.

'నాకెందుకు అత్తయ్యా!' అంటూ జానకి మొండికేయడంతో అతను వెళ్ళిపోయాడు.

'నిజంగానే కొన్ని విషయాలు సరిగ్గా చెప్పాడు కదూ జానకి' అన్నాడు రాఘవ. చిన్నగా నవ్వేసింది జానకి.

'నవ్వుతావెందుకే?' అంది రామాయమ్మ చిరాకుగా.

'నవ్వక ఏం చేయను అత్తయ్యా. నిన్న మీకు చెప్పారు! యిప్పుడు చెప్పింది అదే కదూ! మీ మాటకు బొట్టులేదు. మీ ప్రక్కన నాన్నమ్మా! అంటూ పిలిచే బాబుని చూసాడు. నన్ను చూసాక, ఆ జ్యోతిష్యుడే కాదు. ఎవరైనా చెప్పగలరు. మీ అబ్బాయికి మాత్రం విశేషించి ఏం చెప్పాడు? ప్రమోషన్ మాట చెప్పడేరుగు. కాని...ఆ మాత్రం లాభం వచ్చే విషయాలు చెప్పకపోతే వాళ్ళకి గడిచేదెలా?' జానకి మాటలకు నిర్ఘాంతపోయిందామె.

'ఇప్పుడు రోజులంతగా బాగా లేవని చెప్పాడు కాదూ!' జానకి! అన్నాడు రాఘవ. రామాయమ్మ వెళ్ళిపోవడంతో.

'ఏం? ఎందుకు బాగాలేవూ? మనమేం ఇబ్బంది పడడం లేదే?' అంది జానకి.

'ఇంట్లో ఇబ్బందులు కావోయ్...నిన్న మా ఆఫీసరు...' రాఘవ అమాయకత్వానికి జానకి నవ్వుతూ,

'చాల్లెద్దురూ! మీరు మరీను. ఆఫీసులో జరిగిన చిన్న గొడవకు మీ రింతగా అనుకోవడం...'

'పోని ... ప్రమోషన్ వస్తుందని అన్లేదూ?' అన్నాడు.

'అహా...మీ మాట ప్రకారం, మీ ఆఫీసరు తిడుతున్నాడని, రోజులు బాగా లేవని అంటున్నారుగా? ఈ ప్రమోషన్ రావడం...'

'అదికాదు జానకి! ఆ మధ్య అనుకున్నారులెద్దూ అంతా. ఆఫీసరు నాపేరు రికమెండ్ చేసాడని...కోటిగాడు వెళ్ళి వారం రోజులేగా అయింది. అయినా నిన్ననేగా అతను అలా విసుక్కున్నది.'

'ఇది మరీ బాగుంది. యింకా రోజులు బాగా లేవడానికి ఆఫీసరు తిట్టాడని ఉదాహరించారు. ఇప్పుడు ఇదేనా? ఏమో! మీకు నమ్మకం వుందేమో కాని నాకే మాత్రం నమ్మకంలేదు.'

'ఏమో! వాడు అలా చెబుతుంటే నాకెంతో నమ్మకంగా వుంది.'

'వాడేం చెప్పాడో నాకర్థం కాలేదు. ఎదురుగా కన్పించేవి చెప్పడం కూడా గొప్ప వేమిటి? అయినా నా కలాంటి వాటిమీద నమ్మకం లేదు' అంది ఖచ్చితంగా జానకి.

'రేపును రంగుటద్దాల్లో చూసి, గొప్పగా ఊహించుకొని పొంగిపోవటం, రేపు ఇంత కంటే విపరీత పరిస్థితులే ఎదురైతే క్రుంగిపోవటం ఏ విధమైన బలహీనతో'

'రేపంటే నీవు ఆశ పెంచుకోవా జానకి? నిరాశావాదివా నువ్వు?'

'లేదు. నేను ఆశావాదినే. రేపు వుందనీ, వుంటుందనీ, ఉండాలనే అనుకుంటాను. కాని...ఇలా వుండాలని అనుకునే ముందు, నేటి మన కృషి, ప్రయత్నం అంచనా వేసుకొని, ఊహించి, ఆశిస్తానే తప్ప మరోవిధంగా కాదు. ఈనాడు అనుకున్నది, రేపు జరగకపోతే, ఈక్షణం రేపు మనముందు నిలబడి నవ్వుతుంది. ఆక్షణాన్ని ఎదుర్కొనే శక్తి అందరిలో వుండదు, అందుకే...'

'నువ్వు రేపు ఎలా వుండాలనుకుంటున్నావ్?' అన్నాడు రాఘవ నవ్వుతూ.

'ఇలాగే... ఈరోజులాగేవుంటే చాలు.'

'అల్పసంతోషివి జానకి! అంతేకాదు రేపు ఎదురయ్యే పరిస్థితికి తట్టుకోలేని భీరువువి'

అతని మాటలకు జానకి సాలోచనగా చిన్నగా నవ్వేస్తూ—'నేను మీకు భీరువులా కన్పిస్తున్నానా?' అనుట్టు అతని మొహంలోకి చూసింది.

మరో రెండురోజుల్లో ప్రమోషన్ విషయం తెలిసిపోతుందని ఆఫీసులో తెలియడంతో, రాఘవ జ్యోతిష్యుని మాటలు గుర్తుకొచ్చాయి.

ఆ సాయంత్రం ఆఫీసునుండివస్తూ, ఆంధ్రాబ్యాంకు దాటాకా గార్డెన్ కెదురుగా వుమెన్స్ కాలేజి గోడవారగా ఓచోట కూర్చున్న చిలకజోస్యం చెప్పే వ్యక్తిని చూస్తూనే ఆగిపోయాడు, పనిపైనలిక్వటంతో చిలక పేర్చిన ముక్కల్లోనుండి ఓ కాగితంముక్క తీసి యివ్వడంతో చేయిచాపి చూపించాడు, చాలా సార్లు అతని ముందు కొందరు అలా చేతులు చాపి కూర్చొని వుండడం చూసి, 'ఛ ...బుద్ధి

లేమో అంటూ చిరాకుపడ్డ తనే ఈరోజు అలా చేయి చూస్తుంటే ఓ క్షణం సిగ్గు వేసి మరుక్షణంలో మనసును సరిపెట్టుకున్నాడు రాఘవ. వాడు ఏమిటేమిటో చెబుతుంటే రాఘవకేం అర్థం కాలేదు.

'నాకు ప్రమోషన్ వస్తుందా? రాదా?' అన్నాడు.

'ఓ...తప్పకుండా వస్తుంది. ఇదుగో చేయి ... ఈ చేతిలోని ఈ రేఖవుంది చూసారు బాబు ... ప్రమోషన్ రేఖేనండి. ఈవారం అంతా గురుబలం బాగుందండి. ధనలాభం, ఉద్యోగలాభం, సుఖలాభం...' యింకా ఏమేమిటో అంటుంటే తిరిగి తన పాతప్రశ్నే అడిగాడు రాఘవ.

'బాబుగారూ! అనుమానించకండి! వస్తుంది. మీకు రాకపోవడం ఏమిటి? తప్పకుండా వస్తుంది' అన్నాడు.

రాఘవ సంతోషపడిపోయాడు, జేబులో నుండి పావలాతీసి వాడి చేతిలో పెట్టి హుషారుగా యింటికివెళ్ళి, కూనిరాగం తీస్తూ గదిలోకి అడుగుపెట్టాడు.

'నాకు ప్రమోషన్ వస్తోందోయ్' అన్నాడు కాఫీ తీసుకువచ్చిన జానకితో.

'నిజంగానా!' అంది సంతోషంగా జానకి.

'ఊఁ...చిలక జోస్యంవాడు చెప్పాడు — ఇందాకా' అంటూ జరిగింది చెప్పాడు. జానకి భర్త మొహంలోకిచూసి మరేం మాట్లాడకుండా ఖాళీగ్లాసు అందుకొని వెళ్ళిపోయింది.

'జానకీ! ప్రమోషన్ వస్తే కనీసం యాభై రూపాయలన్నా జీతం పెరుగుతుంది మనకు ఇప్పుడు వచ్చేజీతం సరిపోతోంది కదూ! అంటే ఆ యాభై రూపాయలు మిగులన్న మాటేగా! మొదటినెల నువ్వో మంచిచీర కొనుక్కో. అన్నట్టు నీకు ఒక వాచీ కొనివ్వాలని నా కెన్నాళ్ళుగానో వుంది జానకీ! నీ అందమైనచేతికి వాచీ పెడితే మరీ అందంగ వుంటుంది. అన్నట్టు బాబిగాడికి మూడేళ్ళు దాటిపోయాయి కదూ! ఈ వేసవి అయిపోయాకా స్కూల్లో వేసేద్దాం. వాడి చదువుకు ఇప్పటినుండే దాచాలి మరి.'

నిద్రపోనీయకుండా ఒకటే సంబరంగా చెబుతున్న భర్తవంక చూస్తూ వుండిపోయింది జానకి, ఇతన్తో ఏమీ అనలేక, ఎలా వారిం చాలో తెలీక; లోలోపలే బాధపడిపోయింది.

అర్ధరాత్రివేళ మెలకువవచ్చిన జానకి, లేచి కూర్చుంది. ప్రశాంతంగా నిద్ర పోతున్న భర్త మొహంలోకి చూసింది. అమాయకత్వం మూర్తీభవించినట్టున్న భర్త మొహాన్ని చూస్తూనే ఆమె మనసంతా జాలితో నిండిపోయింది.

ఇంకా రాని ప్రమోషన్, వస్తుందో, రాదో, ఖచ్చితంగా తెలియని ప్రమోషన్ గురించి అతను కనే కలలను, వాటిని పటిష్ఠం చేసుకోవడానికి, జ్యోతిష్యుడు చెప్పే మాటలను నమ్మడం చూస్తుంటే అతను అంతగా ఎందుకు నమ్ముతున్నాడో అర్థంకాలేదు జానకికి.

జోస్యం చెబుతానవే ఏ వ్యక్తికాని, చేయి చూసి, శుభం జరుగుతుందని చెబుతాడే కాని, అశుభం, నష్టం జరుగుతుందని చెప్పడు — చెప్పలేడు. అలాంటప్పుడు అందరికి శుభాలే జరిగితే కన్నీళ్ళకు చోటేది? బాధలకు, అర్థమేది? కనీసావసరాలకే కటకటలాడిపోయే మధ్యతరగతి కుటుంబాలు, మరుక్షణానికే అర్థం చెప్పలేక, రేపుకు రూపం దిద్దలేక పోతున్నప్పుడు, భవిష్యత్తును రంగులకలలో చూపిస్తే దారిలేని జీవితాలు, ఎలా నమ్ముతారు? ఒక్కపూటకు రూపం దిద్దలేకపోయినవారు, భవిష్యత్తును ఎంతో అందంగా ఊహించుకోవడానికి ఎక్కడినుండివస్తుందా ధైర్యం? ఆ బంగారు భవిష్యత్తు ఎలా వస్తుందన్న కూడా ఆలోచించనివారు, అందంగా మాత్రం ఎలా ఊహించుకోగలుగుతారూ? పూరిగుడిసె నీడకు ఎలా నిలుస్తాయను కుంటారూ? పూరిగుడిసె నీడవదే? మరి జీవిత లమాటేమిటి?

'నువ్వు చాలా ఘోరంగా ఆలోచిస్తున్నావ్ జానకీ! కలతలు, కన్నీళ్ళల్లో మ్రగ్గిపోయే జీవితాలు రేపటికి రూపం చెప్పలేని జీవితాలు భవిష్యత్తు బంగారు బాటలో ప్రయాణం చేస్తుందంటే నమ్మక నిరాశ పెంచుకోమడం అన్యాయం' అంది మనసు.

'కాని ... ఆధారం లేకుండా, కృషి, ప్రయత్నం లేకుండా ఎక్కడినుండో బంగారు భవిష్యత్తు ఊడిపడుతుందని అనుకొని నమ్మడం, నమ్మి ఆశలు పెంచు



## ప్రాచీన వైద్య పద్ధతులు

# గ్రహణి, సంగ్రహణి హరములు

[కడుపునొప్పి, ఆసనము తీపుకలిగి—చీము లేక రక్తం మిశ్రమమయి విరేచనాలయే అతిసార రోగానికి గ్రహణి అంటారు., ఆంగ్లంలో దీనికి 'డిసెంట్రీ' అని అంటారు. విషమ పరిస్థితిలోవున్న గ్రహణి రోగానికి సంగ్రహణి అంటారు. ఆధునిక వైద్యసదుపాయం అందుబాటులో లేనివారు ఈ క్రింది ప్రాచీన వైద్య చికిత్సా పద్ధతులలో యుక్తమయిన దానిని ఆచరిస్తే తప్పక ప్రయోజన ముంటుంది.]

1. పిప్పళ్ళు, శొంటి, విషబొద్ది, నల సుగంధిపాల, చిన్నములగ, పెద్దములగ, చిత్రమూలం, కొడిసెక్షారం, పంచలవణములు [అనగా సైంధవ లవణం, సౌవర్చలవణం, బిడారులవణం, సముద్రలవణం, ఔద్భిద లవణం] వీనిని సమభాగాలుగా తీసుకొని మెత్తగా చూర్ణంచేసి—పూటకు అరతుల మెత్తు చూర్ణాన్ని పెరుగుమీది తేటలో కలిపి—రోజూ మూడు పూటలా వారంరోజులు సేవిస్తే గ్రహిణిరోగం నివృత్తిస్తుంది.

2. పంచలవణములు సజ్జక్షారం, యవక్షారం, మిరియాలు, పంచకోలములు, [అనగా శొంఠి, పిప్పలి, పిప్పలిమూలం, చెవ్యం, చిత్రమూలం] వోమము, ఇంగువ అనువానిని సమబాగములుగా తీసుకొని—మాదీఫలరసంతోగాని, దానిమ్మపళ్ళరసంతో గాని నూరి—కుంకుడుగింజంతేసి మాత్రలు చేసి—రోజూ మూడు పూటలా ఒక్కొక్క మాత్రను మజ్జిగతో వారంరోజులు పుచ్చుకుంటే గ్రహిణి రోగం నివృత్తిస్తుంది.

3. ఒక నీరుల్లి పాయలో ఒకగోధుమ గింజఎత్తు నల్లమందు వుంచి—కుమ్ములో ఉడికించి—రెండుమూడురోజులు ఉదయం, సాయంత్రం తింటే రక్తగ్రహిణి హరిస్తుంది. ఒక నీరుల్లిపాయను సన్నంగా ముక్కలుకోసి ఆ ఉల్లిపాయంత వెన్నకలిపి తింటే గ్రహిణి, రక్తగ్రహిణి నివృత్తిస్తాయి. రోజూ మూడు పూటలా తినాలి.

4. రెండు లేదా మూడు ఔన్సుల అరటి పువ్వుల రసంలో పెరుగు కలిపి రోజుకు మూడు సార్లు వారం రోజులు పానంచేస్తే రక్త గ్రహిణి నివృత్తిస్తుంది.

5. ఉసిరిక కాయల రసాన్ని పూటకు ఒకటి లేదా రెండు ఔన్సుల చొప్పున రోజూ మూడుపూటలా వారం రోజులు పానం చేస్తే రక్తగ్రహిణి, పురాణరక్తగ్రహిణి నివృత్తిస్తాయి. పచ్చి ఉసిరిక కాయలు లభ్యమవక పోతే ఉసిరిక వరుగు కషాయాన్ని మోతాదు రెండు లేదా మూడు ఔన్సుల చొప్పున పానం చెయ్యవచ్చు. పూటకు రెండు లేదా మూడు ఔన్సుల ఉసిరిక ఆకుల తేలిక కషాయంలో పావుతులం మెంతులు కలిపి రోజూ రెండు పూటలా కొన్నాళ్ళు సేవిస్తే పురాణ రక్తగ్రహిణి నయమవుతుంది.

6. కరివేపాకులను పచ్చివిగాని, నేతిలో వేయించినవి గాని [సుమారు రెండుతులముల ఎత్తు] దినమునకు రెండు సార్లు తింటే రక్తగ్రహిణి హరిస్తుంది.

7. ఒక ఔన్సు కొడిశపాలచెక్క కషాయంలో —అరగోధుమగింజంత నల్లమందు కలిపి నాలుగు గంటలకొక మోతాదుచొప్పున యిస్తే రక్త విరేచనాలు కడతాయి. కాని ప్రేవులలో వుండయ్యే రక్తగ్రహణికి ప్రారంభంలో దీనిని యివ్వకూడదు. ఈ కొడిశపాలచెట్టును 'పెద్ద అంకుడుచెట్టు' అని కూడా అంటారు. సంస్కృతంలో ఇంద్రయవ, కాళింగ అని అంటారు.

8. మిరియాలను మెత్తని ముద్దగా నూరి, యిండుపకాయంతేసి వుండలుచేసి—పూటకు ఒకటిగాని, రెండుగాని రోజూ మూడు పూటలా మజ్జిగతో సేవిస్తూంటే గ్రహిణిరోగం హరిస్తుంది.

9. చింతగింజల చూర్ణాన్ని పూటకు అరతులమెత్తు చొప్పున రోజూ మూడు పూటలా మంచినీళ్ళతో సేవిస్తే గ్రహిణి రోగం హరిస్తుంది.

10. లేతదానిమ్మ ఆకులు గుప్పెడుతెచ్చి ముద్దగా నూరి—అందులో గోళీకాయంత వెన్న—అంతే పరిమాణం గల పటిక పంచదార చూర్ణం కలిపి రోజూ మూడుపూటలా కొది రోజులు తిన్నట్లయితే రక్తవిరేచనాలుకడతాయి.

11. చిన్న నిమ్మకాయంత వెన్నలో, ఒక నీరుల్లి పాయ ముక్కలను, మెంతులను సరి సమానంగా కలిపి అయిదారు రోజులు రోజూ మూడు పూటలూ తిన్నట్లయితే గ్రహిణి రక్తగ్రహిణి హరిస్తాయి.

12. నేరేడు చెట్టుయొక్క మాను చెక్క కషాయాన్ని రెండు లేదా రెండున్నర ఔన్సుల చొప్పున ఆరేసి గంటలకొకసారి పానం చేస్తే గ్రహిణి రక్తగ్రహిణి నివృత్తిస్తాయి.

13. నాలుగు లేక అయిదు గోధుమ గింజల ఎత్తు జాజికాయచూర్ణాన్ని నేతిలో దోరగా వేయించి—అరగోధుమగింజ ఎత్తు నల్లమందు అందులో కలిపి—రోజూ మూడు పూటలా మూడు లేదా నాల్గు రోజులు సేవిస్తే గ్రహిణి, రక్తగ్రహిణి కడతాయి.

14 గ్రహిణి, రక్తగ్రహిణితో తీసుకుంటున్నవాళ్ళు తగిన పథ్యం చెయ్యాలి. తియ్యదానిమ్మపళ్ళు, నేరేడు పళ్ళు, అరటి పళ్ళు, ఉసిరిక పళ్ళు తింటూంటే రోగం శీఘ్రంగా నయమవుతుంది. పాలగుండజావ, సగ్గుజావ త్రాగడం మంచిది.

[పిల్లలకిచ్చే మోతాదు వయస్సున కనుగుణంగా తగ్గించాలి.]

**సేకరణ ఆకుండి నారాయణమూర్తి**



కోవడం, అవివేకం.'

'అదృష్టం వున్నప్పుడు'

'అదృష్టం అనేదిఉంటే వాళ్ళు చెప్పినప్పుడు వరించి కాకపోతే ఏరిమేస్తుందా? ప్రతివారికి అదృష్టం వరిస్తే, దురదృష్టవంతులే కరువైపోతారు. వాళ్ళు నిజాన్ని చెబుతున్నారంటే అంతే కదూ మరి.'

'నిజం అయినా కాకపోయినా, నిరాశ నిండిన మనిషికి ఓదార్పు, రేపటిమీద ఆశ కల్పించటం.'

'ఓవిధంగా నేరమే. రేపటి గురించి కలలుకంటూ మురిసిపోయే రాఘవలాంటి వాళ్ళు చాలామంది వుంటారు. వాళ్ళు అనుకున్నది రేపు కానప్పుడు, ఎదురయ్యే పరిస్థితులకు తట్టుకోగలరా? జోస్యాన్ని నమ్మి కలలుకనే బలహీనత వున్నవాళ్ళెవ్వరు అనుకున్న వనుకున్నట్టు జరగక విపరీత పరిస్థితులెదురైతే తట్టుకోగలరా? రేపటి మీది ఆశ, నేడు మనిషిని పొంగించినా, రేపు క్రుంగించదన్న నమ్మకమేమిటి? అలాంటప్పుడు, ఆ బలహీనులకు చేయూత యిచ్చేది ఎవ్వరు?'

రాఘవది మరీ సున్నితమైన మనసు. అమాయకత్వం, మూర్తీభవించినట్టువుండే రాఘవ, రేపు ... రేపు అనుకున్నది జరగకపోతే ఎంత బాధపడతాడో అనుభవంమీద తెలుసుకున్న జానకి లోలోపలే ఎంతో బాధపడిపోయింది.

రాఘవ, జోస్యాన్ని వెర్రిగా నమ్మడం జానకికి ఇష్టం లేకపోయింది.

మర్నాడు రాఘవ ఆఫీసునుండి వస్తూనే మరో వార్త చెప్పాడు.

'జానకీ! నాకు ప్రమోషన్ గ్యారంటీ: తప్పక వస్తుంది. ఇవాళ ఆఫీసుకు ఓమూగి అతను వచ్చాడు. అతను కూడా అలాగే చెప్పాడు.'

'మీ కొక్కరికే చెప్పాడా? ప్రమోషన్ వస్తుందని?' అంది జానకి.

'వెంకట్రావు రామారావు యింకా యిద్దరి ముగ్గురు చూపించుకున్నారు: వాళ్ళకుకూడా చెప్పాడట. అయినా వాళ్ళ మొహం! సర్వీసు, సినియారిటీ లేనివారికి ప్రమోషన్ ఎలా వస్తుంది?' అన్నాను

తనకే తప్పకుండా వస్తుందన్న ధీమాతో.

'ఏం? అతను చెప్పినప్పుడు, మీకు వచ్చి, వాళ్ళకెందుకు రాదూ?' మాటగా జానకి అడగడంతో,

'ఆహా...రాదని కాదు. ఇప్పుడుమాత్రం వచ్చేది నాకే. ఆ తర్వాత బహుశా వాళ్ళకు రావచ్చు.'

'ఏమో! వాళ్ళకే వస్తుందేమో!'

'అంటే......నాకు రాదనా?' కోపంగా అడిగాడు రాఘవ.

'వాళ్ళకి రాకూడదనా?'

'ఏమిటి జానకి! నువ్వు మరీ అన్యాయంగా ఆలోచిస్తావ్. వాళ్లకు సర్వీస్ సీనియారిటీ లేదు. నాలాగా సిన్సియర్ వర్కర్లు కారు.'

'అందరూ తమ గురించి అలాగే అనుకుంటారు.'

'ఈ విషయంలో నేనేం నాగురించి గొప్పలు చెప్పడం లేదు. అయినా నువ్వు ఇలా ఎందుకు మాట్లాడుతున్నావో నా కర్థం కావడం లేదు.' అన్నాడు చిన్నబోతూ.

జానకికికూడా అలామాట్లాడ్డం ఇష్టం లేదు కాని...భర్తకుతోడుగా తాను సంబరపడితే, రాఘవ అమాంతం కళ్లు తెరిచే కలలు కంటుంటాడు, అని జానకికి బాగా తెలుసు. అందుకే భయం కూడా.

'చూడండీ! ఈనాడు ఆఫీసుల్లోనే కాని వ్వండి, మరెక్కడా కానివ్వండి, సిన్సియర్‌గా చేసే వర్కు కాని, సీనియారిటీ కాని కాదు; పలుకుబడో, లంచమో కావాలి అలాంటప్పుడు మీరు అమాయకంగా సర్వీస్ లేదని, వర్కు చేయరని, రాదని ఎందుకను కుంటారు. మీ మాట ప్రకారం, జోస్యం నిజమే అయితే ప్రమోషన్ అందరికి వస్తుంది. లేకుంటే ఎవ్వరికి రాదు. అంటే జోస్యం అబద్ధం అన్నట్టేగా.'

'అంటే'—కోపంగా అడిగాడు రాఘవ.

'మీరు అమాయకంగా ఆలోచిస్తూ, వాడి మాటలు, వీడి మాటలు పట్టుకొని ఊరికే మనస్సు పాడు చేసుకోకండి...' జానకి మాటలు పూర్తి కాకముందే రాఘవ విసురుగా బయటికి వెళ్ళిపోయాడు.

'ప్చ్......ఎంత అన్యాయం, అక్రమం' అంటూ గొణుక్కున్నాడు రాఘవ.

రెండు రోజులుగా ముభావంగా వున్న భర్తతో ఏం మాటాడలేక ఊరుకొంది జానకి. ఆనాడు రాఘవ, ఆఫీసు నుండి వస్తూనే గదిలో కూర్చొని అలా అనడంతో మౌనంగా విని, వినవట్టే ఊరుకొంది.

'చూసావా జానకీ! ఎంత పని జరిగిందో!' అన్నాడు. తలెత్తి ఏమిటన్నట్టుగా చూసింది.

'వెంకట్రావు ఆఫీసులో చేరి రెండు సంవత్సరాలేగా అయ్యింది. వాడికి ప్రమోషన్ వచ్చింది. వాడసలు ఒక్క లెటర్ స్పెల్లింగ్ తప్పులేకుండా రాయలేడు. కాని' అంటూ నిట్టూర్చాడు. జానకి మాట్లాడలేదు. ఓ సారి భర్త మొహంలోకి చూసి వెళ్ళిపోయింది.

రాత్రి భోజనాలప్పుడు సగం తినీ తినకుండా పళ్లెంలో నీళ్ళు పోసి వెళ్లిపోతున్న భర్తను చూసి చాలా బాధ పడిపోయింది జానకి.

జానకి గదిలో కెళ్లేసరికి, కిటికీకి దగ్గరగా కుర్చీ లాక్కొని కూర్చొని ఏదో ఆలోచిస్తున్నాడు రాఘవ. అతని మొహంలో బాధ, నిరాశ, స్పష్టంగా కన్పించాయి జానకికి. దగ్గరగా వెళ్లి అడిగింది— 'అలా వున్నారేం?' రాఘవ మాట్లాడలేదు. రెండోసారి లాలనగా అడిగినా లాభం లేకపోయింది.

'జానకీ! నన్ను విసిగించక వెళ్లు!'






అన్నాడు. జానకి మరింత రెట్టించి అడగ లేక వెళ్లిపోయింది.

అర్ధరాత్రి లేచి కూర్చుంది జానకి. చీకట్లో రాఘవ యింకా అలా కుర్చీలో కూర్చొని వున్నాడు. ఆలోచనలలో మునిగి, లేచిన జానకిని గమనించని రాఘవ, హఠాత్తుగా లైటు వెలగడంతో ఉలిక్కిపడి తల తిప్పి చూసాడు.

'మీరింకా పడుకోలేదా ?' అంది దగ్గరగా వెళ్లి.

'నిద్ర రావడం లేదు జానకీ !' చాలా మెల్లగా అన్నాడు రాఘవ.

'ఏందుకు ? వొంట్లో బావుండలేదా ?' అంది అసలు విషయం తెలిసినా.

జానకి ప్రశ్నకు నవ్వేమా, 'వొంట్లో కాదు — మనసు బావులేదు. అసలు......ఈ బ్రతుకే బావులేదు జానకి' అన్నాడు నిరాశగా.

## ఈ బ్రతుకు చాలు !

అతని మాటల్లోని అర్థం తెలుసుకొని, నిరాశ వర్షం చేసుకొని నిలువునా భయపడిపోయి, అంతలోనే మామూలుగా అయిపోయింది జానకి.

'జానకి ! అంతా అన్యాయం. ప్చ్. తెలిసికూడా నేనెందుకలా వెర్రిగా ఆశించానో అర్థం కావడంలేదు. నువ్వు చెబుతూనే వున్నా. పిచ్చినమ్మకాలతో ఏన్ని ఊహించుకొని, ఎన్నెన్ని ఆశలు అల్లుకున్నాను. ఓహ్ ... ఛ ... వెధవ బతుకైపోయింది.'

చటుక్కున రాఘవ నోటిని మూసేసింది జానకి.

'నిరాశను ఎదుర్కొనే శక్తి వున్నప్పుడే ఆశను పెంచుకోవాలి. ఈనాడు కలలుకనే క్షణం రేపు పరిహసిస్తుంటే, కోరింది అందలేదనే బాధకంటే ఈ పరిహాసమే, పరిహసించే ఆ క్షణమే భరించడం కష్టమైపోతుంది. అందుకే.'

'నిజమే జానకి! కాని...' అని ఒప్పుకుంటూనే, కాసేపు మౌనంగావుండి 'అసలేం జరిగిందంటే —'

'వద్దు ! నాకేం చెప్పొద్దు! నాకర్థమైంది ఒక్కటే — 'రేపు' లేదనికాదు. వుంది. ఉండాలి. ఉండాలని ప్రతిమనిషి కలలు కనాలి. కాని ఆ కలలు పరిధిని మించక అవధిని దాటనంతవరకే క్షేమకరం. కాని... ఆ పరిధినిదాటి, పిచ్చినమ్మకాలతో, చదువుకున్న చదువును సైతం మరచి, వాటికి చేయూతనిచ్చి, ప్రాణం పోసి, రంగుల్లోచూస్తే, ఆ తరువాత ఎదురయ్యే పరిస్థితులు మనిషిని నిరాశా వాదిగానే కాదు, ప్రాణంవున్న శవంగా మారుస్తాయి. అందుకే మీలో ఆ బలహీనత వుండకూడదు.

నిరాశను ఎదుర్కొనే ధైర్యం కలిగి వుండటమే ఆశించడానికి పెద్ద అర్హత, అనుకున్నది, ఆశించినది అందినా, అందకున్నా, చలించకుండా వున్నంతకాలం బ్రతుకు ఏంతో అందంగా, మధురంగా తేలిగ్గా వుంటుంది' అంది జానకి.

'చూడండీ ! మనకేం లోటని వెధవ బతుకైపోయిందంటున్నారూ? మనం ఏంతో హాయిగా, ఏన్నో కాపురాలకంటే సుఖశాంతులతో కాపురం చేసుకుంటున్నాం. కలతలులేని కాపురం మనది. కడుపునిండా తింటున్నాం. నలుగురికి పెట్టలేకపోయినా, ఎదుటివారిముందు చేయి చాచకుండా, సంసారం చితికిపోవడానికి కారణమయ్యే అప్పులులేకుండా వుంటున్నాం. మనకు పెద్ద దిక్కుగా అత్తయ్య, మనిద్దరిమధ్య బాబు వున్నారు. మనకేం తక్కువైందని ? ఏం లోటుందని ? మనం చాలామందికంటే ఏంతో హాయిగా వుంటున్నాం — కాదూ ! మనకీ బ్రతుకు చాలదూ?' అంది. జానకి, రాఘవ మొహాన్ని రెండుచేతుల్లోకి తీసుకొని అతని కళ్ళల్లోకిఅనురాగంగాచూస్తూ.

'అవును. మనకీ బ్రతుకుచాలు! నువ్వు తోడుగావున్న ఈ బ్రతుకుచాలు జానకి' అన్నాడు రాఘవ జానకి కళ్ళల్లోకి అమాయకంగా చూస్తూ. జానకి తృప్తిగా నవ్వేసింది. ●




### ప్రసన్న

(జననం: 1935) శ్రీ ప్రసన్నగారు కళాధ్యాపకులవద్ద శిక్షణ పొందలేదు. బ్రష్ పట్టుకోడం మాత్రం ఏవరి వద్దనో నేర్చుకున్నారు. వీరు దృశ్య చిత్రకారులు. అయినా 'రియలిస్టిక్ లేండ్ స్కేప్' కాలేదు. అంచేత వీరు ప్రకృతిని చూస్తూన్న సమయంలో స్కెచ్‌లు వేయరు. ఆ తర్వాత తన మనోనేత్రం ముందు మెరపులా మెరసిన ఆ యా దృశ్యాల్ని చిత్రీకరిస్తారు. హిమాలయ చిత్రమాలను రచించేరు. అందుకే వీరు రెండుసార్లు హిమాలయాలలోకి వెళ్ళేరు.



జహంగీరు ఆర్ట్ గేలరీలో 1962 లో వీరి చిత్రాలు మొట్టమొదటగా ప్రదర్శింపబడ్డాయి. ఇప్పటికి ఏడుసార్లు ప్రదర్శితమయ్యేయి. బాగా ఆలోచించడం, పాతకొత్తలు చదవడం వీరి హాబీలు.

**మేషం:**— వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి.

స్త్రీలకు — సంతోషకరమైన సమాచారం అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:**— మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారంమధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిథునం:**— వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. అనవసరమైన శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**కర్కాటకం** — వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో ప్రయాస మీద ప్రయోజనం మరో కరిది కావచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**సింహం** — వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం ఆఖరులో మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య:**— అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారంమధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో యితరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

# వారఫలం

**13–7–1973 శుక్రవారం మొదలు**
**19–7–1973 గురువారం వరకు**

**తుల** — అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం** — మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అదృష్టం అధికంగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**ధనుస్సు:**— వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మకరం** — మీరు శ్రమపడినా ఫలితం దక్కదు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారంమధ్యలో వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:**— ఇదివరకు మీరు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మీనం:**— అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

—మహేష్







# లిపి సంస్కరణ

తెలుగు ముద్రణ అమలులోనికి వచ్చిన తర్వాతనే తెలుగు లిపికి ఒక నిర్ధారణ స్వరూపం వచ్చిందంటున్నారు. బ్రవును అప్పటిముద్రణ సాంకేతికదృష్ట్యా లిపిని సంస్కరించటానికి పూనుకొన్నాడు.

ఈ రోజుకు కూడ అమలులో వున్నది ఆయనచేసిన సంస్కరణే, 'బ్రవును క్రవాడి.' అంతవరకు అక్షరం క్రింద మాత్రమే వుంటున్న క్రవాడిని ప్రక్కకు తీసుకు రావటం జరిగింది. అచ్చులో ప్రక్కన వుండటానికి మనం అలవాటు పడినప్పటికీ అక్షరం క్రిందనే మనం వ్రాస్తూ వుంటాము.

ఆయన చేసిన సంస్కరణలు కొన్ని ఈరోజు ముద్రణలో కనుపించక పోయినప్పటికీ ముద్రణ దృష్ట్యా అవి అవుసరమేమో అని అన్పిస్తోంది. 'స' 'వ' లకు 'శ' 'వ' లకు వున్న దగ్గర పోలికవల్ల స్ఫుటమయిన తేడా అచ్చులో సూచించటానికి 'స' 'వ' లకు మధ్య ఒక గీత సూచించాడు.

'ఱ' కు 'ర' వుచ్చారణలో వున్న సామీప్యాన్ని బట్టి 'ఱ' అవుసరంలేదని తాము వ్రాసిన నిఘంటువులో వాడలేదు.

తెలుగువ్రాత లిపికి, ముద్రణా లిపికి కొన్ని కొన్నిచోట్ల తేడా కన్పిస్తున్నప్పటికీ దానిని గమనించకుండానే సాగిపోతున్నాం.

'శ':—వ్రాతలిపిలో ప్రక్కగీత వునప్పటికీ, అచ్చులిపిలో ప్రక్కగీత లేకపోవటం వలన 'శ' కు 'ర'కు దగ్గరపోలిక వచ్చింది.

మొ, మ్రో, మొ, మో : — 1920 ప్రాంతంలో అచ్చయిన తెలుగుపుస్తకాలు చూస్తే 'మొ, మో'ల లాగే 'వొ' వోలు వున్నాయి.

ఈ అక్షరాలు గూడ ఒక సిద్ధాంతం మీద లేవన్నట్లు కన్పిస్తోంది. 'ఎ' కారంకు 'ఉ' కారం కలిపితే ఒకారం అవుతుందన్న సిద్ధాంతం 'మో' కు వర్తించలేదు. ఉకారం లేకుండా 'ఎ' కారంకు ఒక దీర్ఘం తోనే 'మో' అయింది. కాని వ్రాత లిపిలో 'ఒ' కారం ఈరెండు విధాలుగా వ్రాయటం అమలులో వుంది.

'ఐ' త్వం:— ఒక శబ్దంలో 'హల్లు' పైన (అచ్చు) వుంటుంది. హల్లుక్రింద వచ్చేది మరి ఇంకొక హల్లు మాత్రమే. కాని 'ఐత్వ' శబ్దంలో మాత్రమే ఈ సూత్రం వర్తించదు. ఈనాటి రచనలలో 'ఐ' త్వం అవుసరం లేకుండా గూడ వ్రాస్తున్నారు. ఏ అభ్యంతరం లేకుండానే సాగిపోతోంది.

ఈమధ్య వచ్చిన లిపి సంస్కరణ:— మోనో మిషనులకు వీలుగా క్రిందవచ్చే వత్తును అదే లయినులో కొద్దిగా ప్రక్కకు జరపడం జరిగింది.

'క్ష':—ఈమధ్య తయారయిన టయిపు మిషనులలో 'క్ష' కు బదులు 'క' క్రింద 'ష' వత్తుతో సరిపెట్టటం మనం చూస్తూనే వున్నాము.

ముద్రణవలన భాషలోవచ్చిన మార్పులు కొన్ని వున్నాయి. 'ధ':—'ద' కు 'ధ' కు తేడా చుక్కమాత్రమే. ఈమధ్య చుక్క చదివేటపుడు స్పష్టంగా కన్పించకపోవటం వలన రానురాను 'ధ'ను 'ద' గా పలకటం అలవాటు పోయి వ్రాయవల్సి వచ్చేటప్పటికి 'ధ' గానే వ్రాస్తున్నా 'కథ' 'సాధకము' మొదయిన మాటల వుచ్చారణే మారిపోయింది.

'ౘ' 'ౙ':—అచ్చులో ఈ రెండు అక్షరాలు చూపించటం కష్టం. అంటే ముద్రణ టయిపులో వీటికి గుణింతపు అక్షరాలు వుండవు. 'చ' గుణితం పైన బాడీ కట్టుకోవటం శ్రమగనుక రానురాను వాటివాడకం తగ్గిపోయి 'చ' 'జ' లనే 'ౘ' 'ౙ' లుగా వుచ్చరిస్తున్నాము.

ముద్రణదృష్ట్యా వచ్చిన లిపి సంస్కరణే కాకుండా రచయితలు, గ్రామ్యంపట్ల వున్న అభిరుచితో ఎన్నో వర్ణక్రమసంస్కరణ లను ప్రవేశపెట్టుతున్నారు. దానివలన కొన్ని అక్షరాల అవుసరంలేకుండా పోయింది వ్యాకరణరీత్యా 'వృత్తి' లో 'త'-వత్తు, 'క్రవాడి' కలిపివున్న వత్తుఅక్షరం వెయ్యవల్సి వచ్చేది. కాని ఇప్పటి రచనలకు ఆ అక్షరం అవుసరం లేదు. 'ఋ' వాడకం రానురాను తగ్గిపోతోంది. 'గుర్రము' వ్రాసినప్పటికీ బాగానే వుంది.

'ఞ' 'ఙ' ల వాడకం ఇప్పుడు లేనే లేదు. 'వెలపలగిలక' ను గుర్తుపట్టగలిగినవారు ఈనాడు ఎంతమంది వున్నారు? తలకట్టు లేని 'క్ష' వత్తు వుంటుందని తెల్సినవారు ఎంతమంది వున్నారు.

ఇన్ని మార్పులతోనూ ముద్రణ సాంకేతిక సౌలభ్యంకొరకు వచ్చిన మార్పులు రెండు మాత్రమే.

మొదటిది:—బ్రవును 'క్రవాడి.'

రెండవది:—క్రిందవచ్చే వత్తుప్రక్కకు జరగటం.

ఆనాటికివున్న చేతికంపోజింగును 'బ్రవును క్రవాడి' కొంత సౌలభ్యచేసి ఒక్కక్రవాడి నాలుగయిదు సయిజుల అవుసరం లేకుండానూ, అక్షరం క్రింద రెండు వత్తులు వెయ్యవల్సిన అవుసరాన్ని సులభంచేసింది.

క్రింద వచ్చే వత్తు ప్రక్కకు రావటం వలన టయిపులో (కంపోజింగు అక్షరాల) మూడు సయిజులు (మూడుబాడీలు) అవుసరం లేకుండా ఒకే సయిజులోనే అన్ని అక్షరాలువుండి, కంపోజింగులోవుండే 1000 అక్షరాలను సగానికి తగ్గింపబడ్డాయి.

ఈనాటి ముఖ్యావసరమయిన ముద్రణా వేగానికి, టయిపురయిటింగు అవుసరానికి గాని ఈరెండు మార్పులు సరిపోతాయా అన్నది ఇప్పటి సమస్య.

తెలుగు ముద్రణకు ముఖ్యమయిన నిరోధకాలు.

మొదటిది:— అక్షరాలసంఖ్య ఎక్కువగా

ఇబ్బందులు

రెండవది:— అక్షరం క్రింద అక్షరం రావటం.

అక్షరాల సంఖ్య తగ్గించవలసిన అవసరం వుందన్నది ఏకాభిప్రాయమే. కాని ఎలా తగ్గించాలి అని ఆలోచనకుముందు అసలు అక్షరాలు ఎలా వచ్చినాయో తెల్పుకోవల్సివుంది.

ముద్రణ దృష్ట్యా:— హల్లులు 36 ప్రతిహల్లుకూ గుణింతాలు 12 $12 \times 36 = 432$. ఈ 432 హల్లులకు క్రింద వత్తులు వేసుకొనేందుకు వీలుగా వేరే వరుస (అఫ్‌బాడి) లో తయారుచేయబడ్డ అవే అక్షరాలు 432 అంటే హల్లులు 864.

| | |
|---|---|
| అచ్చులు | 19 |
| ప్రక్కన వచ్చే వత్తులు | 20 |
| క్రిందవచ్చే వత్తులు | 28 |
| తెలుగు, ఇంగ్లీషు అంకెలు | 20 |
| విరామ చిహ్నాలు | 15 |
| గుర్తులు | 14 |
| స్త్రీ, శ్రీ అక్షరాలు, స్పేసులు, క్వాడ్సు మొ. | 20 |
| | 1000 |

వాడుకలో లేకపోయినవి పోగా ఈరోజుకి ముద్రణలో మిగిలిన అక్షరాలు 1000. ముఖ్యముగా ఇక్కడ గమనించవల్సిన విషయం ఇంకొకటి వున్నది.

హల్లుల 36 కు గుణింతపు గుర్తులు తలమీద వస్తూ వుంటాయి. కనుక ముద్రణలో $36 \times 12 = 432$ హల్లులు అయినాయి.

అక్షరంక్రింద వచ్చేవత్తు ప్రక్కకు జరిగినట్లుగా సరిగా అక్షరంపైన వుండే గుణింతపు గుర్తు కొద్దిగా ప్రక్కకు జరగగలిగిన సంస్కరణ అమలులోనికి వస్తే హల్లులు $36 + 12 = 48$ అవుతాయి. అనగా 864 హల్లులు వత్తులు ప్రక్కగా జరగటంవలన 432 కు తగ్గటం, గుణింతపు గుర్తులు ప్రక్కకి జరగటంవలన హల్లులు— 48 లోనికి వస్తాయి.

ఇంకొక ముఖ్యసంస్కరణకు సూచన:— మహాప్రాణాలకు వేరేస్వరూపాలు (ఖ, ఘ, ఠ, ఝ, ధ) లేకుండా అసలు అక్షరానికే ప్రక్క గీత పెట్టటం థ, ఖలలో లాగ. ఆగీత అక్షరం ప్రక్కనే వుండాలిగాని క్రింద వుంటే అక్షరాలు తగ్గవు.

ముద్రణలో గాని టయిపింగులో గాని ముఖ్యమయిన సాంకేతిక సూత్రం:— అక్షరంకు పైనగాని క్రిందగాని ఏ చేర్పులున్నప్పటికీ అక్షరాలసంఖ్య పెరగటమే కాకుండా వేగనిరోధకంగా తయారవుతుంది.

తెలుగు ముద్రణలో ఇంకో అపహాతం వుంది. ముద్రణలో 'ప్రతీ లైనులోనూ సుమారు నాల్గోవంతు క్రింద వచ్చే వత్తులకు నిర్దేశించబడింది. కాని అచ్చయిన ఏ లైనులోను క్రిందవత్తులు ఏరెండో మాత్రమే వస్తూంటాయి. దానివల్ల ఎంత స్థలం వృధా పోతోందో మనం గుర్తించటం లేదు. క్రిందవత్తును అక్షరం లయినులోకి తీసుకరావాలని 'మల్లంపల్లి కమిటీ'వారి సూచనేకాకుండా చాలమంది వారితో ఏకీభవిస్తున్నారు. ఈ మార్పువలన ప్రజానీకానికి తక్కువధరలో పుస్తకాలు లభిస్తాయి.

ముద్రణదృష్ట్యా తెలుగు లిపిలో పెద్ద సంస్కరణలు అక్కరలేకుండా ఈనాల్గు మార్పులు చాలు.

1. గుణింతపు గుర్తులను అంద వికారము గాకుండా అక్షరం పైనుంచి ఆ లయినులోనే కొద్ది ప్రక్కకు జరపటం.

2. మహాప్రాణాలకు వేరే అక్షరాలు లేకుండా ప్రక్కగీతతో సరిపెట్టటం.

3. వాడుకలో తగ్గుతున్న అక్షరాలను తీసివేయటం.

4. క్రిందవచ్చే వత్తులను అక్షరం లయినులోనికి తీసుకోరావటం.

ఈ నాల్గు సూచనలవలన ఫలితాలు:—

1. తెలుగు లిపి ఈనాటి అవసరమయిన ముద్రణా వేగానికి, టయిపు రైటర్లకు అనువుగా 100 అక్షరాలలో యిముడుతుంది.

2. తక్కువ పేజీలలో ఎక్కువమేటరు పట్టటం, అచ్చయిన పుస్తకాలవెల సుమారు మూడవవంతు పైగా తగ్గుతుంది. చేతికంపోజింగులో అక్షరాలు కొద్దిగా ఎక్కువ వున్నప్పటికీ తేలికగావేస్తుంది. గనుక గ్రాంధిక రచనలకు చేతికంపోజింగే అమలులో వుంచుకోవచ్చును.

—కె. వి. కొండయ్య ●






**జరిగిన కథ**

నిలయ చెల్లెలు లోక. రోగంతో తీసుకుంటున్న ముసలితండ్రి ఒకడున్నాడు. సంసార బాధ్యత అంతా నిలయదే. ఆమె ఒక ఆఫీసులో పని చేస్తున్నది. ఆ ఆఫీసులోనే పని చేస్తున్న శాస్త్రిరావు ఆమెని పెళ్లాడతానన్నాడు. కాని, కుటుంబ పరిస్థితి దృష్ట్యా నిలయ అంగీకరించలేదు. లోకకి సినిమాలంటే పిచ్చి. ఆమెకి తగినవాడే మోహన్. సినిమాల్లో చేర్పిస్తానని లోకని దారి తీసుకు వచ్చాడు మోహన్. నిలయా మధూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు. కాని మధు తల్లి అందుకు సమ్మతించలేదు. వేరే సంబంధం గురించి చెప్పింది. మధు తల్లిడిల్లి యూడు. లోక గర్భవతి అయ్యాక మోసంచేసి వెళ్ళిపోయాడు మోహన్.

---

# 7

'అలా ఉన్నావేం ఝాన్సీ?'

చిన్నగా నిట్టూర్చి, ఒక్కక్షణం నిలయ కళ్ళల్లోకి చూసి తల దించుకుంది ఝాన్సీ.

'నాకో సమస్య వొచ్చి పడింది. నువ్వేమైన సలహా చెప్పగలవేమోనని వచ్చాను.' ఈ మధ్య నిలయతో మాట్లాడేటప్పుడు ఇంగ్లీషు మాటలు విరివిగా వాడటం తగ్గించింది. దానివల్ల ఝాన్సీ కబుర్లు సహజంగా అనిపించి వినగలుగుతోంది నిలయ.

'ఏమిటో చెప్పు. అయినా నీ కేం సమస్యలున్నాయి బాబూ!'

'నేనొకతన్ని ప్రేమించాను. నా స్నేహితురాలి అన్నయ్య అతను. అతను కూడా నన్ను...'

మాట మధ్యలోనే అందుకుంది నిలయ. 'ఓహో! ప్రేమ పురాణమా? మామూలు పాత కథే...'

'పెద్దవాళ్లు పెళ్లికి ఒప్పుకుంటారన్న ఆశ మాకు లేదు. అతను క్రిస్టియన్. వేరే ఊరేదైనా వెళ్లిపోదాం అంటాడతను. ఇంకా ఉద్యోగాన్వేషణలో ఉన్నాడు. ఎవరికీ తెలియకుండా ఈ ఊర్నించి వెళ్లిపోయి రిజిష్టరు మేరేజి చేసుకోడం తప్ప గత్యంతరం లేదేమో ననిపిస్తోంది నాక్కూడా. నువ్వేమంటావు?'

'అడిగావు కనక చెప్తున్నాను ఝాన్సీ. ఇటువంటి పెళ్లిళ్ళు ఎక్కడోగాని నిలదొక్కుకోవు. అత నింకా స్వతంత్రంగా సంపాదన మొదలుపెట్టనేలేదు. ఇంకా ఒక ఉద్యోగం అంటూ లేకుండానే, తన కాళ్ళమీద తను నిలబడ లేనివాడు నిన్ను వెంటేసుకుపోతే ఎలా పోషిస్తాడు? ఆర్థిక సమస్య ముందు ప్రేమ తలొంచక తప్పదు. పైగా లేచివొచ్చిన ఆడదంటే, లేవదీసుకు పోయిన మొగాడికి సైతం కొన్నాళ్ళకి అలుసైపోతే అందులో ఆశ్చర్యపోవల్సిం దేమీ లేదు. ముందే చెప్పానుగా! ఎక్కడో కొన్ని సంసారాలు మాత్రం జీవితాంతం ఏ కలతలూ లేకుండా ఉంటే ఉండవచ్చుని. సాధారణంగా తల్లిదండ్రుల కిష్టం లేని పెళ్లి చేసుకుని, వాళ్లకి దూరమైన మొగాడిలో కొన్నాళ్లకి వాతావరణం, పరిచయస్థులు కల్పి సంచలనం తెస్తాయి. ఎందు కిలా చేశాను? అన్న ప్రశ్న అతనిలో ప్రతిధ్వనిస్తుంటుంది. భార్య ఏం మాట్లాడినా, ఏం చేసినా అందులో లేని లోపాలు కనబడటం మొదలు పెడతాయి. ఫలితం...... ఇద్దరి మధ్యా సామరస్యం ఉండదు. ఏవో పెద్ద పెద్ద మాటలు చెప్పేస్తున్నా ననిఆశ్చర్య పోతున్నావా?' ఒక్కక్షణం ఆగింది నిలయ. ఝాన్సీ మాట్లాడకపోవటం చూసి మళ్లీ తనే అంది.

'పెద్దవాళ్లని ఒప్పించేందుకు మీరిద్దరూ ఎందుకు ప్రయత్నించకూడదూ! వాళ్ల చేతుల మీదుగా మీ పెళ్లి జరిగితే మీకూ మనశ్శాంతి వుంటుంది. నీ భర్తకి ముందు ముందు నువ్వు లోకువ అయ్యే అవకాశం ఉండదు. పెళ్లయిన మరుక్షణం నించీ కన్నవాళ్లతో బంధాలు తెంచుకోనక్కర్లేదు.'

'నిజమే. నువ్వు చెప్పింది బాగానే ఉంది కానీ...'

'మీ నాన్నగారి విషయంలో నా కనుమానం లేదు ఝాన్సీ. మనసులు కలిసిన మనువు కాదనే మూర్ఖత్వం ఆయనలో ఉందని నాకనిపించదు. ధైర్యం చేసి నీ మనసులో మాట చెప్పి చూడు. మారుతున్న కాలాన్ని బట్టి మనసులు మార్చుకోక తప్పదని గ్రహించగల రాయన.' ఝాన్సీ ముఖంలో వెలుగు కనిపించింది. నిలయ చేతులు పుచ్చుకుని మృదువుగా నొక్కింది. 'నా కిప్పుడు కొంచెం మనశ్శాంతిగా ఉంది. ధైర్యం చేసి నాన్నగారితో చెప్పడానికి ప్రయత్నిస్తాను' అంటూ చిరునవ్వుతో వెళ్లిపోయింది ఝాన్సీ.

*  *  *

'అలా తిరిగొద్దాం రా!'

'నేను రాను'

'ఏం ఎందుకు రావు? ఇద్దరం కల్సి ఎన్నిసార్లు వెళ్లలేదూ షికారుకి. ఇవాళేమైంది?'

'ఇప్పుడు బుద్ధి వచ్చింది కనకనే రావటం లేదంటున్నాను. మీరు వెళ్లండి.'

'నేను వెళ్లలేక నిన్ను రమ్మనట్లేదు. సరదాగా ఇద్దరం వెళ్దామని రమ్మంటున్నాను.'

'రాను. నేను ఆడదాన్ని మొగాడిలా బయట షికారుకి వెళ్లకూడదని యివాళే తెల్సుకున్నాను.' అక్కడే కూర్చున్న

మిత్రదమ్మ వైపోసారి చూసి లోపలికి వెళ్ళి పోయింది వరలక్ష్మి.

జరిగిన భాగోతమేమిటో ఊహించుకోగలిగాడు భాస్కర్రావు. ఆడివాళ్ళు బయటికి వెళ్ళడం గురించి అయిష్టంగానూ, కోపంగానూ తల్లి ఏదో అని ఉంటుందనీ, అందుకే బాధతో వరలక్ష్మి రానంటోందనీ అర్థంచేసుకున్నాడు.

'ఛీ! వెధవకొంప. పెళ్ళికానంతవరకూ 'పెళ్ళిచేసుకో' మని చెవిలో పోరు. చేసుకున్నాక సుఖం, శాంతీ లేకుండా చెయ్యడం.' చిరాకుగా చెప్పుల్లో కాళ్ళు దూర్చి బయటికి నడిచాడు. ఎక్కడికి వెళ్ళాలో ఏమిటో ఆలోచన లేకుండానే నడక సాగించాడు. విసుగుతో చిరాకుతో తలనెప్పి మొదలైంది. హఠాత్తుగా తనే వీధిలో నడుస్తున్నాడో గమనించాడు. మరో పది అడుగుల్లో ఉంది విజయ ఇల్లు. పోనీ కాసేపు వాళ్ళింట్లో కూర్చుంటే...తనకీ కాస్త మార్పు...ఒంటరిగా నా అన్నవాళ్ళు లేకుండా ఉంటున్న మనిషి. ఏదో కాస్త కాలక్షేపం...పైగా ఏదో యోగక్షేమాలు కనుక్కున్నట్టూ ఉంటుంది...కానీ ఏమీ అనుకోదు కదా! ఏమనుకుంటుందీ? ఏదో స్నేహితుడిగా కాసేపు కబుర్లు చెప్పొడనుకుంటుంది...అంత కంటే ఏమనుకుంటుందీ!

చిన్నగా శబ్దం చేస్తూ తలుపు కొట్టాడు.

'ఎవరూ!' అంటూ తలుపు తీసిన



## విడిన మబ్బులు

నిలయ భాస్కరరావుని చూస్తూనే కొద్దిగా ఆశ్చర్యపడిన మాట నిజం.

'రండి' అంటూ పక్కకి తప్పుకుని దోవ ఇచ్చింది.

'ఆశ్చర్యపోతున్నారా! ఇలా వొచ్చినందుకు' అంటూనే నిలయ చూపించిన కుర్చీలో కూర్చున్నాడు.

'అబ్బే! ఆశ్చర్యమెందుకూ?'

'కారణం ఏం లేదులెండి. ఊరికే తోచక బయల్దేరినవాడిని ఇలా మీ ఇంటి కొచ్చాను.'

ఐదు నిమిషాల తర్వాత లోపలికి వెళ్ళి కాఫీ కలిపి తీసుకొచ్చింది.

'నే నిప్పుడే తాగి బయల్దేరాను' అన్నాడు భాస్కరరావు మీ రనవసరంగా శ్రమ తీసుకున్నా రన్నట్టుగా చూస్తూ.

'బాబోయ్! తాగొచ్చారా?' వేళాకోళం చేస్తూ నవ్వింది నిలయ.

తనుకూడా ఆ నవ్వులో శృతి కలిపాడు భాస్కరరావు.

అప్పుడే ఇంట్లోంచి బయటికొచ్చి వీక్కడికో వెళ్తున్న విశ్వనాధంగారికి వీ ళ్ళిద్దరి నవ్వులూ వినిపించాయి. కిటికీలోంచి భాస్కరరావు కనపడ్డాడు కూడా. పళ్ళు పటపట కొరుకుతూ ఇంటివైపే చూస్తూ ముందుకి నడిచారు. అది గమనించిన నిలయకి ఆ క్షణంలో తన ఒంటరి బ్రతుకుమీద చెప్పలేని కోపం పుట్టింది. నా అనే వాళ్ళుగానీ, మరో తోడుగానీ ఇంట్లో లేకపోతే ఆడదాని జీవితం ఎంత దుర్భరమవుతుందో మరింత బాగా అర్థమవుతోం దనిపించింది. కాసేపు కబుర్లు చెప్పిన తర్వాత 'తలనెప్పితో మీ ఇంటి కొచ్చాను. ఇప్పుడు పూర్తిగా తగ్గిపోయింది. ఏ మందూ అవసరం లేకుండానే. వస్తాను మరి.' అంటూ లేచాడు భాస్కరరావు. అతను వెళ్ళగానే వీధి తలుపు గడియవేసి వంటింట్లోకి నడిచింది నిలయ. ఆలోచనలు ఈగల్లా ముసురుకున్నాయి. భాస్కరరావిలా తనింటికి వొచ్చి వెళ్ళినట్టు తెలిస్తే ఆఫీసులో వాళ్ళు తనని ఈ మాత్రంగానైనా బతకనిస్తారా? ఇప్పటికే ఎన్నో మాటలు భరించాల్సి వొస్తోంది. లేనిపోనివి ఊహించుకుని తామిద్దర్నీ కలిపి ఏవేవో అంటూనే ఉన్నారు. ఇలా రాకపోకలు కూడా సాగించాడంటే ఇంకీ ఉద్యోగం చెయ్యడమే కష్టమవుతుంది. భగవాన్! ఎందుకిలా పరీక్షిస్తావు...మధు తనింటికి వొచ్చినా, తిరిగినా ఇరుగు పొరుగువాళ్ళ మాటలు తను అంతగా లక్ష్యపెట్టలేదు. కారణం... అతను తనని ప్రేమించాడు. పెళ్ళిచేసుకుంటా నన్నాడు. అందుకని తా మిద్దరూ ఒకటి కాబోతున్నప్పుడు లోకుల మాటలకి భయపడటం అనవసరం అనిపించింది. కాని...భాస్కరరావు...పెళ్ళయినవాడు. ఒక్క స్నేహమే తప్ప ఏ ఇతర భావమూ తమ మధ్య లేకపోయినా కూడా అనవసర అపోహలతో అతని కుటుంబంలో కలతలు రేగడానికి అవకాశం ఉంది...భగవంతుడా! ఎందు కిలాంటి పరీక్షలు పెడుతుంటావు! మధుని పెళ్ళాడి అతని కుటుంబంలో కలతలు రేపటం ఇష్టంలేక, అతని ఉత్తరాలకి జవాబు లివ్వకుండా గుండె రాయిచేసుకోవల్సి వచ్చింది. పాపం! ఎంత బాధపడుతున్నాడో మధు. 'ఇంతలోనే ఇలా ఎందుకు మారిపోయింది నిలయ. నన్ను మర్చిపోయిందా' అని ఎంతగా కుమిలిపోతున్నాడో ఏమో! కానీ...తప్పదు ..మధు తనని మర్చిపోవాలి. ఆతర్వాత పెళ్ళాడి, కన్నవాళ్ళకి దూరంచేసే కంటే తను దూరంగా తప్పుకోడం మంచిది. ఏదో నాల్రోజులు బాధపడినా తర్వాత కాలక్రమేణా మర్చిపోయి తన అంతస్తుకి తగ్గ అమ్మాయిని పెళ్ళాడి ఏ గొడవా లేకుండా హాయిగా ఉంటాడు.'

పకపకా ఎవరో నవ్వినట్టయింది నిలయకి. తన మనసే తనని పరిహసిస్తున్నట్టు గ్రహించడాని కెంతోసేపు పట్టలేదు.

'పిచ్చిదానా! నీ అంత తెలివితక్కువ వాళ్లెవరూ ఉండరు. అందిన అదృష్టాన్ని కాలదన్నుకునే నీబోటి వాళ్ల నేమనాలి ? ఇంత మంచిగా ఆలోచించే నీ బోటి వాళ్ళకి జరిగే మంచేమీ ఉండదు. ఎవరి కోసమో నీ ప్రేమని త్యాగం చెయ్యాలనుకోవడం అవివేకం కాదూ!'

బాధగా కణతలు నొక్కుకుంది నిలయ. 'కాదు. అవివేకం కాదు......ముమ్మాటికీ కాదు. జీవితం సాఫీగా సాగడానికి, లేనిపోని సమస్యలు తలెత్తకుండా ఉండడానికి తను

నిశ్చయించుకున్న పద్ధతి సరి అయినదే. అంతకంటే మరో మంచి మార్గం లేదు. అతన్ని పెళ్ళాడితే, డబ్బుకోసం అతన్ని వల్లో వేసుకుందన్న నింద వచ్చినా రావచ్చు తనకి. కానీ...కానీ మధుకే తన మనస్సు అంకితమై పోయింది. మధునితప్ప మరెవరినైనా తను పెళ్ళి చేసుకోగలదా? అసంభవం...జీవితాంతం ఇలాగే ఉండిపోవాలి... పెళ్ళి గురించి ఆలోచించకూడదంతే.' కిటికీలోంచి చల్లని గాలి వీస్తున్నా కూడా ఆలోచనల వేడితో నిలయ ఒంటి మీద చెమట్లు పోశాయి.

మర్నాడు ఆఫీసులో అడుగుపెడుతూనే 'రామనాథంగారి భార్య కిరసనాయిలు పోసుకుని అంటించుకు చచ్చిపోయిందన్న' పిడుగులాంటి వార్త వింది నిలయ.

'ఎంత నరకయాతన అనుభవిస్తుండకపోతే అటువంటి పనిచేస్తుంది చెప్పండి' నెమ్మదిగా అన్నాడు భాస్కరరావు

'అంటే!' అంది నిలయ కళ్ళు పైకెత్తి మరింత ఆశ్చర్యంగా.

చిన్నగా నవ్వాడు భాస్కరరావు 'ఓ! మీకాయన గురించి పూర్తిగా తెలియదు కదూ అందుకే ఆవిడ ఆత్మహత్యకంత ఆశ్చర్యపోతున్నారు. నేనీవార్త విని కొంచెం కూడా ఆశ్చర్యపోలేదు సుమండీ! మీకు రామనాథంగారి గురించి తెల్సింది చాలా తక్కువ. ఇంట్లో రాక్షసుడండీ ఆయన. భార్యని ఒక పురుగుకింద చూస్తాడు నోరెత్తితే పిల్లల్నీ, పెళ్ళాన్నీ చితకతంతూ ఉంటాడు. జల్సాలకేం తక్కువ లేదండీ. తనిష్టం వొచ్చినట్టు ఖర్చుపెట్టి కోరికలు తీర్చుకుంటుంటాడు. వొచ్చే జీతం అంతా ఆయనే తగలేస్తుంటే ఇల్లునడపడం ఆవిడగారి తరంటండీ! ఆవిడ కుక్కిన పేనులా పడుండాలి. ఇవేవిటిలా చేశారని అడగటానికి వీల్లేదు. ఊళ్ళో ఆయనగారికో ప్రియురాలు కూడా ఉందిలెండి వొచ్చే జీతం ఏమూలకండీ అటువంటివాడికి. వెనకాల ఆస్తులా ఏమన్నానా? ఆ ఒక్క పాతకొంప తప్ప మరేదీ లేదయ్యె వెనక. పిల్లలకి సరైన తిండీ బట్టా లేకపోయె ఒకళ్ళా ఇద్దరా వరసగా ఆరుగురాడపిల్లలు. దినదినగండంగా ఇన్నాళ్ళా నెట్టుకొచ్చింది ఇలాగు. ఇంకెన్నాళ్ళు చెయ్యగలదా సంసారం'

'అయినాకూడా ఆవిడీపని చెయ్యకుండా ఉండాల్సింది.' నిట్టూర్చింది నిలయ.

'భలేవారే! అలా అంటారేమిటి అంతా విని కూడా!

'ఔనండీ ఆవిడ పోవడంవల్ల పిల్లలకి తల్లి రక్షణకూడా కరువైపోతుంది కదా! పైగా ఆవిడ లేకపోవడంతో ఇంకా విచ్చలవిడిగా ప్రవర్తించడానికి మార్గం చూపినట్లయింది కదా ఆ మహానుభావుడికి.'

'నిజమే!' తల పంకించాడు భాస్కరరావు.

'మనదేశంలో ఇటువంటి కథలు అంతమయ్యే దెప్పుడో!' నిస్పృహగా తనలో అనుకుంటూ తన సీటువైపు నడిచింది నిలయ.

కాలం ఎవరికోసమూ ఆగకుండా పరిగెత్తుతూనే ఉంది. రామనాథంగారు పెట్టిన సెలవు పూర్తయిపోయింది. ఆఫీసుకొస్తున్నారు. ఆయన్ని చూసి ఆశ్చర్యపోయింది నిలయ. భార్యపోయి అప్పుడే చాలా ఏళ్ళయినట్టుందాయన ప్రవర్తన. క్రింది గుమాస్తాలతో ఎక్కువగా జోకులేసి మాట్లాడుతూ పెద్దగా నవ్వుతున్నారు.

'భార్యా - అనే చిన్న అడ్డుకూడా తొలిగి పోయింది. ఇంక నాకు పూర్తి స్వేచ్ఛ దొరికింది' అన్నట్టుందాయన తీరు. ఇది వరకులేని కాంతి, ఆనందం ఆయన మొహంలో స్పష్టంగా కనిపిస్తోంది.

* * *

లోపలికి వస్తూనే 'నీ ఋణం తీర్చు టకే తీర్చుకోలేను నిలయా!' అంటూ నిలయ చేతులు రెండూ గట్టిగా పుచ్చు కుంది ఝాన్సీ.

'ఏమిటి సంగతి' నవ్వుతూ ఝాన్సీని మంచంమీద కూర్చో పెట్టి తానుకూడా పక్కనే కూర్చుంది నిలయ.

'నీ ఋణం ఎప్పటికీ తీర్చుకోలేను నిజం.'

'అబ్బ! అసలు సంగతి చెప్పకుండా మాటిమాటికీ ఋణం అంటావేమిటే?' చిరుకోపంతో చిన్నగా నవ్వింది నిలయ.

'నీ సలహావల్లే నేను అమ్మా నాన్నలతో జాన్ గురించి చెప్పడం, నాన్నగారు జాన్ వాళ్ళింటికి వెళ్ళడం జరిగింది.'

'నాన్నగారు వెళ్ళారా, వాళ్ళింటికి' నిలయ గొంతులో ఆత్రుత ధ్వనించింది.

'ఆ! వెళ్ళడం రావడం అన్నీ అయ్యాయి' చిన్నగా నిట్టూర్చింది ఝాన్సీ.

'జాన్ నాన్నగారు మా పెళ్ళికి ఒప్పుకో లేదుట. 'నాతో మాట్లాడనవసరం అవసరం లేదు. మా నాన్నగారితో మాట్లాడండి. ఆయనేం చెప్తే అదే నా ఉద్దేశం కూడా' అంటూ తప్పించుకుని బయటికి వెళ్ళి పోయాడుట జాన్.'

ఆశ్చర్యంతో నోట మాట రాలేదు నిలయకి.

తలొంచుకుంది ఝాన్సీ. 'నువ్వే నా ప్రాణం అన్నట్టు అంత ఇదిగా మాట్లాడిన జాన్ నిజ స్వరూపం తెలిశాక అటువంటి వాడిని నమ్మినందుకు సిగ్గుతోనూ, బాధతోనూ కుమిలి పోతున్నాను.' ఝాన్సీ కళ్ళల్లో తళుక్కున మెరిశాయి నీళ్ళు.

'జాన్ మాటలు నమ్మి, అతను ఎక్కడికి తీసికెళ్తే అక్కడికి వెళ్ళి ఉంటే నా గతి ఏమయ్యేదో! నాలుగు రోజులు మోజు చూపించి ఆ తర్వాత ఏ కానిఊళ్ళోనో వన్నొంటరిగా వొదిలేసి వెళ్ళి పోయేవాడు. నా గతి అధోగతి అయ్యేది. ఎంతో మంచి వాడని నమ్మాను. నేనంటే అతనికి ప్రాణ మనుకున్నాను. నిన్ను సలహా అడగటం మేలైంది, జాన్ అసలు తత్త్వం బయట పడింది. అందుకే నీ మేలు మర్చిపోలేనంటు న్నాను. నాన్నగారింటికొచ్చి సంగతి చెప్ప గానే అమ్మ ఏమందో తెల్సా? 'క్రైస్తవు లబ్బాయిని అల్లుడిగా తెచ్చుకుందుకైనా మనం ఒప్పుకున్నాం, సరిపుచ్చుకున్నాం కానీ వాళ్ళు మాత్రం వాళ్ళ కులం కాని అమ్మాయిని చేసుకుందుకు ఒప్పుకోలేదు చూశావా' అంది.'

కాసేపయ్యాక మెల్లగా అంది నిలయ 'అయినా నువ్వే కష్టనష్టాలకి గురి కాక ముందే దేవుడు చల్లగా చూసినందుకు నాకూ సంతోషంగానే ఉంది. అన్నీ మన మేలుకే అనుకుని సంతృప్తి పడాలంతే. ఇంక అతన్ని నీ మనసులోకి రానివ్వకు. మర్చిపోడానికి ప్రయత్నించు. అది అంత తేలిక కాదు. కానీ తప్పదుగా మరి!'

చిన్నగా నవ్వడానికి ప్రయత్నించింది ఝాన్సీ. ఆ నవ్వులో జీవం లేదు. 'నా కొకటే అనిపిస్తోంది. ఈ మగాళ్ళని నమ్మడ మంత బుద్ధి తక్కువ ఇంకోటిలేదు. అసలు పెళ్ళే చేసుకోకూడదు.'

'పెళ్ళి చేసుకోకుండా ఒంటరి బ్రతు కడమే మాత్రం తేలికనుకుంటున్నావా?'

'భగవాన్!' నిట్టూర్చింది ఝాన్సీ. 'నువ్వెన్నయినా చెప్పు. మనసిచ్చిన నాబోటి దానికే తెలుస్తుంది ఈ బాధ.'

'పిచ్చిపిల్లా నీకుతోడు నేనూ ఉన్నాను. రోజూ మనసులో తుఫాను రేగుతున్నదాన్ని.' లోలోనే అనుకుంది నిలయ.

'జాన్ స్వభావం తెల్సిపోయాక అతని మీద ఎంత కోపంగా ఉందో చెప్పలేను. కానీ అలా అని అతన్ని పూర్తిగా మర్చిపో గల శక్తి లేదు నాకు. మనసారా ఆరాధించిన మనిషయ్యే. హృదయంలో తిష్ట వేసుకున్న రూపమయ్యె! నాన్నగారు గట్టి ప్రయత్నం చేసి తొందర్లోనే ఏదో ఒక సంబంధం తీసుకొచ్చేస్తారు.'

'మంచిదేగా! త్వరలోనే...'

'నువ్వూ అలాగే అంటావా?'

'మరింకేమనాలి? పిచ్చిపిల్లా కాలం మాన్పలేని గాయం ఉంటుందంటావా?'

'అంతేనా' జాలిగా చూసింది ఝాన్సీ.

ఇద్దరూ కాసేపు ఎవరి ఆలోచనల్లో వారుండిపోయారు.

'నిలయ చెప్పినట్టు కాలం మాన్పలేని గాయం ఉండదేమో! అసలైనా జాన్ యెటువంటి వాడో తెల్సిపోయాక, అతనికి తనమీద మోజే తప్ప ప్రేమ లేదని తెలిశాక కూడా అతని కోసం ఎందుకు బాధ పడాలి తను. అతన్నే తల్చుకుంటూ మిగిలిన జీవితమంతా ఎందుకు కుమిలిపోవాలి?' ఝాన్సీ మనసు వేగంగా పరిపరి విధాల ఆలోచిస్తోంది.

'కాలం మాన్పలేని గాయం ఉండక పోవచ్చు. ప్రేమించిన వాడిని మర్చిపొమ్మని ఝాన్సీకైతే సలహా ఇవ్వగలిగింది గానీ ఆ పని తను చెయ్యగలదా! అమ్మో! తల్చుకుంటేనే గుండెనలిగే బాధ... మధు ఎంత మంచివాడు? మధుని చేసుకోలేకపోతే మరొకర్ని చేసుకోడం అన్నది అసంభవం. మధు కంకితమైన మనసు మరొకరికి అర్పించడ మన్నది కల్ల. కన్యగా ఒంటరిగానే ఈ జీవితం ఎన్ని బాధలైనా పడి నెట్టుకు రావాలి తప్ప మధుని ప్రతిష్ఠించుకున్న ఈ హృదయంలో మరొకరికి స్థానమివ్వడం జరగదు. అంతే...'

ముందుగా ఆలోచనల్లోంచి తేరుకున్న ఝాన్సీ నిలయని తట్టి పిల్చింది. 'ఏమిటో పిలిచినా పలకకుండా అంత దీర్ఘాలోచనలో పడ్డావు.'

'అబ్బే! ఏం లేదు!'

'అనవసరంగా నా గొడవతో నీ మనసు కూడా కష్టపెట్టినట్టున్నాను.'

'అదేం కాదు.'

'సరే! మరి నే వెళ్తాను.' అంటూ లేచింది ఝాన్సీ.

* * *

ఆ రోజు కావల్సిన సరుకులు కొను క్కుని దగ్గిర దోవన ఇంటిముఖం పట్టింది నిలయ. కొంచెం దూరం నడిచేసరికి ఒక పెంకుటింటి వరండాలో విసురుగా అటూ యిటూ పచార్లు చేస్తున్న రామనాథంగారు కనపడ్డారు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్న ట్టుందాయన మొహం. నిలయని రోడ్డుమీద చూస్తూనే పరుగులాంటి నడకతో రోడ్డు మీద కొచ్చారాయన.

'రక్షించారు. మీరు కనపడ్డారు. ఒక్కసారి లోపలికొస్తారా?' విస్తుపోయింది నిలయ.

'మా పెద్దమ్మాయి నేను ఆఫీసునించి వొచ్చేటప్పటికి ఏడుస్తూ కూర్చునుంది. ఏమిటి కారణం అంటే మాట్లాడదు. ఎంతసేపడిగినా ఏమీ చెప్పట్లేదు. ఏం చెయ్యాలో తోచక, దాని దగ్గిర్నుంచి వస్తూ

ధైర్యం రాక చస్తున్నాను: నేనంటే చెప్పే భయం లేదు దానికి. అందుకనో ఏవిటో కారణం చెప్పట్లేదు భయపడుతోంది. ఆడ వాళ్ళతో అయితే చెప్తుందేమో! కాస్త దాన్ని ఊరుకోబెట్టి అసలు సంగతేమిటో కనుక్కోగలరా?'

కాదనలేక పోయింది నిలయ. ఆయన మీద గౌరవంతో గాని అభిమానంతో గాని ఒప్పుకోలేదు. రాక్షసుడిలాంటి తండ్రి తప్ప తల్లి లేని ఆ పిల్లమీద జాలితో లోపలికి నడిచింది. కానీ ఇరుగుపొరుగువాళ్ళు ఇది వరకటినించి బాగా ఎరుగున్నవాళ్ళు చుట్టుపక్కల ఉండగా వాళ్ళెవర్నీ ఈసాయం కోరకుండా తనని చూడగానే ఎందుకు పిలిచారన్న అనుమానం మాత్రం చోటు చేసుకుంది మనసులో.

'అదిగో! ఆ గదిలో ఉంది' కుడివైపు గది చూపించి ఆయన వీధిలోకి వెళ్ళిపోయారు. మెల్లిగా ఆ గదిలో అడుగుపెట్టింది నిలయ గోడకానుకొని, మోకాళ్ళల్లో తలదూర్చి కూర్చున్న ఆ అమ్మాయిని చూడగానే సానుభూతిలాటి దేదో గుండె నిండింది నిలయకి. అడుగుల చప్పుడుకి తలెత్తి చూసిందామ్మాయి. చక్రాల్లాంటి ఆ కళ్ళు ఆకర్షించాయి నిలయని. నీళ్ళు నిండిన కళ్ళని చటుక్కున కొంగుతో అద్దుకుని, తడబడుతూ లేవబోయింది. 'ఫరవాలేదు కూర్చో!' అంటూ తనకూడా ఆ అమ్మాయి ఎదురుగా కూర్చుంది నిలయ. 'క్రింద కూర్చున్నారు. చాప వేస్తాను' అంటూ అంత విచారంలోనూ లేవబోయిందామ్మాయి.

'ఫరవాలేదు' అంటూ ఆపేసింది నిలయ.

'నీ పేరేమిటి?'

'జయ.'

'చూడు జయా! నేను నీ అక్కలాంటి దాన్ని. నాతో మనసువిప్పి చెప్పడానికి సందేహించకు. అన్నట్టు నేనెవరో నీకు తెలియదు కదూ! మీ నాన్నగారు పనిచేసే ఆఫీసులోనే, నేనూ ఉద్యోగం చేస్తున్నాను. నేను తప్ప మా ఇంట్లో మరెవరూ లేరు. ఒంటరిదాన్ని. నా పేరు నిలయ. నేనింటికెళ్తుంటే మీ నాన్నగారుచూసి పిల్చారు. నువ్వెందుకో ఏడుస్తున్నావని, ప్రయత్నించి కారణం ఏవిటో కనుక్కోమని అడిగారు. నాకు మీ నాన్నగారి గురించి అంతా తెలుసమ్మా. నేను మీ అక్కచెల్లెళ్ళు నెవర్నీ చూడకపోయినా, మీ అమ్మగారు పోయిన వార్త విని మీ అందర్నీ తల్చుకుని చాలా బాధపడ్డాను' జయ భుజంచుట్టూ చెయ్యివేసి దగ్గరికి తీసుకుంది నిలయ.

వెచ్చని ఆకౌగిట్లో ఒదిగిపోయిందిజయ.

'చెప్పు జయా! నువ్వెందుకు బాధపడుతున్నావో చెప్పు.'

కళ్ళల్లో నీళ్ళు కొంగుతో తుడుచుకుంది జయ. 'మా ఇంట్లో అందర్లోకీ నేనే పెద్దదాన్ని. ఎలిమెంటరీ స్కూలు చదువు తప్ప మరే చదువూ ఎరగను. తొమ్మిదో ఏటనించీ ఇంట్లో అమ్మకి పనుల్లో సాయం చెయ్యడం, చెల్లెళ్ళని ఆడించడం ఇవేనా అనుభవాలు. అప్పటినించీ ఇప్పటిదాకా అలాగే ఒకే బాటలో నడుస్తోందీ బండి. ఇటొచ్చి అమ్మ పోయాక ఇంకా బాధ్యతలూ, పనులూ ఎక్కువయ్యాయి.' ఒక్కక్షణం చెప్పడం ఆపింది జయ. 'పనులెక్కువయినా, బాధ్యతలెక్కువయినా నేను బాధపడలేదు. ఆఖరికి 'నాన్న నాకు పెళ్లిచెయ్యడా అసలు' అన్నది కూడా నా బాధకి కారణం కాదు.'

మరేమిటన్నట్టుగా చూసిన నిలయ కళ్ళల్లో త్వరగా కారణం తెల్సుకోవాలన్న ఆత్రుత కదలాడింది. **(ఇంకా ఉంది)**

# 'గర్ల్ ఫ్రెండ్సుతో సబ్జెక్ట్ గురించే చర్చిస్తాను'

'డాక్టర్ డాక్టర్‌ని పెళ్లి చేసుకోవడం లాభం వుంటుంది. కాని, నేను చేసుకోను'—అన్నాడు ఫైనల్లో ఎం. బి. బి. ఎస్. ఫోర్త్ ఇయర్ విద్యార్థి ఎన్. క్రిష్ణ.

'మీ రెందుకు చేసుకోరు? స్టూడెంట్ లైఫ్‌లో కొంతమంది మెడికల్ స్టూడెంట్సు ప్రవర్తన తెలుసు గనకనా?' అనడిగాను.

'మంచి బాలుడు రాము' లాంటి క్రిష్ణ నా ప్రశ్నకి నవ్వుతూ తల పంకించాడు.

## క్విక్ ఇంటర్వ్యూ

'మెడికల్ స్టూడెంటుని అని చెప్పుకోవడం గొప్ప. ఈ గొప్పకోసం చదివే వాళ్ళుకూడా వున్నారు...' అన్నాడు విద్యార్థుల గురించి చదువు మీద ఆసక్తి గురించి అడిగినప్పుడు.

'రేగింగ్ వుండాలి. జూనియర్‌గా వున్నప్పుడు నన్ను రేగ్ చెయ్యకపోతే చాలమంది సీనియర్లు తెలిసివుండరు. ఈ రేగింగ్ వల్ల ఒక రకమైన అండర్ స్టాండింగ్ ఏర్పడుతుంది' అన్నాడు.

గర్ల్ ఫ్రెండ్సుతో సబ్జెక్టు గురించి మాత్రమే మాట్లాడే ఈ మంచి బాలుడు ఎప్పుడూ ఫెయిల్ కాలేదు. సినిమాలు తక్కువగా చూస్తాడు. అసలు చూడనివాడికిందే లెక్క.

శివాజీగణేశన్ తప్పితే అభిమాన తారలు లేరు.

సిగరెట్టు తాగడు. హాస్టల్లో వుండటం లేదు గనక ఇతర అలవాట్లూ లేవు స్నేహితులూ తక్కువే.

తీరిక సమయాల్లో 'కె' అని 'కుమార్' అని కార్టూన్లు గీస్తూ వుంటాడు.



ఎన్. క్రిష్ణ

'మెడికల్ కాలేజీలో అడ్మిషన్ కష్టం. కాని, నాకు మెరిట్ వల్లనే సీట్ వచ్చింది. ఇది చాలా కాస్ట్లీ ఎడ్యుకేషన్' అన్నాడు.

కోర్సు పూర్తి కాగానే పి.జి. చెయ్యాలని—డిగ్రీ రాగానే గ్రామాలకి వెళ్లి మధ్యతరగతి, బీదవాళ్లకి సేవ చెయ్యాలని క్రిష్ణ ధ్యేయం.

—సిక రాజు.

# ఒక వారం విపరీతం
## ఫాలాక్షుడు

### విమానంపై

6వ తేదీ బొంబాయి నుంచి కలకత్తాకు వెళ్తున్న బోయింగ్ విమానం మీద పిడుగుపడిందట. ఆ పాటుకు విమానం తానెగురుతున్న ఎత్తునుంచి 300 మీటర్లు గబుక్కున దిగిపోయిందట. ప్రయాణీకులందరు తమ తమ సీట్లల్లోంచిఎగిరి క్రిందపడి, గోలపెట్టారట. విమాన చోదకులు మాత్రం విమానాన్ని ఒడుపుగా నేలకు దింపారట. విండ్‌షీల్డు, రాడార్ పరికరాలూ దెబ్బతిన్నా ఆ విమానం శాంతాక్రజ విమానాశ్రయంలో సురక్షితంగా దిగిందట. 145 మంది ప్రయాణీకులు బ్రతుకుజీవుడా అనుకున్నారట.

### అరటిపండుకారణంగా హత్య!

రాబర్ట్‌సన్‌పేటకు సమీపంలో వున్న స్వామినాథపురంలో సీతారామన్ వో రాత్రి ఏడు గంటలు ప్రాంతంలో వో అరటి పళ్ళ కొట్టుకువెళ్ళి, పళ్ళు కొనుక్కుని తింటున్నాడట. ఈలోగా అక్కడికి కోదండం అనే అతను వచ్చి అరటిపండో టిమ్మని కొట్టువాడిని అడిగితే సీతారామన్ యిచ్చాడట. దాంతో వారిద్దరికీ మాటామాటా పెరిగిందట. ఆవేశంతో కోదండం అక్కడందుబాటులో వున్న క్షవరం కత్తితో సీతారామన్‌ని పొడిచి చంపేశాడట.

### ఏడుకొండలవాడిఆదాయం పెరుగుదల

ఏడుకొండలవాని మే ఆదాయం 47 లక్షలట. పోయినయేడు మే నెల ఆదాయం 45 లక్షల 50 వేలట. అనగా యీ మే నెలకు లక్షన్నర పెరిగిందన్న మాట.




### హోటల్ రూమ్‌లో రెండు శవాలు

బెంగుళూరు కాలాసిపాళెంలోని వో హోటలుకు యిద్దరు వ్యక్తులు వెళ్ళి, తాము రామకృష్ణా మిల్స్ మధురకు చెందిన వారమని చెప్పి వో రూము తీసుకున్నారట. ఆ మర్నాడు వారు తలుపులు ఎంతసేపటికి తీయకపోయేసరికి, ఆ విషయంలో పోలీసులు కలుగజేసుకుని తలుపులు పగలేసి చూశారట. లోపల వో యువకుని శవం ఫ్యానుకు వ్రేళ్ళాడుతోందట మరో యువకుడు స్పృహతప్పి మంచం మీద పడున్నాడట. అతను విషం త్రాగి వుండుండాలని పోలీసు అభిప్రాయపడ్డదట.

### లారీ ప్రమాదం, ఎస్. ఐ. మరణం

కావేరిపాక్కానికి చెందిన పోలీసు సబ్ ఇనస్పెక్టరు శ్రీరాములు అనే ఆయన మద్రాసుకు స్కూటరు మీద వెళ్తూండగా దారిలో శృంగవారిసత్రం అనే చోట వో పెట్రోలు లారీ ఢీ కొందట. ఆ ఢీకి శ్రీరాములుకు విపరీతమైన గాయాలయి— వైద్య సహాయం లభించేలోగానే చనిపోయాడట. శ్రీరాములుకు 26 ఏళ్ళట!

### చిన్నపిల్లలు-గర్భస్రావాలు!

లండన్‌లో గర్భస్రావాలు చాలా చిన్నపిల్లలు కూడ చేయించుకుంటున్నట్టు అక్కడి లెక్కలు తేల్చాయట. 1971 లో గర్భస్రావాలు చేయించుకున్నారిలో 2296 మంది పదహారేళ్ళల్లోపువారట. 11 ఏళ్ళ వయసున్న ముగ్గురు అమ్మాయిలు, 12 సంవత్సరాలు అమ్మాయిలు పదహారు మంది, 13 ఏళ్ళవాళ్ళు 77 మంది, 14 ఏళ్ళవాళ్ళు 529 మందీ వున్నారట. మొత్తం ఆ ఏడు 1,26,777 మంది గర్భస్రావాలు చేయించుకున్నారట— రికార్డు కెక్కనివి మరెన్నుండవూ! వైనాట్! దేశం గొడ్డుపోయింది!

### అతనికం టెఘనుడు...!

పాకిస్తాన్‌కు చెందిన ముల్తాన్‌లో యునైటెడ్ డెమోక్రటిక్ ఫ్రంట్ బహిరంగ సభను చిన్నాభిన్నం చేసి భీభత్సం గావించడానికి భుట్టో పార్టీవారో మూడొందల సంచుల నిండా పాములను, తేళ్ళను సిద్ధపరచుకున్నారట. కానీ వాటి అవసరం లేకుండానే, అంతకుమించిన తెలివైన పోలీసులు ఆసభ ఏర్పాటు చేసుకున్న పందిరినీ, కుర్చీలను తీసిపారేశారట. సభ జరగనీల్లేకుండా— అసలనికరలే ఫేమ దాకంటు మళ్లన్నంటే యిదే కాబోలు!

### పోతపాలవల్ల ప్రమాదం

ఏడాదిలోపు పసిపిల్లలకు పోతపాలు పోయడం చాలా హానికరమనీ, దానివల్ల పిల్లల మూత్రపిండాలు సరిగా పనిచేయవనీ, ఆ తరువాత మెదడు కూడా దెబ్బతింటుందనీ బ్రిటనుకు చెందిన వో డాక్టరుగారన్నారట. కనీసం మొదటి మూన్నెల్ల వరకైనా తల్లిపాలే పిల్లలకు శ్రేష్ఠమని ఆయనన్నారుట— శ్రేష్ఠమేగాని వుండొద్దూ!

### మూఢనమ్మకం

న్యూయార్క్‌లో రివరెండ్ జిమ్మిరే, విలియమ్స్ అనే ఆయన, బుల్‌ఫోర్డ్ ఫాక్ట్స్ అనే ఆయన విషం త్రాగి, మరణించారట. వీరిద్దరూ, 'విషం త్రాగినా, విషజంతువులు కరచినా తమకు ఏలాటి అపాయమూ కలుగ'దని నమ్మే వో మతానికి చెందిన వారట— అదేం మతం!!




### పుట్టబోయే శిశువు ఆడా-మగా!

గర్భస్థశిశువు ఆడో మగో నికచ్చిగా తెలుసుకునే విధానం మీద వైద్యశాస్త్రం విపరీతమైన కృషి చేస్తున్నదట. గర్భిణీ స్త్రీ గర్భంలోకి వో సూది గుచ్చి, గర్భస్థశిశువు చుట్టూవున్న అమినియోటిక్ ద్రవాన్ని కొంచెం బయటకు తీసి, దాన్ని ప్రయోగాలతో చూసి, పుట్టేదిపిల్లో,పిల్లాడో తేలిపోతుందట— ఇంతెందుకు గర్భిణీ స్త్రీ తలలోంచో పేను ఏరి, దాన్ని గచ్చుమీదవేసి, దానిమీద కొంచెం యిసుక పోయండి. —పేను ఆ యిసుక కుప్పపైనుంచి వస్తే మగపిల్లాడు, పక్కనుంచి నుంచి నేలబారుగా వస్తే ఆడపిల్ల —యీ థియరీ మా అమ్మమ్మ ఏనాడో చెప్పి పదిమందిచేతా రైటనిపించుకున్నది.— ఇ ప్లెప్పే యే కైండాఫ్ సైన్స్— యూ సీ!

### తండ్రి ప్రేమ కరువైందని కుమార్తె ఆత్మహత్య

పుత్తూరుకు చెందిన కొట్టాయి అనే గ్రామంలో 40 ఏళ్ళ అమ్మాచి అనే విధవ తన ముగ్గురు పిల్లలతోనూ వుంటుండేదట. పక్క గ్రామంలో వున్న ఆమె తండ్రి ఒకనాడు ఆమె యింటికి వచ్చి ఆమె కూతురు పాప్పాతిని తన కొడుక్కి యిచ్చి పెళ్ళి చేయమని అడగాడట. తన కూతురింకా పెద్దమనిషైనా అవలేదని, ఆనక పెళ్ళి విషయం ఆలోచించవచ్చునీ అమ్మాచీ అన్నదట. దాంతో తండ్రి కూతుళ్ళకు మాటతేడాలొచ్చి పోట్లాటవరకూ వెళ్ళేసరికి భోజనం చేయకుండా ఆ తండ్రి వెళ్ళిపోయాడట. అమ్మాచీ మనస్సు గాయపడి తనిక బ్రతికి నిష్ప్రయోజనమనుకుందట. భర్తలేని తనకు తండ్రి ప్రేమ కూడా కరువయ్యిందని ఏడ్చిఏడ్చి ఆరాత్రి గ్లాసుడు పాలలో విషం కలిపి కూతురు పాప్పాతికి, రెండో కొడుకు తంగవేలుకు యిచ్చి తానూ త్రాగిందట. ఆనక ముగ్గురూ ఒకే మంచం మీద పడుకున్నారట. సినిమా నుంచి వచ్చిన పెద్దకొడుకు గోవిందరాజు తలుపు తట్టితట్టి విసుగెత్తి తలుపు విరక్కొట్టి లోపలకు వెళ్ళిచూస్తే, తల్లీ, చెల్లెల్లూ, తమ్ముడూ ఒకే మంచంమీద చనిపోయున్నారట.

### సినిమాపిచ్చి — భర్త చీవాట్లు-భార్య ఆత్మహత్య

బెంగుళూరు మాగడిరోడ్డు ప్రాంతంలో నివసిస్తున్న 20 ఏళ్ళ శాంతలక్ష్మికి సినిమా పిచ్చట. రోజూ సినిమా కెళ్తూండేదట. ఇది ఆమె భర్తకు నచ్చక,వారిస్తూండేవాడట.కానీ ఆమె వినిపించుకునేది కాదట. ఓ రోజు పదిగంటలాట చూసి యింటికి తిరిగొచ్చిన శాంతలక్ష్మిని అతను నానామాటలూ అని 'ఇలా సినిమాలు చూస్తే కొంపేం ఎత్తిరిల్లుతుంది' అని చీవాట్లు వేశాడట. దాంతో ఆమె మనసు గాయపడి, భర్త వుద్యోగానికి వెళ్ళాక, వురిపోసుకుని నిండు ప్రాణాలు తీసుకుందట.

### నడకలో కొత్త రికార్డు

పూనా మునిసిపల్ స్పోర్ట్స్ స్థలంలో హర్బన్‌సింగ్ 164 గంటల 55 నిముషాలపాటు ఏకథాటిని నడిచి 1961 లో నైరోబీలో గిల్బర్ట్‌లోబో 161 గంటలు నడచి సృష్టించిన ప్రపంచ రికార్డును బ్రద్దలు కొట్టవతల పారేశాడట. అంటు 171 గంటలు నడుద్దామని ప్రారంభించి, డాక్టర్ల సలహామీద ఆ పని విరమించి, 164 గంటల 55 నిముషాలకు తన నడక ఆపు చేశాడట.

### బొంగ్లాలో భారత్ జోక్యం—భషానీ నిరసన

బాంగ్లాదేశ్ వ్యవహారాలన్నిటిలోనూ భారతదేశం జోక్యం కల్పించుకోడాన్ని నిరసిస్తూ జూన్ ఆరవ తేదీ నుంచి భారతదేశపు వస్తువులన్నిటినీ బహిష్కరించి తీరాలని బంగ్లాదేశ్ జాతీయ అవామీపార్టీనాయకుడు మౌలానా అబ్దుల్ హమీద్‌ఖాన్‌భాషానీ అక్కడి జనవాహినిని కోరారట— భినూ వ్యాపారాలలోనూ, బ్యాంకుల నిర్వహణల్లోనూ, ప్రభుత్వ వాణిజ్యసంస్థలు పని చేయాల్సిన తీరుల్లోనూ బంగ్లాదేశ్ అధికారులకు శిక్షణనివ్వడానికిభారద్దేశం సర్వసిద్ధంగా వుందనిచవాన్ అన్నారట— మరిదేవిచెప్మా! నప్పచ్చ: కర్చిచ్చిత్ బ్రూయాత్ అన్నారార్యులందుకే!

### దొంగతనానికి ఉరిశిక్ష!

జావెర్గి (గుల్బర్గా) గ్రామ సమీపంలో ఆవూరికి చెందిన ఓ ముగ్గురు వ్యక్తులు సిద్దప్పదేవప్ప అనే హరిజన యువకుణ్ణి పట్టుకుని వురితీసి, అతను గిలగిల తన్నుకునేవరకూ కాపలా నించున్నాడట. ఈ హరిజన యువకుడు ఆ వూళ్ళో కొన్ని యిత్తడి పాత్రలూ, ధాన్యం దొంగతనం చేశాడన్న నేరం మీద ఆ ముగ్గురూ చేరి అతనికి వురి శిక్ష ఖాయపరచి, అమలుజరిపారట. పోలీసులా ముగ్గుర్ని నిర్బంధంలోకి తీసుకున్నారట.

### న్యూయార్క్ వెళ్తున్న నటరాజు విగ్రహం పట్టివేత

75 లక్షలు విలువజేసే నాలుగడుగులెత్తున్న నటరాజవిగ్రహాన్ని కలకత్తా నుంచి న్యూయార్క్‌కు ఎవరో రహస్యంగా పంపుతూంటే అక్కడి విమానాశ్రయ అధికారులు టక్కున పట్టేశారట— 8 వ తేదీరాత్రి జరిగిందిది.

### భార్యని చంపిన భర్త

19—9—72వ తేదీన కోటలపల్లికి చెందిన బిచాలరంగయ్య అనే ఆయన తన భార్య లక్ష్మీదేవమ్మను చంపి, వెలుపమడుగు అనే గ్రామంలోపూడ్చిపెట్టాడట. ఈ విషయం కోర్టులో నిర్ధారణయినందువల్ల అడిషనల్ సేషన్సుజడ్జి బి.ప్రసాదరావుగారు తానికి మూడేళ్ళు కఠినశిక్ష విధించారట.




# కథ

... కె. ఎస్. వి. నరసింహామ్

ఆకాశం అందంగా ఉంది.'

అమ్మాయిలందరూ అందవికారంగా తయారౌతూన్న కాలంలో ఆకాశం కన్నా అందంగా అగుపించేది ఇంకేముంది?

అరుణతో ఆ మాటే అన్నాను.

నవ్వింది—'మీ ఉద్దేశం?'—

'దురుద్దేశం కాదు—'

'దురుద్దేశాలు మీకు చేతకావు—'

'థేంక్స్'—. అన్నాను.

నవ్వింది.

'కొందరు అమ్మాయిలైనా కొంత అందంగానైనా నవ్వగలుగుతున్నారు కాబట్టి—నాలాంటి వాళ్ళం ఇంకా బ్రతికుండ గలుగుతున్నాం......'

సిగ్గును నవ్వులో నొక్కి పట్టింది 'ఇవాళ ఇన్‌జనరల్ ఆడవాళ్ళనీ—ఇన్ పర్టిక్యులర్ నన్నూ—అవమానం చేస్తున్నారు—'

'అవమానమా?—అంత మాట!—'

'పోనీ—అవహేళన—'

'బ్రతికించారు—'

'ఇంతకీ మీరనేదేమిటి? మోడరన్ గర్ల్స్‌లో అందం తగ్గిపోయి అలంకారాలు పెరిగిపోతున్నాయి—అంతేగా?—'

'నా అభిప్రాయాన్ని మీరు సూక్ష్మంగా ఉపన్యసించారు'—

'థేంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్', మళ్ళీ నవ్వింది— 'ఆడవాళ్ళకి సూక్ష్మ దృష్టి ఉందని ఒప్పుకున్నారు—'

'తప్పకుండా ఉంది. కాని, మరీ ఎక్కువగ ఉంది — మనిషిని మనిషిగా కాక అస్థిపంజరంలా చూసేదాకా—'

'అదిగో—మళ్ళీ—'

'సారీ—'

రెండు క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి.

'రెండు క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి—' అన్నాను వాచీ చూసుకుంటూ.

'మీరు కథకులు కావలసింది.' అంది నవ్వుతూ—

'కథలు వడిసే వాళ్ళు కథలు రాయలేరు—' అన్నాను.

'మీతో ఇకమీద మాట్లాడను—' అంటూ లేచి నిలుచుంది. 'చీరంతా దుమ్ము పట్టింది—' అంటూ దులుపుకుంది.

'దుమ్ము కాదు—ఇసక—'

'నా బుర్ర ఇసక'—

'పొయిట్రీ వస్తోంది గవును—'

'ఉన్న తెలివి కాస్తా పోతోంది—పొయిట్రీ వస్తోందంటే—రాదూ మరీ—'

ఇద్దరం వెర్రిగా నవ్వుకున్నాం.

'యూనివర్శిటీ కాంపస్‌లో మనకన్నా వెర్రివాళ్ళుంటారనుకోను—' అంది, తలెత్తి చుక్కల్ని చూస్తూ, హాయిగా గాలి పీలుస్తూ.

'వేననుకుంటాను—', అన్నాను.

నా ధోరణి అలాంటే గనక అరుణ ఆశ్చర్యపోలేదు. 'ఎవరుంటారు?—' అంది.

'మిస్టర్ ఆనందరావ్...'

ఉలిక్కిపడి, రాత ఆపి తలెత్తాడు ఆనందరావు.

మేడమ్ కళ్ళు రోషంగా మెరుస్తున్నాయి 'మిస్టర్ ఆనందరావ్—ప్లీజ్ గో ఔటాఫ్ ది క్లాస్–ఇఫ్ యూ హావ్ గాట్ ఎనీ అదర్ వర్క్—' మేడమ్ గొంతు కూడా రోషంగా ఉంది.

రాస్తున్న కాగితాలూ, ప్యాంట్‌కి దుమ్ము కాకుండా బెంచీ మీద పరుచుకున్న కర్చీఫూ తీసుకుని క్లాసులోంచి వెళ్ళిపోయాడు ఆనందరావు.

ఆ తరువాత కథను ఎలా పొడిగించాలో తెలియలేదు ఆనందరావుకు. మేడమ్ తనని క్లాస్ లోంచి వెళ్ళిపొమ్మన్నందుకు బాధగా లేదు. తొలిసారిగా క్లాసులో కథ రాయాలని ప్రయత్నించి ఫెయిలై పోయానే అని విచారించాడు. పోనీలే—తనకు దొంగతనంగా పనులు చెయ్యడం చేతకాదు — అంటూ సమాధాన పడ్డాడు.

ఇంతకీ అసలు సంగతేమిటంటే ఆనందరావు క్లాసులోనే అరుణ అనే అమ్మాయి ఉంది.

అరుణ అందంగా ఉంటుందా లేదా అని ఆనందరావు ఎన్నడూ ఆలోచించలేదు. ఆ మాటకొస్తే ఏ ఆడపిల్ల అందం గురించి గానీ అతను పట్టించుకోలేదు. అతనికి ఆ కోరికా లేదు తీరిక అంతకన్నా లేదు.

అరుణ చాలా కొంటె పిల్ల.

ఇంకా చెప్పాలంటే— దొంగ పిల్ల.

ఆ వేళ మేడమ్ క్లాసు మొదలైన కొద్ది నిమిషాలకి, ప్రక్కనే కూచున్న మోహన్రావు తన నోట్‌బుక్‌లో ఇలా రాసి ఆనందరావుకు చూపించాడు!

'బుజ్జి ఇంగ్లీష్ డ్రామాకాక వేరే ఏదో పుస్తకం చదువుతోంది చూడు—'

('బుజ్జి'—అరుణకుగల ముద్దుపేర్లలో ఒకటి—ఇంకొందరైతే మరీ ముద్దుగా 'బజ్జీ—' అని కూడా రిఫర్ చేస్తుంటారు—)

చూశాడు ఆనందరావు. అవును నిజమే! అరుణ వేరే ఏదో పుస్తకం చదువుతోంది. అది తెలుగు పుస్తకమని స్పష్టంగా తెలుస్తూనే ఉంది. కాని, దానికి వేసిన అట్టమాత్రం పెద్దమనిషి తరహాగా ఉంది. అందుకే మేడమ్ దాన్ని కనిపెట్టలేదు.

ముందు బెంచీలో మొదటిగా కూచున్న అరుణే అంత ధైర్యంగా పాఠాలు కాని పాఠాలు చదువుతూ ఉంటే తనుమాత్రం ఈ మేడమ్ చెప్పే ఇంగ్లీష్ డ్రామా బోర్‌ను భరించలేకపోతూ కణతలు నొక్కుకుంటూ ఎందుకు కూచోవాలి? అనుకున్నాడు ఆనందరావు. అందుకే క్లాసులోనే కథ రాయడం మొదలుపెట్టాడు. కథలో మొదటి మూడులైన్లూ రాశాక హీరోయిన్ పేరుకి అరుణపేరే పెట్టుకున్నాడు.

పేజీ తిప్పడానికి కలం ఎత్తడం తప్ప; మొదలు పెట్టినవాడు మొదలుపెట్టినట్టే ఒకటిన్నర పేజీలు పరపరలాడించేశాడు. కాని, ఏముందీ — అంతలోనే పట్టుబడి పోయాడు!

లైబ్రరీకి వెళ్ళి సెక్స్ పుస్తకంలో ఒక ఛాప్టరు చదివాడు. క్యాంటీన్‌కు వెళ్ళి మంచినీళ్ళు తాగాడు. సిగరెట్టు వెలిగించి 'క్వీన్స్‌రోడ్' (అది అమ్మాయిల హాస్టల్ రోడ్డుకి అబ్బాయిలు ఉంచుకున్న పేరు) మీద వస్తుండగా 'బొంయ్యి'మని సైరను కూసింది.

నిమిషాలమీద అమ్మాయి లందరూ బిల బిలమంటూ క్లాసుల్లోంచి వచ్చేశారు. అల్లంత దూరాన్నుంచే తన ఆడక్లాసు మేట్లనుచూసి, శ్రీశ్రీ పోజ్‌లో సిగరెట్టు లాగుతూ తల ప్రక్కకి తిప్పుకున్నాడు ఆనందరావు. తనని చూసిందో లేదోగాని, అరుణ ఆడస్నేహితురాండ్రలో ఎవరితోనో ఏదో మాట్లాడుతూ ఎందుకో నవ్వుతోంది. గీతాంజలి, అమృతవల్లి, శ్రీలక్ష్మి (శ్రీలక్ష్మి వాళ్ళలో ఉందా లేదా?) కూడా కిలకిల కిలకిలమంటూ నవ్వారు. తనని చూసి నవ్వ లేదు కదా అనుకోలేదు ఆనందరావు. చాలా విషయాల్లో ఎన్నర్లీ కేర్ చెయ్యక పోవడం ఆనందరావుకు అలవాటే!

తరువాత మోహన్రావు చాలా బాధ పడ్డాడు 'అనవసరంగా మేడమ్ దగ్గర చెడ్డ అనిపించుకున్నావే—' అని వాపోయాడు.

ఆనందరావు నవ్వేశాడు.

'నా బాధ అదికాదు — కథ పూర్తి కాలేదే—అని' అందామనుకున్నాడు. కాని అనలేదు.

అంటే మోహన్రావు ఆశ్చర్యపోతాడు. ఆశ్చర్యపడే ముఖాల్ని చూడడం ఆనంద రావుకు ఇష్టం లేదు.

* *

'ఇష్టం ఉన్నా లేకున్నా మొదలుపెట్టిన పని చివరంటా చెయ్యడం ఆనందరావు అలవాట్లలో ఒకటి. ఏదైనా పని మొదలు పెడితే అది పూర్తయేదాకా అతనికి విశ్రాంతి ఉండదు. రాత్రిళ్ళు నిద్ర అసలుండదు.

అయితే ఇప్పుడెలా?

ముందుగా ప్లాట్ సిద్ధం చేసుకోకుండా కథ రాయడం ఆనందరావుకు అలవాటు లేదు. మొదలుపెట్టిన కథ ముగించక్కు పోవడంకూడా అతనికి అలవాటు లేదు.

మరెలా?

ప్లాట్ తయారుచేసుకోకుండా హటాత్తుగా క్లాసులో మొదలుపెట్టి ఒకటిన్నర పేజీతో ఆపేసిన ఆ కథ గతి ఏమిటి? రాసిన కాగితాలు చించి పారేద్దామనుకున్నాడుగాని, నిందుకో అతని మనస్సు (అంతరాత్మ సంగతి అటుంచి) ఒప్పుకో లేదు. అప్పటికే యాభై కథలదాకా ప్రచు రించిన అతని అనుభవానికి అలా చెయ్యడం తలవంపు అనిపించింది.

అసలు కథంటూ మొదలు కావడమే గొప్ప; తీరా మొదలయ్యాక అది ఏదో ఒక పడక నడిచి ఏదో ఒక మలుపుతిరిగి ఎల్లాగో ఓలాగా అంతంకావాలి కదా?!?—

అరుణ కథలో నిజంగా తలనొప్పి వచ్చింది ఆనందరావుకు. 'మేకవ్వాల పిల్ల— అనవసరంగా దాన్నెందుకు తెచ్చి నా కథకో పెట్టుకున్నాను?' అని తనని తాను తిట్టుకున్నాడు. అరుణ పేరు పెట్టుకున్నంత మాత్రాన ఆవిడే కథానాయిక కావాలని ఎక్కడుంది? — అనుకున్నాడు. కాని ఎంత కాదనుకున్నా అతిపోయిన కథలోని హీరోయిన్ని తలుచుకునే సరికల్లా అరుణ అరుణగానే కళ్ళముందు కదులు తోంది.

అరుణ అరుణగా చాలాకొంది కళ్ళ ముందు మెదులుతుందని ఆనందరావుకు తెలుసు. బి. ఏ. మూడోసారి తప్పి నాలుగో సారి మళ్లీ పరీక్షలకి కూర్చునే మిష మీద మళ్ళీ యూనివర్శిటీకి వచ్చి హాస్టల్‌లో పేయింగెస్ట్‌గా జేరి రోజూ సాయంత్రాలూ అతి ట్రిమ్ముగా ముస్తాబై (అరుణ క్యాంటీన్‌కు వస్తుందని తెలిసి) క్యాంటీనో కొన్ని పోజులు కొట్టే నరేంద్ర; అరుణను గురించి ఎక్కడెక్కడెక్కడేమనుకున్నాడ్ను

# కథ

జకొస్లొవేకియన్ ఓవ్ రికార్డర్‌లా మెదళ్లో రికార్డు చేసుకుంటూ ఆయా వివరాలన్నీ (సొంత కవిత్వంతో సహా) ఆవిడ చెవుల్లో ఊదుతూ— ఆవిడ నోటి నుండి ఊడిపడే ప్రతిమాటకీ చంద్రకాంతి కోసం చకోరంలా నిరీక్షిస్తూ—టెక్స్టు బుక్స్పు, నోట్సు, గైడ్సు— ఆవిడ ఏది కోరితే అది క్షణాల మీద సప్లయి చేసే రమేష్, 'అరుణ గురూ — భలే అమ్మాయి గురూ — భలే ఉంటుంది గురూ—' అంటూ బుర్రకథ దళంలో పనిచేసిన వాడిలా తనకు తానే తందాన్లు చెప్పుకునే 'తెలుగు ఎం. ఏ. ప్రభాకర్—...ఇలా చాలా మందికి అరుణ పట్ల ఆసక్తి ఉందని ఆనందరావుకు తెలుసు.

కాని, ఏం లాభం?

అరుణ హీరోయిన్‌గా పనికిరాదేమోనని సందేహిస్తుంటే ఈ అబ్బాయిలు అసలు సైడ్ హీరోలుగా కూడా పనికిరారేమో అనిపించేలా ఉన్నారు.

మూడున్నర వారాలు కుస్తీలు పట్టి అరుణకో లౌ లెటర్ రాశాడు నరేంద్ర. రాశాడేగాని దాన్ని పోస్ట్ చెయ్యలేదు. ఇంకె ప్పటికీ చెయ్యడు కూడా. పోనీ—తన కథలో నరేంద్ర లెటర్ పోస్ట్ చేసేసినట్టు రాద్దామా అనుకున్నాడు ఆనందరావు. కథ తను రాసి నంతవరకూ 'నేను' అనే రాశాడు. ఇంత వరకూ హీరోయిన్ హీరోని ఏ పేరుతోనూ సంబోధించలేదు. కాబట్టి హీరో ఎవరైనా కావచ్చు. నరేంద్ర కావచ్చు—కాకపోవచ్చు. ఇంకో సురేంద్ర కావచ్చు, మరో రవీంద్ర కావచ్చు—

నరేంద్ర పేరు పెడితే నరేంద్ర సంతో షిస్తాడు. కాని, కథ చదివితే అరుణ సంతోషించదేమో! అరుణ కొంచెం పొట్టిగా' ఉంటుంది. కాని, నరేంద్ర అరుణ కన్నా (కనీసం ఒక అంగుళం) పొట్టిగా ఉండి, అతను ఆమెకు తమ్ము డేమో అనిపిస్తాడు. ఛ! — వీళ్ళిద్దరికీ ఈడూ జోడూ సరిగ్గా కుదరదు. అదోహటిన్నీ — అరుణ ఎం. ఏ ఫైనల్ అయితే-నరేంద్ర బి. ఏ.-ఇంకా ఫెయిలే! ఈ జంట అస్సలేమీ బాగులేదు. అదీకాక్క అరుణ కోసం ఉత్తరం పోస్ట్ చేసేపాటి ధైర్యం కూడా లేని నరేంద్ర-తను రాసే కథకి హీరో ఔతాడా?

కాలేదు.

రమేష్ చాలా మంచివాడిలా కనిపిస్తాడు; కాని, 'చాలా మంచివాడు' కాడు ఒట్టి 'కొంచెం 'మంచి' వాడు. కాకా రాయుడు. అరుణకూ అతనికీ మంచి జంట. (కాళి దాసు ఉపమానం ఉపయోగిస్తే—) నల్ల మబ్బులో బంగారు మెరుపు మెరిసినట్టుం టుంది...రమేష్ నవ్వు చూస్తే ఒవంద రావుకు మంట. అసహ్యం కూడా ను. మొదటి నుంచి హీరోయిన్‌తో మంచిగా ఉండి ఆమెను నమ్మించి చివరికి మోసం చేసే పాత్ర అతనికి ఇవ్వొచ్చు. తప్పకుండా ఇవ్వొచ్చు, అప్పుడు వాడు విలన్ అవు తాడు గాని, హీరో కాడే! ప్రస్తుతం కథకి కావలసింది హీరో! హీరో—హీరోయిన్, ఏర్పడితే-అవసరమైతే ఆ తరువాత కదా విలన్!!-ఇప్పుడే ఏం తొందరొచ్చింది?

ఆనందరావు రమేష్‌ను అవతలికి నెట్టే శాడు.

ప్రభాకర్‌కి అరుణ అంటే ఇష్టం; ఎందుకంటే అరుణ ఒక అమ్మాయి కాబట్టి, పెళ్లికాని ఏ ఆడదైనా సరే ప్రేమకు అర్హురాలేనని అతని సిద్ధాంతం. అమ్మాయి దాకా ఎందుకు — అల్లంత దూరాన ఒక చీర కనిపిస్తే చాలు అతను ప్రేమించెయ్య గలడు. చీర కనిపించడం దాకా కూడా అవసరం లేదు—గాజుల గల గల వినిపిస్తే చాలు—ప్రేమలో పడిపో గలడు. ప్రభాకర్ లాంటి వాణ్ణి కథకి హీరో చేసెయ్యడం సులువే! కాని, ఆ సులువులోంచి చాలా చిక్కులొస్తాయి. అప్పుడు ప్రభాకర్ హీరో ఔతాడేమోగాని, అరుణ హీరోయిన్ కాజాలదు. ప్రభాకర్‌కు గల అసంఖ్యా ప్రేయసీ గణాల లిస్టులో అరుణ అతిసులభంగా 'ఫేడౌట్' అయి పోతుంది. ఏదైనా ఒప్పుకుంటాడు గాని కథలో హీరోయిన్ని హీరో 'డామినేట్' చెయ్యడం మాత్రం సహించలేడు ఆనందరావు. స్త్రీలంటే అతనికి పక్షపాతం. హీరోకేముం దయ్యా?—ఏమీ లేదు. నవ్వులున్నా, సోకు లున్నా, ఏడుపులున్నా, ప్రేమలున్నా, సెక్సున్నా, త్యాగాలున్నా — అంతా హీరో యిన్‌తోనే, పాఠకుల సింపతీ యెప్పుడూ

హీరోయిన్ వేషే వుంటుంది గానీ, హీరో వేషముండదు—అడ పాత్రల్లోనైతే మరీని — అదీ ఆనందరావు (తెలుసుకున్న) ధీరి.

ఆనందరావు మెదడులో డైనమోలు తిరిగాయి.

మొదలైన కథ పూర్తి కాకుండా ఆగకూడదు. తను చచ్చయినా సరే — కథని పూర్తి చెయ్యాలి. పోనీ-హీరోయిన్ అరుణనే చంపేస్తే ?

ఎలా చంపడం? అసలెందుకు చంపడం?

తను మొదలెట్టిన ధోరణి చూస్తే అరుణ ఏంతో హాయిగా చలాకీగా నవ్వుతూ తుళ్ళుతూ (సిగ్గుపడుతూ కూడా) ఉంది. పాపం, అంత అమాయకురాలిని ఎందుకు చంపడం ? ఎలా చంపడం ?? ఆమెకు జీవితంలో సమస్య అంటూ కూడా ఏవీ ఉన్నట్టు లేవే !

మెరుపు కొట్టినట్టయింది.

అసలు తన కథలోనే సమస్య ఉన్నట్టు లేదే !?! ఎలా? మరెలా?

సమస్య లేకపోతే సంఘర్షణెక్కడిది ? సంఘర్షణ లేకపోతే క్లయిమాక్స్ యెక్కడిది ?—

బాబూ—ఈ కథ ఒక సమస్య అయి కూచుందే !

శభాష్ ! — బాగుంది—కథలో సమస్య లేదు గాని, కథే సమస్యగా వుంది.

అవును మరి—ఇది కథకుడి కథ—

(కంపోజిటర్ పొరబాటు లేదు — పైది కరెక్టే—) కాని, ఇంకా చెబితే—

ఇది కథకుడి వ్యథ.

కావ్యం లోంచి ప్రారంభమైన కథకి అరుణ హీరోయిన్ అయి కూచుంది. ఎలాగైనా సరే — కథ పూర్తి అయి తీరాలి. లేకపోతే కథకుడుగా ఆనందరావు 'ఆత్మ లోకంలో దివాలా' తీసిపోతాడు.

కథ జరగాలంటే కల్పన ఉండాలి.

కల్పన కుదరడం లేదు. మరైతే ఏం చెయ్యాలి ?

* * *

ఆరునెల్ల తర్వాత ఒకదినం రాత్రి ఒక ఇంటి వెన్నెల కురిసే డాబామీద మెత్తటి పరుపుమీద తెల్లటి దుప్పటిని పరిచి నవ్వుతూ ఒక యువతి అడిగింది 'నేనొక టడుగుతాను—ఏమీ అనుకోరు కదూ?—'

అలవాటైన పరధ్యానంతో పిట్టగోడ ప్రక్కగా పచార్లుచేస్తూ, సిగరెట్టు పొగ మేఘాల్ని వెన్నెల్లోకి వదులుతూ న్న యువకుడు ఆ మాట వినిపించుకోలేదు.

'ఏమండోయ్—మిమ్మల్నే—' అందామె అతనికి దగ్గరగా వచ్చి.

'ఏమిటి?—'

'ఒక సంగతి అడుగుతాను—ఏమీ అనుకోకుండా చెబుతారు కదూ?—'

'అడగు—'

'మీరు నన్నెందుకు పెళ్ళి చేసుకున్నారు?—'

'అంటే?—'

'అంటే—నేను ... మీకు ... ఎందుకు నచ్చాను?—'

యువకుడు — ఆనందరావు... యువతి— అరుణవేపు వింతగా చూశాడు. నిట్టూర్చాడు. 'అదంతా ఒక పెద్ద కథ—' అన్నాడు.

'అయితే చెప్పరు కదూ?—' అంది అరుణ.

'చెప్పడానికేముంది ? మనం ఫైనల్‌లో ఉండగా ఒకదినం డ్రామా చెబుతూ మేడమ్ నన్ను క్లాసులోంచి పంపించేసింది— గుర్తుందా?—'

'లేకేం ? నిజానికి ఆ క్లాసూ నాకు చెడ్డబోరు కొట్టింది—నేనూ ఏదో వేరే పుస్తకం చదువుకుంటున్నాను—అవునూ—



అనకాపల్లిలో జరిగిన నాటికలపోటీలో 'రాజీనామా' నాటికకు దర్శకత్వం వహించి ఉత్తమ దర్శకుడుగా బహుమతి పొందిన డాక్టర్ బి. జీ. వి. నరసింహారావు.

మీరప్పుడప్పుడేదో రాస్తూ వుండేవారు కదూ? ఏమిటి రాస్తున్నారు?—'

'కథ—'

'ఏమిటీ?!—'

'అవును, కథే—'

'—అయినా క్లాస్‌లోనా కథలు రాయడం?—'

'క్లాస్‌లో కథలు జరిగితే క్లాసులోనే రాస్తే తప్పా?—ఇంతకీ అది మనకథే—'

అరుణ అదోలా చూసింది.

'నిజం — నమ్ము — అది మన కథే—'

నమ్మిందో లేదోగాని నవ్వింది అరుణ.

ఆమె నవ్వు (కొంత అందంగా ఉంటుందని మొదట తెలుసు గాని) అంత అందంగా వుంటుందని అంతవరకూ తెలియదు ఆనందరావుకు.

తెల్లనివెన్నెల్లో ఆమె పలువరుస వింతగా మెరిసింది.

ఆమె కళ్ళు ఆకాశం వేపు చూస్తూ విచ్చుకున్నాయి.

'ఆకాశం అందంగా వుంది కదూ?...' అంది అరుణ పారవశ్యంగా.

ఉలిక్కి పడ్డాడు ఆనందరావు. నిలువునా వణికిపోయాడు.

అతని శరీరం మీద రోమాలు నిక్కబొడుచుకున్నాయి. ఏదో పట్టరాని హర్షం వల్ల అతని కళ్ళు చప్పున మెరిశాయి. అతని ఆనందానికి కారణమేమిటో అతనికి వెంటనే గుర్తు రాలేదు. ఆ నాడు క్లాస్ రూములో తను రాసిన కథలో మొదటి వాక్యం అతని మనస్సులో లీలగా మెదిలింది.

అతను కల్పించింది నిజమైందా?

లేక,

నిజాన్నే అతను కల్పించాడా ??

మనోనేత్రం ముందు దృశ్యాలు దృశ్యాలు కదిలి పోతూండగా అరుణ వంక అలాగే చూస్తూ, చలనం లేని రాతిబొమ్మలా చాలా సేపు ఉండిపోయాడు ఆనందరావు.

తన మాటకి అతని సమాధానం ఏమిటో పట్టించుకోకుండా చేతులు వెనక్కి ఆన్చి ముఖం పైకెత్తి ఆకాశం లోకి చూస్తూ, ఇంకా అదే పారవశ్యంతో తనకు తానే చెప్పుకుంటోంది అరుణ—

'ఆకాశం అం...దం...గా ఉంది...'

